# మీకూ - మీ గృహానికీ







భారతదేశపు హస్తకళలు
కేవలం అలంకారప్రాయమైనవే కావు.
నిత్యజీవిత ఉపయోగంలో
మీకు ఎంతో ఆనందాన్ని ఇచ్చేవికూడాను;
మానవ మేధ సంపూర్ణ వికాసము పొంది
హస్త నైపుణ్యం అత్యున్నతస్థాయి నందిన
గ్రామీణ పరిశ్రమల
బ్రహ్మాండమైన అభివృద్ధిని సూచించేవి.
అందానికి. ఉపయోగానికి అనుపమానమైన
విగా మీ గృహాలలో
తప్పనిసరిగా ఉంచుకోవలసినవి.

పనితనానికీ - ప్రయోజనానికీ
భారతదేశపు హస్తకళలు

**ఆల్ ఇండియా హాండిక్రాఫ్ట్స్ బోర్డు**
వాణిజ్య, పరిశ్రమల మంత్రిత్వశాఖ,
న్యూఢిల్లీ

DA 57/383

సంవత్సర చందా
రు. 13-0-0
విడిప్రతిక 25న.పై

# ఆంధ్రపత్రిక

## సచిత్ర వారపత్రిక

సంపుటము 52
సంచిక 29
12-3-58

**Founder : K. NAGESWARA RAO**

హేవిళంబి ఫాల్గుణ బహుళ అష్టమి బుధవారం

## ★ విషయానుక్రమణిక ★

★

ముఖచిత్రం:

'సేవిక' చిత్రంలో నిమ్మి



Statement about ownership and other Particulars about newspaper

**ANDHRA PATRIKA**
**Illustrated Weekly**

1. Place of Publication : 6&7, Thambu Chetty St., Madras-1.
2. Periodicity of its publication : Every Wednesday
3. Printer's Name : Sri S. Radhakrishna
   Nationality: Indian
   Address: 6&7, Thambu Chetty Street, Madras-1.
4. Publisher's Name : Sri S. Radhakrishna
   Nationality: Indian
   Address : (As above)
5. Editor's Name; Sri S. Sambhu Prasad
   Nationality Indian
   Address: 29, Chamier's Road, Adyar, Madras-20.
6. Names and addresses of individuals who own the newspaper and partners or share-holders holding more than one per cent of the total capital.

| NAME | ADDRESSES |
|---|---|
| 1. Mr. S. Sambhu Prasad | 29, Chamier's Road, Adyar, Madras-20. |
| 2. Mrs. S. Kamakshamma | Do |
| 3. Mr. S. Nageswara Rao | Do |
| 4. Mr. S. Radhakrishna | 6 & 7, Thambu Chetty Street, Madras-1. |

I, S. Radhakrishna, hereby declare that the particulars given above are true to the best of my knowledge and belief

(Sd) S. RADHAKRISHNA,
28-2-1958. Signature of Publisher.

# వరంగల్లులో త్యాగరాజోత్సవాలు



(ఫిబ్రవరి 16, 17, 18 తేదీలన జరిగిన) "త్యాగరాజోత్సవాల"లో పద్మశ్రీ ద్వారం వెంకటస్వామి నాయుడు వయోలిన్ కచేరీ.

శ్రీ అనంతలక్ష్మి ఆయుర్వేద కళాశాల ఆవరణలో ప్రత్యేకంగా నిర్మించబడిన పందిరిలో ఫిబ్రవరి 16, 17 18 తేదీలలో వరంగల్లు పట్టణంలో "త్యాగరాజోత్సవాలు" జరిగినవి. భారత దేశంలోని ప్రఖ్యాతమగు లలిత కళా సంస్థల్లో ఒకటిగా ప్రసిద్ధి గాంచిన 'కాకతీయ కళాసమితి' ప్రతి సంవత్సరం ఈ ఉత్సవాలు జరుపుతూ ఉండేది. వీరు జరిపిన ఉత్సవాల్లో స్థానిక సంగీత విద్వాంసులకు ప్రోత్సాహం లభించ లేదన్న ప్రవాదు ఉన్నా, చిత్రకళ, నాటక కళ, లఘు సంగీతము, విచిత్ర వేష ధారణ, వ్యాసరచన, వక్తృత్వ పోటీలు ఏర్పాటు చేయబడి ఆ యా లలితకళలలో అభిరుచి, ప్రవేశం ఉన్నవారికి ప్రోత్సాహకరంగా ఉండేవి. ఎందుచేతనో గడచిన మూడు సంవత్సరాల నుండి ఈ సంస్థ క్రియా శూన్యంగా ఉండిపోయింది. అంతే గాక యీ సంస్థ పక్షాన నిర్వహించబడుతూ వచ్చిన "సంగీత కళాశాల" కూడా మూల బడింది. ఈ కళాశాలకు ప్రభుత్వ గ్రాంటు కూడా లభిస్తూ ఉండేది.

ఈ పరిస్థితుల్లో "త్యాగరాజోత్సవాలు" జరిగి, ప్రజానీకంలో నిద్రాణమైన లలిత కళాభిరుచిని మేల్కొలిపి, కళాకారులలో చేర్కొనిపోయిన నిస్పృహను తొలగించాయి. ఇట్టి చక్కని కార్యక్రమం నిర్వహించిన గౌరవం శ్రీ కె. వి. చారి, యస్. నరసింహమూర్తి డా॥ టి. వెంకటరావు, చుక్కాడపు విఠలరావు గార్లకు చెందుతుంది.

16 వ తేదీనాడు త్యాగరాజ చిత్రపటా విష్కరణ, శ్రీమతి బాలాత్రిపురసుందరీ మంగళ గీతంతో ఉత్సవాలకు నాంది జరిగింది. శ్రీ యస్. నరసింహమూర్తిగారు ఉత్సవాలను ప్రారంభించడానికి విచ్చేసిన రాష్ట్ర మంత్రి శ్రీ మందుముల నరసింగరావుగారూ, పద్మశ్రీ ద్వారం వెంకటస్వామి నాయుడునూ సభాసదులను ఆహ్వానిస్తూ ప్రసంగించారు. శ్రీ కె. వి. చారి ఈ సభకు అధ్యక్షత వహిస్తూ వాగ్గేయకారుడగు త్యాగరాజు సంగీత సాహిత్యములను తీర్చి దిద్ది, ఆంధ్రదేశమునకు అఖండ కీర్తి చంద్రికల నార్జించిపెట్టినాడని స్తుతించారు. తర్వాత



"అత్తవారింట" అనే ఘట్టాన్ని అభినయిస్తున్న కుమారి రాధ.



"ఈపోరు పడలేనురా" అభినయిస్తున్న కుమారి కరుణ.

పద్మశ్రీ నాయుడుగారి సంగీత ప్రదర్శన చేశారు.

రాష్ట్రమంత్రి శ్రీ మందుముల నరసింగరావు ఉత్సవాలను ప్రారంభిస్తూ సంగీత రసాస్వాదనం చేసి ఆనందించటం తప్ప సంగీతమంటే తమకేమీ తెలియదనీ, రసానుభూతిని పొందే అవకాశం పండిత పామరులకు ఇచ్చుటకే ఈ సభను ప్రారంభిస్తున్నామనీ అన్నారు. పూర్వం రాజుల పోషణలో అభివృద్ధి నందిన ఈ సంగీత కళను ప్రజాస్వామిక యుగంలో 'రాజా' లైన ప్రజలే



భరతనాట్య ప్రదర్శన: రాధ వేషంలో కుమారి రామసీత; కృష్ణ వేషంలో కుమారి రాధ.

# వరంగల్లులో త్యాగరాజోత్సవాలు

పోషించాలనీ, ప్రభుత్వం సంగీత నాటక అకాడమీ స్థాపించి ప్రోత్సహించినా వాస్తవంగా ప్రజలే ఈ భారం వహించాల్సి ఉన్నదనీ కూడా అన్నారు మంత్రి.

తరువాత పద్మశ్రీ నాయుడుగారి వాయులీన సంగీతం ప్రారంభమైంది. శ్రీ రాజా మృదంగం వాయించారు. శ్రీ నాయుడిగారి కుమార్తె శ్రీమతి మంగతాయమ్మ తంత్రి వాద్యము ననుసరించింది. శ్రీ నాయుడు ఒక్కొక్క రాగ మాలాపిస్తుంటే శ్రోతృ హృదయాలు రససంభరితాలై పొంగిపోయినవి. నాల్గు గంటలకాలం నాలుగు నిముషాలలా గడచిపోయినవి.

శ్రీ ఉప్పలపాటి అంకయ్య శాస్త్రిసంగీతము రెండవరోజు జరిగింది. వీరి కంఠమాధుర్యము బహుజనాన్ని ఆకర్షించి, ఆహ్లాదపరచినది.

మూడవరోజు సభను ముగ్ధపరచినవి రెండు ఘట్టాలు: ఒకటి శ్రీమతి టి. టి. సీత గాత్ర సంగీతం. రెండవది కుమారికలు రామసీత, కరుణ, రాధల అభినయము. ఆమె మహిళామణి అని పక్షపాతి మేమో చెప్పలేం కాని స్త్రీలోకం అంతా ఆనాడు విరుచుకుని పడింది. ఐదువందలమంది శ్రోతలతో ఆరుగంటలకు ప్రారంభమైన శ్రీమతి సీత గాత్రసంగీత మాధుర్యానికి సుగంధంకూడా ఉందేమో, మరో అరగంటకల్లా స్త్రీ పురుషులు వెల్లువలుగా సభారంగానికి ప్రవహించి జనసముద్రంగా రూపొందారు. పద్మశ్రీ నాయుడుగారి సంగీతంవల్ల ఎంత ఆనందం, పారవశ్యం పొందారో, ఆ ఆనందాన్ని, పారవశ్యాన్ని టి. టి. సీతగారి సంగీతం వారికి మరొకవిధంగా ప్రసాదించింది. త్యాగరాజకృతులే భక్తిగీతములు. ఆ కృతులు మాధుర్యతరంగములుగా ప్రజా హృదయపు టంచులను తాకుతుంటే ఎంతటి మోడుబారిన హృదయమైనా చిగురిస్తుంది. మరి రసజ్ఞులమాట చెప్పనేల? శ్రీమతి టి. టి. సీతగారి సంగీతమునుగూర్చి విని ఆనందించడమే సముంజసం. వ్రాయటం కొందరికి అతిశయోక్తిగా తోపవచ్చు.

ఇక రెండవఘట్టం కుమారికలు రామసీత, కరుణ, రాధల అభినయం. అభినయ శాస్త్రజ్ఞులైన ఆచార్యుని సన్నిధానమున వీరికి సుశిక్షణ లభింపచేస్తే, ఈ చిట్టిబాలికలలో దాగియున్న అభినయ కళాప్రతిభ క్రమత్వము సిద్ధించి ప్రాభవం పొందగలదు. నృత్యమునకు, సౌందర్యానికి అంతస్సంబంధాలు ఉంటాయన్నది గమనించాల్సిన సత్యం. క్రమశిక్షణలేని నృత్యసాధనవల్ల సౌందర్యము తగ్గిపోవునని అనుభవజ్ఞులంటారు. ఈ బాలికల తలిదండ్రులు వీరికి క్రమమైన శిక్షణ నిప్పించి వారిలో యిప్పటికే ఉన్నతస్థాయిని ప్రతిబింబిస్తున్న అభినయకళకు రూపులు దిద్దకపోతే వారికి అపకారం చేసినవారే అవుతారు. ఈ ముగురు కుమారికలలో ప్రథమస్థానం కుమారి రాధకు ('అత్తవారింట' అనే అభినయం), ద్వితీయస్థానం కుమారి రామసీతకు (రాధికా నృత్యం), ప్రేక్షకులు ఇచ్చారు. ఇక కుమారి కరుణకు తృతీయ



తూర్పు ఆఫ్రికాలో పర్యటించి వచ్చిన కథక్ నర్తకుడు గోపీకృష్ణ.

వీరు అలరిప్పు, జతిస్వరం నృత్యగతులను ప్రదర్శించారు. వీరికి శాస్త్రీయ పద్ధతులలో కొద్దిపాటి శిక్షణ ఉంది. నృత్యమునకు సరిపోవు అంగసౌష్ఠవము కూడా ఉన్నది. అయినా భావప్రకటనకి కి అలవరించుకోవలె పోవడం యూలాన లో తం కొట్టవచ్చి నట్లు కనిపిస్తుంది. అంతేగాక వీరి కళావిభవం పూర్తిగా ప్రదర్శించడానికి వేదిక చిన్నదిగా ఉండిపోయింది. లయకు సరిపోవు "ధిమికిట" ఇత్యాది పదములకు అనుగుణంగా అడుగులు కదిలించి వేయడంలో ఈ కుమారికలు బాగుగా శ్రద్ధ వహించారు.

ఈ ఉత్సవాలలో మరొకటి రెండు ప్రత్యేక విశేషాలు జనాకర్షణీయములైనవి ఉన్నాయి. నాటికల ప్రదర్శనం, కవి సమ్మేళనం, విచిత్ర వేషధారణ, లఘు సంగీతం, వ్యాసరచన. మొదటి రెంటిలో పెద్దలు ఎంత ఉత్సాహంగా పాల్గొన్నారో చివరి రెంటిలో విద్యార్థులంతటి ఉత్సాహంతో పాల్గొన్నారు. విచిత్ర వేషధారణలో మాత్రం పెద్దలు, చిన్నలు పాల్గొన్నారు.

—ఎం. ఎస్. ఆచార్య]

★



పద్మశ్రీ ద్వారం నాయుడు వయొలిన్ వాద్యంలో లీనమైపోయిన శ్రోతలు :
త్యాగరాజోత్సవాలు ప్రారంభించిన రాష్ట్రమంత్రి శ్రీ మందుముల నరసింగరావు, జిల్లా కలెక్టర్ శ్రీ షబీర్, చైర్మన్ శ్రీ చెరుకు కొంతయ్య, శాసన సభ్యులు శ్రీ టి. హయగ్రీవాచారి మొదలగు ప్రముఖులు.

స్థాన నిర్ణయానికి ఇష్టంలేక, మొదటి వదలివేశారు.
స్థానమో, రెండో స్థానమో తేల్చుకొనలేక

మరొక జట్టు కుమారికలు కాంత, సుశీలలు.




# మౌలానా ఆజాద్‌కు స్మారక చిహ్నం

**శ్రీ కృష్ణ**
[ ఆంధ్రపత్రిక ప్రతినిధి ]

మౌలానా అబుల్ కలాం ఆజాద్ మృతితో ఒక శకం అంతరించింది. ఉత్తర భారత దేశానికి కీర్తి కారణమైన ఒకానొక సంస్కృతి ఆయనలో మూర్తీభవించింది. కేంద్రప్రభుత్వంలో ప్రధాన మంత్రి అవునన్నదాన్ని కాదన్న మంత్రి ఎవరైనా ఉంటే ఆయనొక్కరే. చాగ్లా నివేదిక విషయంలో ప్రధానికీ ఆజాద్‌కు కొన్ని అభిప్రాయభేదాలు వచ్చిన సంగతి రహస్యమేమీ కాదు. ప్రధానికి మౌలానా సాహెబ్ అంటే ఎంతో గౌరవం, ప్రేమ ఉండటంచేత, ఏవన్నా తప్పు విధానాలు అనుసరించినప్పుడు మౌలానా విమర్శ వాటిని సరిదిద్దేది. మళ్ళీ ఇలాంటి వ్యక్తిని భారతదేశం చూడబోదు.

మౌలానా సాహెబ్‌కు ఏదైనా జాతీయ స్మారక చిహ్నం నిర్మించాలని అంటున్నారు. విద్యార్థులకు ఉపకారవేతనాలిచ్చేందుకు నిధి సేకరించాలని కొందరభిప్రాయపడుతున్నారు. కాని మౌలానా సాహెబ్‌కు అన్నివిధాలా ఉచితమైన, శాశ్వతమైన స్మారకచిహ్నంగా ఉర్దూ భాషను పునరుద్ధరించటం బాగుంటుంది. మతభేదాలను దృష్టిలో పెట్టుకుని ఉర్దూను నాశనం చేస్తున్నారు. ఉర్దూ పుట్టింది ఢిల్లీలోనే. దాదాపు కనూరేళ్ళు అది రాజభాషగా ఉంది. కనుక ఢిల్లీకి ఉర్దూను ప్రాంతీయభాషగా చేస్తే సముచితంగా ఉంటుంది. ఢిల్లీ విశ్వవిద్యాలయంలో ఉర్దూ పీఠం ఒకటి స్థాపించటం కూడా బాగుంటుంది.

1953 లో జాతీయ గ్రంథాలయ మండలిలో ప్రసంగిస్తూ మౌలానా ఆజాద్ ఇట్లా అన్నారు:

"కర్జన్ ప్రభువు రాజకీయాల్ని గూర్చి మనం ఏమి అనుకున్నప్పటికీ, 1903 జనవరి 30 వ తేదీన ఆయన 'ఇంపీరియల్ లైబ్రరీ' ప్రారంభోత్సవం చేస్తూ అన్న మాటలు జ్ఞాపక ముంచుకోదగినవి. 'నేను వచ్చేటప్పటికి కలకత్తాలో చెప్పుకోదగిన గ్రంథాలయం ఒక్కటీ లేదనీ, వెళ్ళిపోయే సమయంలో కలకత్తాలో అత్యుత్తమ గ్రంథాలయం ఒకటి స్థాపించి వెడుతున్నాననీ చెప్పుకోగలిగితే అంతకంటె గర్వకారణమైనదీ, హర్షదాయకమైనదీ నాకింకేం ఉంటుంది?'"

న్యూఢిల్లీకికూడా చెప్పుకోదగిన గ్రంథాలయం ఒక్కటీ లేనందుకు మౌలానా సాహెబ్ ఎంతో బాధపడ్డారు. ఆయన బ్రతికిఉంటే న్యూఢిల్లీకితప్పకుండా గ్రంథాలయం లభించేది. నిజానికి, ఆయన చనిపోయిన వారంలోనే ఈ విషయమై లోక్‌సభలో ఒక ప్రశ్న వచ్చింది. ఆయన పేరుమీద జాతీయ గ్రంథాలయాన్ని స్థాపిస్తే భారతదేశానికి, భారతీయులకు మహాసేవ చేసిన ఆయనకు, కృతఘ్నులుతప్ప ఇంకెవ్వరూ మరిచిపోని ఆయనపేరుకు శాశ్వత స్మారకచిహ్నంగా నిలిచిపోతుంది.

* * *

చాగ్లా నివేదికపై జరిగిన చర్చ ప్రజలకు విచారం కలిగించింది గాని వివేకం కలిగించలేదు. ఈ వ్యవహారం ఇంతటితో సమాప్తమైనట్లు కాదు. అసలు నాటకంలో ఈ జరిగిన చర్చఅంతా మొదటి అంకం మాత్రమే. ఇంకా జరగాల్సిన నాటకం బోలెడుంది. అయితే విచారణీయాంశాలు తగ్గించబడినాయి. ఆరు ముంద్రా కంపెనీలలోను జీవితభీమా కార్పొరేషను వాటాలుకొనటం వ్యాపారసరళిలో జరగలేదనీ, వాటాలను ఎక్కువ ధరలుపెట్టి కొనటం, తొందర తొందరగా బేరం పూర్తిచేయటం మొదలైన చాలా కారణాలనుబట్టి చూస్తే వ్యాపారసరళికి విరుద్ధంగాకూడా ఉన్నదనీ అటు శ్రీ చాగ్లా అభిప్రాయ పడినట్లే, ఇటు ప్రభుత్వమూ అభిప్రాయపడింది. కాని, శ్రీ టి. టి. కృష్ణమాచారికి ఈ బేరంతో "చాలా తక్కువ సంబంధం" ఉన్నదని ప్రభుత్వం భావించింది. చాగ్లా విచారణ సందర్భంలో బయటపెట్టిన, బయటపడిన విషయాల్ని బట్టి చూస్తే, ఇంతధరలుపెట్టి వాటాలను కొనమనికాని, ఇంత వ్యవధిలో బేరం పూర్తి చేయమని కాని శ్రీ కృష్ణమాచారి కార్పొరేషన్ అధికారులను ఆదేశించినట్లు చెప్పటానికి ఎక్కడా ఆస్కారంలేదు. అందుచేత స్థూలంగాచూస్తే, అంత తొందరగా, అంత ఎక్కువ ధరలుపెట్టి ముంద్రా వాటాల్ని ఎందుకు కొనవలసివచ్చిందో సంజాయిషీ ఇవ్వవలసిన బాధ్యత బేరానికి కారకులైన వారిదే కాని ఇతరులది కాదు.

ఇప్పటివరకూ తెలిసినదాన్ని బట్టి ముంద్రా వ్యవహారంలో ఇరుక్కున్న అధికారులు ముగ్గురు—ఆర్థికశాఖ ప్రధాన కార్యదర్శి శ్రీ హెచ్. ఎమ్. పటేల్, మరొకరు జీవితభీమా కార్పొరేషన్ అధ్యక్షుడు శ్రీ జి. ఆర్. కామత్, వేరొకరు కార్పొరేషన్‌లోని మరొక అధికారి శ్రీ వైద్యనాథన్. శ్రీ పటేల్, శ్రీ కామత్ ఐ. సి. ఎస్. అధికారులు. వీరి ప్రవర్తనను విచారణ చేయాలంటే ఒక ప్రత్యేక కార్యక్రమం ఉంది. ఆ కార్యక్రమం ఇది:

ఐ. సి. ఎస్. ఉద్యోగిపై చర్య తీసుకునేముందు, అతనిపై ఏ కారణాలచేత చర్య తీసుకోబోతున్నారో లిఖితపూర్వకంగా తెలియజేసి, తన్ను తాను సమర్థించుకోటానికి అతనికి తగిన అవకాశం ఇచ్చిగాని చర్య తీసుకోటానికి వీలులేదు. చర్యకుగల కారణాలను స్పష్టమైన ఆరోపణగా లేక ఆరో

పణలుగా పేర్కొని వాటిని ఆ వ్యక్తికి అందజేయాలి. తనపై ఏ కారణాలవల్ల, ఏ పరిస్థితుల్లో చర్య తీసుకుంటున్నారో ఉద్యోగికి తగినంత సమాచారం తెలియజేసేటంత స్పష్టంగా, అసందిగ్ధంగా ఆ ఆరోపణలు ఉండాలి. తగినంత వ్యవధిలో ఆ ఉద్యోగి తన్ను సమర్థించుకుంటూ లిఖితపూర్వకంగా సమాధానం ఇచ్చి, ముఖాముఖీ సంజాయిషీ ఇచ్చుకోగోరితే ఆవిషయం తెలియజెయ్యాలి. ఉద్యోగి ఏ ఆరోపణలకైనా ఒప్పుకోకపోతే, వాటి విషయమై అతను కోరినపక్షంలో, పై అధికారులుకూడా ఆదేశించినపక్షంలో వాఙ్మూలకమైన విచారణ జరిపించాలి. ఆ విచారణలో విచారణాధికారి ఎటువంటి వాఙ్మూలక సాక్ష్యం అవసరమని తలిస్తే అటువంటి వాఙ్మూలక సాక్ష్యాన్ని వినవచ్చును. అలా పిలిచిన సాక్షులను క్రాసు పరీక్ష చేయటానికి నేరారోపణచెయబడిన ఉద్యోగికి హక్కు ఉంది. అయితే ఏ సాక్షినైనా పిలిపించటానికి విచారణాధికారి ఇష్టపడకపోతే ఏ కారణంవల్ల ఇష్టపడ లేదో లిఖితపూర్వకంగా తెలియజేయాలి. విచారణ కార్యక్రమంలో సాక్ష్యాన్ని రికార్డుచేయాలి. తీర్పును, ఆ తీర్పుకు కారణాలను కూడా తగు విధంగా రికార్డు చెయ్యాలి. ఈ కార్యక్రమానికి విడిగా, విచారణాధికారి నేరంమోపబడిన ఐ. సి. ఎస్. ఉద్యోగికి ఏమి శిక్ష విధింపవచ్చునో సిఫార్సుకూడా చేయవచ్చును. ఆ తరవాత అప్పీలు సౌకర్యాలు వగైరా వస్తాయి.

ముంద్రా వ్యవహారంలో ఉన్న ఇద్దరు ఐ. సి. ఎస్. ఉద్యోగులను విచారణ చేయటానికి త్వరలో ఒక విచారణాధికారిని నియమిస్తారు.

ఇది ఇలా ఉండగా, పోయాయనుకున్న కొన్ని అధికారపత్రాలు ఇప్పుడు దొరికాయని న్యూఢిల్లీలో పుకార్లు పుట్టాయి. ఇది ఒకవేళ నిజమైనా, శ్రీ కృష్ణమాచారి ముంద్రా వాటాలను ఫలానా టైములోగా కొనాలని, ఫలానా ధరలకి కొనాలని ఆదేశించినట్లు ఎక్కడా దాఖలా లేదు. ఈ అధికార పత్రాలవల్ల మహా బయటపడితే, ఒకానొక రోజున శ్రీ కృష్ణమాచారికి ముంద్రా నేరం గురించి తెలిసే ఉన్నట్లుగా బయటపడుతుంది; అంతకంటే ఏమీ లేదు. ఇప్పుడు ఆ నేరానికి ఎవరిది బాధ్యత అని కాదు ప్రశ్న; అంతతొందరగా, ఎక్కువ ధరలకి కొనిపించింది ఎవరూ అని.

ముంద్రా వాటాలను కొనాలని జరిగిన నిర్ణయం కొంత ముఖ్యమైనదనీ, ఆ నిర్ణయాన్ని తనంతట తానుగా తీసుకోవటమనేది అసంభవమనీ శ్రీ హెచ్. ఎం. పటేల్ ఛాగ్లా విచారణ సందర్భంలో చెప్పినటు



శ్రీ గోపాలరెడ్డి

ఆంధ్రప్రదేశ్ 1958-59 బడ్జెట్‌లో 79 లక్షల రూపాయల మిగులు చూపించారు, ఆర్థిక మంత్రి. (ఆదాయం 6366 లక్షలు; ఖర్చు 6287 లక్షలు) ప్రప్రథమంగా బడ్జెట్‌లో మిగులు చూపించి ఇక లోటు బడ్జెట్ల ముఖారి రాగాలాపన అవసరం లేదన్నారు. ఇక మీద వినవచ్చేది మిగుల బడ్జెట్ల ఆనందభైరవేనన్నమాట!

పాఠకులకు తెలిసినదే. తాను ఆర్థిక కార్యదర్శిగా తన అధికారహోదాలో ఆ విధంగా ప్రవర్తించినట్లు, తన అభిప్రాయాలతో ఆర్థికమంత్రి ఏకీభవించరు అని అనుమంటే, ఆవిధంగా నేరం చదుర్చుకోమని కార్పొరేషనుకు సలహా ఇచ్చేవాణ్ణి కాదనీకూడా శ్రీ పటేల్ ఆ విచారణలో చెప్పారు.

ఈ సమర్థించుకోవటమంతా, ఊహల మీద ఆధారపడినదేనని శ్రీ కృష్ణమాచారి అన్నారు. కనుక ఈ అధికారుల నిరపరాధిత్వాన్ని రుజువుచేయటానికి మరికొన్ని విషయాలు బయటికి రాగలవని ఆశింపవచ్చును.

శ్రీ ఫిరోజ్ గాంధీ ఇటీవల పార్లమెంటులో చెప్పిన విషయాలపై మరికొన్ని విమర్శలు వినవస్తున్నాయి. ఛాగ్లా నివేదికపై రాజ్యసభలో చర్చజరిగినప్పుడు శ్రీ శివరావు చెప్పినట్లుగా, ఏవైనా ఆరోపణలు చేస్తే, వాటికి సమాధానం ఇచ్చుకోడానికి అవకాశం లేని వ్యక్తులను పార్లమెంటు సభ్యులు పార్లమెంటును అడ్డు పెట్టుకుని నిందించరాదనేది సంప్రదాయం. ఛాగ్లా నివేదికపై చర్చలో పార్లమెంటరీ ప్రజాస్వామ్యంపై అనేకులు మాట్లాడారు. కాని పార్లమెంటరీ ప్రజాస్వామ్యంలోని ప్రాథమిక సంప్రదాయాన్ని కూడా శ్రీ ఫిరోజ్ గాంధీ పాటించలేదు. శ్రీ వైద్యనాథన్‌ను కార్పొరేషను కాంట్రాక్టుపద్ధతి మీద నియమించిందనీ, ఆ కాంట్రాక్టు అయిపోకుండా ఆయన్ని తొలగించటానికి వీలులేదని శ్రీ ఫిరోజ్ గాంధీకి తెలిసిఉండాలి. శ్రీ వైద్యనాథన్ ఉద్యోగ పరిమితిని పొడిగించారని, అలా పొడిగించినది శ్రీ హెచ్. ఎమ్. పటేల్ కాదనీ, శ్రీ పటేల్ కార్పొరేషన్

# న్యూఢిల్లీ లేఖ

డైరెక్టరుపదవినుంచి తప్పుకున్న తరవాత కార్పొరేషనే పొడిగించిందని తెలుస్తోంది. శ్రీ వైద్యనాథన్ ఉద్యోగ పరిమితిని పొడిగించే ముందు ఆయన్నిగూర్చి శ్రీ కృష్ణమాచారి వెలిబుచ్చిన అభిప్రాయాలను కార్పొరేషన్ క్షుణ్ణంగా పరిశీలించిందని కూడా తెలిసింది. శ్రీ వైద్యనాథన్ స్థానంలో మరొకర్ని అంత తొందర్లో, నియమించటం సాధ్యంకాదని కార్పొరేషన్ భావించిందట. ఆయన స్థానంలో నియమించటానికి మరొకరు దొరకగానే ఆయనను తీసివేస్తామనే షరతు మీద ఉద్యోగ పరిమితిని పొడిగించారట. ఇదంతా శ్రీ పటేల్‌ను సమర్థించటానికి వ్రాయటంలేదు. కాని ఈ వార్తల్ని బట్టి చూస్తే, శ్రీఫిరోజ్ గాంధీ తాను బయటపెట్టిన "అతిరహస్య" అధికార పత్రానికి ప్రజలు తీయాలని భావించిన అర్థం నిరాధారంగా కనిపిస్తోంది. శ్రీ హెచ్. ఎమ్. పటేల్‌కు ఆర్థికమంత్రి ఆదేశాలను తృణీకరించటం అలవాటని శ్రీ ఫిరోజ్ గాంధీ ఆ అధికార పత్రానికి అర్థం తీశారు. అయితే అసలు దీనికంతటికీ సంబంధించిన శ్రీ కృష్ణమాచారి మాత్రం శ్రీ పటేల్ మీద అటువంటి విమర్శ ఏమీ చెయ్యనేలేదు.

ప్రభుత్వోద్యోగులలో ఈ సంఘటన చాలా అసంతుష్టి కలిగించింది. ఈ ఉద్యోగులు ఏం మాట్లాడాలన్నా, ఏం చెయ్యాలన్నా కొన్ని నియమాలు, నిబంధనలు ఉన్నాయి. శ్రీ ఫిరోజ్ గాంధీచేసిన విమర్శలవంటివాటికి వారు సమాధానాలిచ్చి తమ్ముతాము సమర్థించుకునేందుకు వీలులేదు. వారిని రక్షించగలిగింది హోంమంత్రి ఒక్కరే. తమ్ముతాము సమర్థించుకునే అవకాశాలులేని వ్యక్తులపై పార్లమెంటు సభ్యులు తమ పార్లమెంటరీ హోదాను ఆసరా చేసుకుని ఆరోపణలు చేయరాదనే సంప్రదాయాన్ని, శ్రేయస్సు దృష్ట్యా హోంమంత్రి త్వరలో పునరుద్ధరిస్తారని ఆశించవచ్చును. ఎందుకంటే తమకు రక్షణ కావాలి అని గట్టిగా అనేవాళ్ళు ఇతరులకు కూడా అటువంటి రక్షణ ఉండటానికి అంగీకరించాలి. ఇందులో మరొక విశేషంకూడా ఉంది. శ్రీ హెచ్. ఎమ్. పటేల్, శ్రీ వైద్యనాథన్‌లతో సహా మొత్తం ముగ్గురు అధికారులపై నేరారోపణ చేయబోతున్నారు. కనుక వారిపక్షానికి హాని కలిగించటానికి ఉపకరించే ఏపనీ చేయటం, ఏమాటా అనటం మంచిదికాదు. న్యాయం జరగటమే కాదు; జరిగినట్లు కనిపించాలి కూడాను. ★




[ఉద్యోగపర్వంనుండి]

సీ. గాండీవగుణరవం బాండొంద చెలఁగంగ శరపరంపర లాకసంబు గప్పఁ
ప్రబలవిశిఖములు ఖండితము లై రాలంగ నెదిరి సైన్యంబుల మదగజాది
చతురంగములును జర్జరితంబు లై యవయవభేద మెఱుఁగనియట్లు గాఁగఁ
దునిసిన నెత్తురు నెనడును నెమ్ములు నెఱచియుఁ గండలు నెనసి నమర

తే. తలము ఘోరంబుగాఁ గపిధ్వజము ధవళ, హరులు శోభిల్ల నొగలపై హరి యొలర్ప
దేవదత్తంబు ప్రమ్రోయఁ దోఁతెంచునట్టి, రథముఁ గని కాని కానఁడు రాజరాజు.

శా. బాలక్రీడ మహాసుర ప్రకరముల్ భంజింపఁడే యెవ్వఁడుం
ద్రైలోక్యంబును భక్తియుక్తిఁ దగ నారాధింపదే యట్టి శౌ
ర్యాలంకారు మహాత్ముఁ డా సరకుసేయం డచ్యుతుం డమ్మతం
డేలా కైకొను నాసుయోధనునియం దెగ్గది యూహింపఁగన్.

వ. ఏము పితామహగురుకృపాచార్యులకు నమస్కరించి యస్మదీయ రాజ్యభాగంబునకై తొడరి కయ్యంబుసేయువారము కౌరవులకుం బూని యెవ్వరే మాతోఁ బెనంగినను వారి శస్త్రాస్త్రంబులు ధర్మప్రతిహతంబు లగు నని తలంచెదము పండ్రెండు వత్సరంబులు వనంబున నమ్మెయి నిడుమలంబడి జనపదంబునం బదుమూఁ డగునేఁ డజ్ఞాతవాసాయాసం బట్లనుభవించి వచ్చి మా తండ్రిపాలికిం బెనంగు మమ్ము నింద్రాదిసురసహాయు లయ్యును ధార్తరాష్ట్రులు గెల్చువా రైరేని ధర్మంబుకంటె నధర్మము బలవంతం బై నయది యగు నింతియ కాని మాచేయునట్టిది గీ డైనది గా దేము వాసుదేవుని ము న్నిడికొని నడతుము గావున నీ యుద్ధంబున జయంబు మాకు సిద్ధంబ యెల్లభంగులం గర్ణసహితంబుగా గాంధారీనందనులం దునిమి యేము భూమి గొనుట దప్పదు గాండీవంబు దివియకయును గుడుసుపడియెడు బాణంబులు దమయంతన తూణీరంబుల వెడలెడుఁ దోలూడ్చు మహానాగంబునుంబోలెఁ గరవాలంబు దాన యొఱ వెలికి నిగుడుచున్న యది గావున మా కవశ్యంబును సంగరంబు సంభవించుఁ బాశుపతాది దివ్యశరంబులం గురుపక్ష ప్రజాక్షయంబు సేసి శాంతిం బొందెదము సూతనందనా నీవు సుస్థిరుండవై యింతయుం దెలియం బలుకవలయు నిమ్మాటలు విని కురువృద్ధుం డగు బాహ్లికుండును బితామహుం డగు భీష్ముండును గురుం డగు కుంభసంభవుండును శిక్షకుండగు కృపాచార్యుండును గురుపుత్రుండగు నశ్వత్థామయు సద్బుద్ధియగు విదురుండును ధర్మాచరణకల్యుండగు శల్యుండును నెయ్యది నిశ్చయించి పలికి రది యయ్యెడు సుయోధనాదు లాయుష్మంతు లగుటాఁ కాక యని పలికె నని చెప్పిన విని మందాకినీనందనుం డందఱు విన దుర్యోధనున కి ట్లనియె.

సీ. నలినగర్భుఁడు పెద్దకొలువున నున్నెడ సురపతిప్రముఖుల చూడ్కు లెల్ల
మెఱయు తేజంబున మిఱుమిట్లు గొన నిద్ద ఱచ్చట నొరసికొం చరుగఁ జూచి
వీ రెవ్వ రిమ్మెయి మీ రుండ నరకు సేయనియట్లు వోయెడునట్టివార
లని బృహస్పతి బ్రహ్మ నడిగిన నతని కి ట్లనియె నాచతురాస్యుఁ డాదరమున

తే. దపము పెంపును బలశౌర్యదర్పములును, గలిగి లోకహితార్థంబుగాఁ జరింతు
రేయుగంబుల నరుఁడు నారాయణుండు, ననఁ బ్రసిద్ధికి నెక్కిన మునులు సుమ్ము.

వ. అని పలికి వెండియు,

క. అనిమిషహితము దనుజనా, శనమును జేయుదు రధర్మసంగ్రామము గ
ల్గినచోట ధర్మపరు లగు, జనముల గెలిపింతు రధిక సంరంభమునన్.

వ. దేవాసురయుద్ధంబునప్పు డింద్రుండు వోయి వీరి నారాధించి తోడడిగినం జనుదెంచి పౌలోమకాలకేయాదు లగు ననేకదైత్యదానవులం జంపి యింద్రునకు విజయంబు గావించి రది మొదలుగా వీరల నెల్లవారలు నెఱింగి యుండుదు రిది యొక్క తేజంబ రెండు దెఱంగులై వెలుంగుచుండు నని చెప్పె వినోదార్థంబు జన్మాంతరంబు నొందిన యమ్మహాత్ములుగదా యీ యర్జునుండును వాసుదేవుండును నర్జునుండు సముద్రతీరంబున హిరణ్యపురంబు వొడిచి నివాతకవచుల నఱువదివేవుర నిర్జించి పర్జన్యునకుఁ బ్రియంబు సేసె వాసుదేవుపరాక్రమంబు గంసనరకాసుర ప్రముఖనిఖిలదుష్టనిగ్రహంబునం బ్రసిద్ధంబు గాదె తెలియ విను మున్న రూపు సెప్పెద.

క. ఆ యిరువురు నొకతలయై, యాయోధనమునకు నడచునట్టిద యేనిన్
వేయేల మనమకా దెవ్వ,రె యేడ్తెఱఁ దాఁక హరునకైనను వశమే.

క. సారథియు రథియు నై యొక, తేరం గృష్ణు లతిఘోర తేజస్సార
స్ఫారతఁ దోఁచిన నైనను, ధీరత వాటించి చూచి తెలిసెదవు బళే.

వ. అనుచు నా సుయోధను నుపలక్షించి శాంతనవుండు మఱియు ని ట్లనియె.

క. మది నామాట కొకింతయు, బెదర వకార్యంబునందుఁ బ్రియముఁ గలిగి యుం
డుదు కౌరవులకుఁ గాలము, తుదియో కా కిట్టిగర్వితుని నే మందున్.

తే. హితము లగు నాదువచనంబు లిపుడు వినని, వాఁడ వైతేని నప్పుడు వారు వడిరి
వీరు వడి రనుపలుకులు విందు గాక, శకుని కర్ణదుశ్శాసనుల్ సమ్మతింప

వ. దుష్టకష్టనికృష్టాత్ము లగు నిమ్మువ్వురుఁ జెప్పెడు బుద్ధులు గాని యొండు విన నొల్ల వేమిసేయ వచ్చు నని పలికినం గానీ
నుండు గనలి గాంగేయున కి ట్లనియె.

ఆ. ఇట్టు లాడఁ దగునె యే నేమి సేసితిఁ, గొలిచి కుడుచుపాడి నలవుఁ జలముఁ
బలుకు టెందు నెగ్గె పతికిఁ బుత్రులకును, మనుమలకు హితంబ యొనర నడతు.

క. కానితెఱఁ గైన నింతటి, మానిసిఁ గా నేల చేయు మనుజేంద్రుఁడు న
న్నీనెఱి దప్పినమాటలు, నీనోరన్ వెడలఁ దగునె నిండిన సభలోన్.

వ. అనిన విని భీష్ముఁడు ధృతరాష్ట్రున కి ట్లనియె.

## భీష్ముఁడు గర్ణుని దుర్ణయంబు ధృతరాష్ట్రునితోఁ జెప్పుట

తే. ఒకట నైనను వారియం దొకరిలోని, చిదురుపాలును బోలండు సిగ్గు లేక
పాండవుల గెల్తు నే నని పలుకుచుండు, వీని రజ్జులు దులువలు విండ్రు తగిలి.

క. మగఁటిమి వారికి వీఁ డెదు,రుగ నమ్మి సుయోధనుఁడు విరోధము గొని న
ర్వగుణాఢ్యులు బలవంతులు, నగు పాండునృపాలసుతుల నవమానించెన్.

ఉ. ఒక్కఁడొకం డనేకవిధ యుద్ధజయంబులు గొన్నవారు వా
రెక్కడ నేమి సేసె నితఁ డీతనితమ్ముని గూల నేసి యు
క్కెక్కినపార్థుపైఁ గవిసెనే పసు లాతఁడు గ్రమ్మఱింపఁగా
నక్కడ లేఁడె వీఁడు భవదాత్మజుఁ గొల్చెడె ఘోషయాత్రలోన్.

వ. ఈ దుర్జాతుండు గర్వం బెఱుంగక నీతిబాహ్యుండై వలసినట్లు ప్రేలరిమాటలాడుచుండు నీవునుం గైకొని విను చుండుదువు మేల కాక యనిన భీష్మపలుకులు విని ద్రోణుం డమ్మహారాజుతో ని ట్లనియె.

ఉ. శాంతనవుండు సర్వకురుసంతతికిం గలవాఁడు గాఁడె య
త్యంతహితంబు లీపలుకు లాహవ మొప్పదు ధర్మసూతితోఁ
బొంతువ మేలు దేవపతిపుత్త్రుఁడు సంజయుతోడ నాడిన
ట్లంతకు నోపు మీకుఁ దెలియం దగు ఖాండవదాహ మాదిగాన్.

ఆ. శరశరాసనములు ధరియింప రెట్టులె, వ్వరును మగతనంబు వలనుఁ గలిగి
కయ్యమున జయంబు గైకొనరే యొరు, లర్జునుండ విజయుఁ డనఁగ నెగడె.

క. మనవీటన కా దయ్యె, ర్జునునకు సరివింటివానిఁ జూడఁగ లోకం
బున నెందు లేమి దెల్లం, బనుమానము లేదు తొడర నగునే వానిన్.

వ. అని చెప్పి యప్పాటం బరమహితోపదేశంబు సేసిన భీష్మద్రోణులపలుకు లాదరింపక వారికి నదుత్తరంబు లీక వారలతోడం దదనురూపంబుగా సంభాషింపక ధృతరాష్ట్రుండు వెండియుఁ బాండవులవలని వార్త లడుగుటకు సంజయుదిక్కు మొగం బైనం జూచి కురుపక్షవీరు లందఱుఁ బ్రాణంబులదెస నిరాశులై యుండ నమ్మహీపతి సంజయునితో ని ట్లనియె.

తే ధర్మపుత్రున కిక్కడితలఁపుభంగి, యెట్టులుండు నీ సైన్యంబు లెల్లఁ గూడి
యునికి వినియెనే యెవ్వరిఁగొని యతండు, కౌరవులమీఁద నెత్తి రాఁగలుగువాఁడు.

వ. అనిన విని సంజయుండు వెచ్చ నూర్చి బిచ్చవడి మూర్ఛవోయిన చందంబున డెందంబు మొగుడం జేష్టలు దక్కి యుండి కొండొకసేపునకుఁ జిత్తం బొక్కింత సేసికొని యక్కటా యీభూపాలుం డింత బేలయగునే యుధిష్ఠిరుం డెవ్వరిఁగొని యెత్తివచ్చువాఁ డని యడుగుచున్నవాఁ డింత యెఱుంగనివాఁ డెంత సెప్పినను దెలియ నేర్చునే యితనిభంగి యిట్టి దనినఁ గొడుకుల తెఱంగు వేఱ యెన్న నేల యే నింక నే మనువాఁడ నైనను న న్నడిగిన మాటకుం దగిన మాఱుమాట వలుకవలయున కాదె యని తలంచి ధృతరాష్ట్రున కి ట్లనియె.

చ. వినుము నరేంద్ర పాండుపృథివీపతి యగ్రసుతుండు సంధి సే
యన మదిఁ గోరు మీరు తమయయ్యనగంబును భూమి యీక త
క్కిన మఱి కాని ముంద రొక కీడుఁ దలంపఁడు మీబలంబు నె
ల్లను మదిఁ జీరికిం గొనఁడు లావున నేలఁ గొనం దలంచినన్.

వ. అతం డెవ్వరిం గొని యెత్తివచ్చువాఁ డని యడిగితివి నీ యెఱుంగనివార లందెవ్వరు గల రవధరింపుము.

మ. బకవిధ్వంసి జటాసురాంతకు హిడింబప్రాణహారిఁ గీ
చకనిర్మూలన కేళిలోలు సమరోత్సాహైకశీల ప్రవ
ర్తకు నాగాయుతసామ్యకీర్తితబలోదగ్రుం బ్రతివ్యూహదా
హకు భీముం గొని వచ్చు ధర్మజుఁడు బాహాటోపముం జూపఁగన్.

వ. మఱియును.

మ. అట మి న్నందినయట్టివానిపొడ వెం తన్నట్లు ఫాలాక్షు నె
క్కటికయ్యంబునఁ గన్నఫల్గును భుజాగర్వంబు లెక్కించు టం
తటివానిం గొని ధర్మసూతి సమరోత్సాహంబుమై నెత్తి వ
చ్చుటకుం గొంకునె వీఁపు నక్క నయి నిల్చుం గాక మీసైన్యముల్.

తే. నకులు సహదేవుఁగొని ధర్మనందనుండు, మొనసి కౌరవబలముల ముట్టికొనఁగఁ
దలఁచి తఱి వేచి వచ్చుట ధరణినాథ, సింగములఁ బట్టి వేఁటాడుభంగిగాదె.

తే. ద్రౌపదేయులు నాసుభద్రాసుతుండు, నుక్కుతునియలు గారె మి మ్మక్కుమార
వరులఁ గొని యోర్చువాఁ డయి వచ్చు ధర్మపుత్రుఁ డిది నీకుఁ జూడంగఁ బోల దెట్లు.

వ, అని చెప్పి వెండియు నిట్లనియె.

క. వృష్ణికుమారోత్తముఁ డా, కృష్ణుని తమ్ముండు సాత్యకియు దవదహనా
త్యుష్ణ ప్రతాపమూర్తులు, కృష్ణాసోదరులు దలఁపఁ గేవలులె నృపా.

సీ. శౌర్యోజ్జ్వలుండు పాంచాలభూనాథుండు మహితవిక్రముఁడగు మత్స్యవిభుఁడు
నధికధైర్యాన్వితు లతనితమ్ము లుదగ్రతేజస్కులైన తదీయసుతులు
నన్నదమ్ములు ప్రతాపోన్నతు లేవురు కేకయపతులు నక్షీణబాహు
శక్తియుక్తులు జరాసంధసూనుఁడు సహదేవుండు నాజయత్సేనవిభుఁడు

తే. వినుము శిశుపాలతనయులు వీరధనులు, ధృష్టకేతుండు వృషభుండుఁ దీవ్రరణవి
నోది యదుభర్తచేకితానుండు దర్ప, ఘనుఁడు శైబ్యనృపాలుండుఁ గలరుగాదె.

క. వీ రెల్లఁ బాండురాజకు, మారులపాటునకుఁ గుందుమనములతోడన్
వారి పగఁ దీర్పఁ గడఁగెదు, వారల కా కందు లాఁతివారుం గలరే.

వ. భీమసేనసూనుండు ఘటోత్కచుండు దండ్రికంటెను లావును వీరంబునుం గలవాఁడు మాయాబలంబున మన బలంబు నెల్లం గలంచు మఱియును దూర్పన నుత్తరంబునం గలుగు నరనాయకులు నానాసేనాసమన్వితు లయి వచ్చి చిచ్చయిననుం బిడికిలింత మనుచున్నవా రదియును గాక.

క. సకలభువనములు నఱచేతికిఁ దేరం జాలునట్టి ధీమంతుఁడు దే
వకికొడుకు గలఁడు ధర్మజు, నికి నాతం డెత్తి రాక నిలుచునె యధిపా.

వ. అని చెప్పిన సూతపుత్రునకు నంబికాపుత్రుం డి ట్లనియె.

## ధృతరాష్ట్రుఁడు భీమసేనాదుల పరాక్రమంబు దలంచి దుఃఖించుట

క. వారిదెస నీవు సెప్పిన, యారథికులు ప్రబలు లగుదు లందఱు నైనన్
వారెల్లను నొకతల యు, మ్మారుతి యొకతల బలప్రమాణము సూడన్.

ఉ. భీముఁ దలంచినన్ మనము భీతిఁ గలంగుచు నుండు నాకు రే
లేమియు నిద్ర రా దతని నేడ్తెఱ మార్కొనఁ జాలునట్టి వాఁ
డీమొన లేఁ డతం డలుక నెత్తిన యాగద కాలదండ ము
ద్దామవిలాసుఁ డై కురుకదంబములో విహరింప కుండునే.

తే. చిఱుతనాఁడును వాఁడు నాశిశుఁ బోఁడు, వీరు చివ్వకుఁ జొత్తురు వైరమెత్తి
వానిచేఁ బీడ వడియును మాన రదియ, కాదె యీభేదమున కెల్లఁ గారణంబు,

క. సమరమున దైత్యదానవ, సమితియు నాతని కెదుర్పఁ జాలదు భుజయు
ద్ధమున జరాసంధుని నొక, నిమిషంబునఁ జంపె నొరులు నిలుతురె యెదురన్.

మ. బొమ లల్కన్ ముడివడ్డ రౌద్రరస ముప్పొంగం దనర్పన్ భుజా
గ్రము లిం దెవ్వఁడు నాకు మా ఱనుచు శౌర్యస్ఫూర్తిశోభిల్ల దు
ర్దమలీలం గవియంగ భీముఁ గని ధైర్యం బేది కౌరవ్య సై
న్యము లంతంతఁ గలంగఁ బాఱినటు లై నా మోమునన్ వ్రేలెడిన్.

క. కరవాలము గద మొద లగు, పరికర మేమియును లేక బాహుబలమునం
గరిగలి నడరినను వృకో, దరునకు నొకఁ డెదుర నిలిచి తలపడువాఁడే.

తే. ప్రళయకాలసముద్రముభంగిఁ బొంగి, కడు భయంకరుఁ డగు భీముఁ గడవ నీఁద
వశమె నాపుత్త్రులకు విధివశము వొంది, యెదిరిఁ దమ్మును నెఱుఁగరు మదముకతన.

క. చిచ్చునకుఁ దోడు గరువలి, వచ్చుగతిన్ భీము దుర్నివారవిహారం
బచ్చుపడఁగఁ బ్రాపై వి, వ్వచ్చుఁడు వెస వచ్చు గాండివంబును దానున్.

వ. సంజయా వినుము నీ కున్న రూపు సెప్పెద.

క. ఆ యర్జును మగఁటిమి కెన, యేయుగములఁ జూడ వినఁగ నెందును గలఁడే
నీయెదుర నాడినంతయుఁ, జేయుట కతఁ డోపు రిత్త సెప్పెడువాఁడే.

ఉ. ఎక్కటిగాండివంబు నుతి కెక్కి వెలుంగుట మీఁదఁ గేశవుం
డక్కజమైన తేజ మది యాసపడందు దనంత నర్జునుం
డొక్కఁడ వైరిసేనలకు నొట్టినమంట ప్రతాపమూర్తు లి
ట్లొక్కెడఁ గూడె నిన్నిటిమహోగ్రపు వేఁడిమి కోర్వవచ్చునే.

క. దివిజదనుజసహితము లగు, భువనము లన్నిట మహేంద్రపుత్రుఁడు విజయో
త్సవలీలఁ గ్రీడ సల్పుం, దవులంబడఁ డెందు నత్యుదగ్రబలమునన్.

వ. అని పలికి వెండియు.

# ★ గెలుపెవరిది? ★

చప్పుడు చేసుకొంటూ రైలు రానేవచ్చింది. 'రామం! ఒరేయ్...గుడ్ లక్ రా...శుభ ప్రయాణం' తదుద్దేశం ప్రణయం, తద్వారా పరిణయం...తద్వారా మాకూ...ఛీ సమయానికి తగిన పదం తట్టదు...కర్మ! అదేలే చెప్పన్నం అనుకో...ఊఁ వెళ్ళిరా" అంటూ సత్యం చెయ్యి ఊపుతూ వుంటే రైలు వాడికి దూరమైపోయింది.

* * *

బండి దిగి లోపలికి అడుగుపెట్టేనో లేదో "బావ వచ్చేడు బావ వచ్చా"డంటూ మామయ్యపిల్లలు ఒకటే హడావిడిగా నన్ను చుట్టేశారు. అంతలోకే అత్తయ్యా, అప్పుడే భోంచేసి చెయ్యి కడుక్కొని వస్తున్న మామయ్యా వచ్చి, అవీ ఇవీ అడిగి కుశల ప్రశ్నలు చేశారు. కాని ఇందరు ఇన్ని విధాల ఆదరించినా, నాకళ్ళు వెతుకుతున్న సుశీల కనబడనేలేదు. మామామయ్య ఆఫీసుకు టైం అవడంవల్ల "సాయంత్రం సావకాశంగా మాట్లాడుదాం బాబూ; రెండురోజుల నుండీ తిండీతిప్పలూ లేనట్లుంది. వెళ్ళి భోంచెయ్యి" అంటూ తాను ఆఫీసుకు వెళ్ళిపోయాడు.

అత్తయ్య ఆప్యాయంగా అన్నీ అడుగుతూ వడ్డిస్తోంది. సుభా, శంకరం నాకు ఇటూ అటూ కూర్చొని కబుర్లు చెప్తున్నారు. సుశీలను కాబోలు "నిన్నరాత్రి శనివారం అంటూ ఏమీ తినలేదు...నువ్వూ కూర్చో కూడదటే. మరీ గొప్పలకు పోతావ్. మన బావేగా, ఏం కొత్తవాడా?" అని అత్తయ్య మందలిస్తోంది. వస్తుందేమో అనుకొన్నాను. కాని సుశీల దర్శనభాగ్యం కలుగలేదు. సుభ వంగనాచిలాగ అత్తయ్యతో "పోనీలే అమ్మా, దానికి సిగ్గు పాపం!" అంది.

అత్తయ్య విసుక్కొంటూ "అవును కాని రామం! ఇన్నాళ్ళు ఫైనలు అయి అప్పుడే ఏడాదిపైన అయిందా. ఎన్నాళ్లని నాయనా! మరి ముహూర్తం సెలవల్లో పెట్టుకొంటే వీలవుతుందా అంటే, మీఅమ్మ నాన్నా ఏమీ జవాబివ్వలేదు. నీతో ఏమైనా చెప్పారా?" అంది.

"నాకేం తెలుసు అత్తయ్యా" అన్నాను.



వెంటనే సుభ అందుకొని "ఈ అమ్మకేమీ తెలియదు...అసలు పెళ్ళికొడుకు నెవరైనా అలాగ అడుగుతారేమిటి? ... పాపం బావ సిగ్గుపడుతున్నాడే!" అంది. దాన్ని మొట్టికాయవేసి "ఈ పెద్దా పేరక్కకి అన్నీ తెలుసు కాబోలు" అంటూ లేచాను!

* * *

మర్నాడు మాసుశీ మాతోబాటు భోజనానికి తయారైనా నన్ను కన్నెత్తి చూడాలేదు, పల్లెత్తుమాట పలకనూలేదు. మేమంతా ఏదో మాట్లాడుతూ భోంచేస్తున్నాము. మాశంకరం ఉన్నట్లుండి "బావా నువ్వు శాటిలైటు చూసేవా" అన్నాడు, "ఏం కొంపతీసి నువ్వు చూశావేమిటి?" అన్నాను.

"ఓ మొన్ననే నిన్నగాక మొన్న చూశాము" అందిసుభ. "కలలోనా" అన్నా. ఇక ఇద్దరూ అందుకొన్నారు. లేదు బావా నిజంగానే మరేమోనేం అసలంతకు ముందే ఎవరెవరో చూశామని చెప్పకొంటే "ఇదిగో పులంటేఅదిగో తోక" రకాలనుకొన్నాము."

"అసలారకంగా కొందరు బడాయిలూ, గొప్పలూ చెప్పకొంటూ వుంటారులే" అంది సుభ. మధ్యలో శంకరం మళ్ళీ అందుకొని "మరేం ఆనాడు ఆచార్లుగారు వచ్చి, నాన్నగారితో సరిగ్గా 11-20 కి ఈ ఊళ్లో కనిపిస్తుందని..."

"ఈ ఊళ్ళో ఏమిటి ఈ ప్రాంతం మీదుగా పాస్ అవుతుందని" అంది సుశీ తన మానవ్రతం మరచిపోయి.

"ఆ అదేలే...ఆగ్నేయ దిక్కుగాపుట్టి వాయవ్య దిక్కుగా పోతుందని, నెత్తి మీదనుండి కాకుండా 20 డిగ్రీల కోణంలో పోతుందని, కాలేజీలో లెక్చరర్లు టెలిస్కోపులు పెట్టుకొని రోజూ దాన్ని చూస్తున్నారని చెప్పేరు" అన్నాడు మా శంకరం.

నేను మధ్యలో అందుకొని "అయితే నువ్వు టెలిస్కోపులో చూశావా" అన్నాను. "ఛీ...కాదు అయనే చెప్పేరు మామూలుగా బైనాక్యులర్స్ కూడా అక్కరలేకుండా మన కళ్ళకే కనబడుతుందని...సరే ఆరోజు 9-30 కి మేడ ఎక్కాం. పదకొండుకొట్టారు నేనూ సుభా ఆగ్నేయమూల వైపే చూస్తున్నాం. రెప్పవెయ్యకుండా... అమ్మానాన్నా నిద్రవస్తోందని క్రిందికి వెళ్ళిపోయారు."

"ఐతే మీరు ముగ్గురూ చూశారన్నమాట" అన్నాను నవ్వుతూ.

"ఛీ...నీకు నమ్మకంలేదు. చెప్పేదంతా సరిగ్గావినుమరీ" అంటూ సుభ మొదలెట్టబోతే "నువ్వు మధ్యలోరాకు నన్ను చెప్పనీ" అంటూ శంకరం "మరేం. అక్క కూడా అటూ ఇటూ చూస్తూ అదివచ్చిచచ్చిందా? నాకు నిద్ర వస్తోంది, నేనుపోతా"నని కదలబోయి మళ్ళీ ఒక ఐదునిముషాలు అటు ఇటూ తిరుగుతోంది. అంతలోకే తూర్పునుండి రైలుకట్టకి క్రిందగా, ఒక ఎర్రనిచుక్క కదుల్తూ రావడం కనిపెట్టి 'అదిగో' అంది..." "మరి ఆవిడగారివి పెద్దకళ్ళుగా" అంటూ కళ్లుతిప్పకొంది సుభ. సుశీవైపు చూశాను. ఆమె పెద్దకళ్ళు శంకరంచెప్పే విషయాన్ని తను చెప్తున్నట్లే మెరుస్తున్నాయి. నేనుచూడ్డం గ్రహించిన సుశీచూపులు క్రిందికివాలిపోయాయి. "ఏడిశావ్ నోరుముయ్యి" అంటూ సుశీ తన చెల్లెలిమీద విసుక్కొంది.

"మరేం, అప్పుడు పచ్చనినక్షత్రం..."

"పచ్చటిదికాదు. ఎర్రగా అంగారక గ్రహంలాగవుంది" అంది సుశీ. "ఎర్రగానే వుందర్రా" అంది అత్తయ్య.

"మీలో మీకే ఇన్ని సందేహాలొస్తున్నాయే" అంటూ అప్రయత్నంగా సుశీవైపు చూశాను. సుశీకి కొద్దిగా కోపంవస్తున్నట్లు గుర్తించి "నువ్వూ చూసేవా అత్తయ్యా" అన్నాను. "ఆఁ వీళ్ళులేపేరు. మీమామయ్య కూడా చూశారు" అంది అత్తయ్య...

"ఊఁ. అదేలే...ఎర్రనిచుక్క అలాగ నడుచుకొని వచ్చేస్తున్నట్లు కదుల్తూ తూర్పు నుండి నడినెత్తిమీదికివచ్చి అలాగ వాయవ్య దిక్కుగాపోయి కొంతదూరం కనబడి మళ్లీ ఆ చుక్కలగుంపులో కలసిపోయినట్లైంది...

అబ్బ. నిజంగా ఒకకలలో ఏదోజరిగినట్లైంది. ఇంకా కళ్ళుమూసుకొంటే కళ్లకికడుతునే వుంది.ఎంతబాగుందనుకొన్నావు,బావా..." అంటూ శంకరం తన కామెంటరీ మొదలు పెట్టేడు. సుభ అందుకొని "మరేం...బావా, ఆరోజురాత్రంతాకలలో నాకొకశాటిలైటే.. అందులో కూర్చొని అలాగ వెళ్ళిపోతూ క్రిందికి తొంగిచూశానట. అపళంగా కాలుజారి అలాగ పడిపోతున్నాను. భయపడిపోయి లేచిచూస్తే పక్కమీదే ఉన్నాను" అంది.

వాళ్ళవన్నీ చెప్పాక "మీరు చూసినది శాటిలైటు కాదు" అన్నానెమ్మదిగా, "ఎలాగ చెప్పగలవూ?" అని రెట్టించాడు శంకరం. "అసలు శాటిలైటు కంటికి కనబడదు. పైగా అది సూర్యాస్తమయం తర్వాతా, సూర్యోదయానికి ముందూ ట్విలైటు అంటారే...అలాంటి ట్విలైటు ఎక్కువసేపు ఉండే దేశాల్లో ఆ సమయంలో బైనాక్యులర్స్ పెట్టుకొని చూస్తేనేగాని కనబడదు. ఆసమయాల్లో అయితేనే సూర్యుని వెలుగు చంద్రునిమీద పడి ప్రతిఫలించినట్లు, దానిమీదపడి ప్రతిఫలించి,

మనకు కనబడే అవకాశం వుంది. అంతేకాని రాత్రి పదకొండు గంటలకు కనబడే అవకాశం లేదు," అన్నాను.

"కనబడే అవకాశం లేకపోవచ్చు. కాని కనబడింది. అది ఉల్క కాదు. ఏమంటే అంత మెరుపువంటి వేగంతో జారిపడలేదు. తోకచుక్క కాదు. ఇంకేదీ కాదు. ఒకవేళ శాటిలైట్ కాకపోతే దానివెంటనే ఉన్న రాకెటైనా అయుండాలి," అంటూ సుశీ శంకరంవైపు తిరిగి నొక్కి వక్కాణించింది. "అసలు దాని మూవ్‌మెంటు బట్టే తెలుస్తోంది. అది మేన్‌మేడ్ ఆబ్‌జక్టు అని" అంటూ బలపరిచాడు శంకరం.

"అసలది 183 మైళ్లుకూడా లేదురా. అంతదూరంనుండి మీకది ఎలా కనబడుతుంది?" అన్నానో లేదో "ఎలాగ కనబడుతుందో కనబడింది...పుస్తకాల్లో వ్రాసేవి మేమూ చదివేం. అది శాటిలైటే! మామూలు నక్షత్రాలు, గ్రహాలమల్లే దూరంగా కాక శాటిలైటంటే చాలా దగ్గరో కదులుతున్నట్లు కనబడింది. పైగా మేము చూసినరోజే 8-30కి మద్రాసులో ఎవరో మంత్రి ఎర్రనిచుక్క అలాగే కదుల్తూ పోవడం చూసినట్లు పేపర్లో పడింది..." అని సుభ అంది. "కాని అది సౌత్ ఈస్టునుండి నార్తువెస్టుగా పోయిందట," అన్నాడు శంకరం మధ్యలో.

"95 నిముషాలకొకసారి భూమిని చుట్టి వస్తోందిగా...అలాగ చుట్టడంలో వాళ్ళు ఒక రొటేషన్ చూసి వుండవచ్చు. మనమింకొకటి చూసివుంటాం..." అంది సుశీ.

"అయితే అది ఒకే కక్ష్యలో నడుస్తోంది కాని, నిముష నిముషానికీ డైరెక్షన్ మారుస్తోందా?...అయినా అసలు శాటిలైటు భూమధ్యరేఖకి 65 డిగ్రీల కోణంలో ఉత్తరమునుండి దక్షిణానికి తిరుగుతోందే కాని తూర్పునుండి కాదు," అన్నాను నవ్వుతూ.

కాని తక్కిన వాళ్ళంతా చాలా నమ్మకముగా ఉన్నారు. ముఖ్యముగా ఎన్నడూ మాట్లాడని సుశీల నాతో వాదానికి దిగిందంటే ఈ శాటిలైటు ప్రభావానికి నాకు చాలా ఆశ్చర్యం వేసింది.

"ఏమో, అవన్నీ నాకు తెలియవు. విశాల భూభాగం అంతటిలోనూ మన ఇండియా ఎంత? అందులో ఈ కాస్త అనంతపురం మేరలో మనకా దిక్కు పోతున్నట్లనిపించిందేమో?" అంది సుశీ.

"మీరు ఏ ఏరోప్లేనో చూసివుంటారు" అన్నా. వెంటనే నావైపు తిరిగి కోపంగా సుశీ "ఏరోప్లేన్ మొహం ఎరగనివాళ్ళం కాదు. రాత్రి విమానానికి ఒక లైటే కాదు, రెండుంటాయి. పైగా నేను చాలా జాగ్రత్తగా విన్నాను ఎక్కడైనా కొంచెం శబ్దం ఉందేమోనని...లేదు" అంది గట్టిగా.

"ఏమో నాకళ్ళతో చూస్తేనేకాని నేను నమ్మను" అన్నాను ఇంకా గట్టిగా.

"ఐతే పందెం వేద్దాం. నేను చూపిస్తా" నంది.

"ఎంతెంత పందెం?"

"ఐదు రూపాయలు" అంది.

"ఒసేయ్ ఏమిటే అది?" అంది అత్తయ్య.

"నువ్వు ఊరుకోవమ్మా......ప్రతిదానికీ అడ్డు" అంటూ శంకరం ఆపేశాడు. సుభ "ఒసేయ్. ఐదు ఏమిటే...పదిహేనువెయ్యి. బజార్లో మొన్న చూసిన కనకాంబరం కోయంబత్తూరు చీర కొనుక్కోవచ్చు," అంది.

"సరే అయితే. పదిహేను రూపాయలు. కాని మీ అక్క ఓడితే తన స్వంతడబ్బు ఇవ్వాలి. అమ్మనీ నాన్ననీ అడిగికాదు," అన్నాను.

సుభ "ఒసేయ్. ఎలా తెస్తావే. ఉద్యోగం చేస్తావా?" అంటే, "ఛీ...నువ్వు కళ్లారా చూసి కూడా ఏమిటే అది. తప్పకుండా నాకాచీర ఖాయం" అంది సుశీ ఉడుకుమోత్తనం, కోపంలో నవ్వు తెచ్చుకోడానికి ప్రయత్నిస్తూ. శంకర "ఒకవేళ అది కనబడకపోతే..." అన్నాడు. ఎందుకు కనబడదూ? తప్పక కనిపిస్తుంది," అంది సుశీ.

అత్తయ్య "బాగానేవుంది పందెం. కాని ఇలాగ ఎంతసేపు కూర్చొంటారు? నాకు పనుంది. లేవండి" అనే వరకూ మేమలాగే వున్నాం. సుభ లేస్తూ "నిన్న పే...ద్ద బడాయిగా సిగ్గుపడిన అక్కయ్య ఇవాళ బావతో దెబ్బలాడేసి, పందెం కూడా వేసేసిందర్రోయ్," అంది. ఆమాటకి అంతా నవ్వేం - సుశీ మొహం సిగ్గువల్లకంటె కోపం వల్ల ఎర్రబడింది. "అలాగే నవ్వుతూ వుండండి. పందెం గెల్చుకోకపోతే చూడండి" అంటూ వెళ్ళిపోయింది సుశీ...

* * *

ఆ రాత్రి డాబామీద నేనూ శంకరం ఒకవైపూ, సుశీ, సుభా మరొకవైపు చూస్తూ కూర్చున్నాం. పదకొండు అయింది. మాటలు కూడా ఆపేసి నిశ్శబ్దంగా చూస్తున్నాం. అత్తయ్య పనంతా చేసుకొని పైకివచ్చి కాస్సేపు కూర్చుని "ఆఁ...అది ఏయే వూర్లు పోయివుంటుందో. ఇంకా మన అనంతపురానికి ఎంతసేపవుతుందో" అంది ఆవులిస్తూ. పక్కుమన్నాం ఆవిడ మాటలకి. "అమ్మా అదేం రైలనుకొన్నావా ఊరూరూ పోవడానికి" అన్నాడు శంకరం. "ఇప్పుడు చందమామా, సప్తఋషులూ తాతయ్యగారి ఊర్లోనూ ఇక్కడా కూడా ఒకేలాగ కనిపిస్తున్నాయా లేదా? అలాగే ఇది కూడా మనదేశమంతా ఒకే టైములో కనిపిస్తుంది" అంది సుభ తన తెలిసీ తెలియని విజ్ఞానంతో. మళ్ళీ నిశ్శబ్దం. అత్తయ్య నిద్రవస్తోందని చెప్పి దిగిపోయింది. 11-30 అయింది. శంకరం రైలుకట్ట అవతల ఏదో చూసి "అదేమిటే అన్నాడు." "ఏది" అంటూ సుశీ, సుభా ముందుకొచ్చారు. తీరా చూస్తే ఏదో ఎలక్ట్రిక్ లైటు! "ఛీ, వెధవా" అని తన ఆశాభంగాన్ని వెళ్ళగక్కింది సుశీల. "ఇలాంటిదే ఏదో చూసి భ్రమపడి ఉంటారు" అన్నా. "మొన్న కనబడిందే" అన్నాడు శంకరం. "కలలోకదూ" అన్నా. సుశీ కోపంగా ఇవాళ కాకుంటే రేపు కనిపిస్తుంది. ఎక్కడికి పోతుంది" అంది.

"అబ్బా 12 కావొస్తోంది. ఇంకా ఏమీ లేదు. నాకు నిద్రవస్తోంది. అదివస్తే లేపండి" అంటూ క్రిందికి దిగిపోయాను. నా వెంటనే సుభా, శంకరంకూడా దిగిపోయారు. "నేనింకో అరగంట చూసివస్తా"నని సుశీ అనడం వినిపించింది. డాబామీద ఒంటరిగా వెన్నెల్లో సుశీ శాటిలైటుకోసం నిరీక్షిస్తూంది అనుకొన్నాను, కాని పదినిమిషాలైనా కాకుండా నెమ్మదిగా తలుపువేసేసి సుశీదిగివచ్చి అడుగులో అడుగువేసికొంటూ తనప్రక్క చేరుకొంది.

* * *

మర్నాడుకూడా ఇదే ప్రకారం జరిగింది. నేను శంకరంతో "మరి మీ అక్క ఆ పదిహేను తెమ్మను. ఎలాగ తెస్తుందో చూద్దాం" అన్నాను దిగిపోతూ. ఆ మాటతో సుశీకి ఉడుకుమోత్తనం, పట్టుదలా ఎక్కువయ్యాయి. ఒంటిగంటవరకూ మేలుకొన్నా సుశీ ఎప్పుడు క్రిందికి దిగిందో నాకు తెలియనే లేదు.

* * *

మర్నాడు భోంచేస్తూ మామయ్య "మా సుశీతల్లి ఉత్సాహం చూస్తే మళ్ళీసారి రష్యన్‌శాటిలైటులో కూర్చొనేందుకు ఎవరో స్తారంటే 'రడీ' అనేటట్లుంది." అన్నాడు నవ్వుతూ. సుభ "మరి అక్క శాటిలైటు ఎక్కితే బావకో" అంది. "అప్పుడు బావని నువ్వు పెళ్లాడ్డువుగాని" అని అత్తయ్య అంటే "ఛీ నాకొదుబాబూ" అంటున్న సుభమాటలు మానవ్వుల్లో కలిసిపోయాయి.

రాత్రి భోజనాలవగానే సుశీ మేడెక్క

# గెలుపెవరిది?

కావ్వుంటే నిద్రలేకుండా మంచులో కూర్చోవద్దని అత్తయ్య తిట్టింది. నేనేమీ అనలేదు; అంటే ఇంక సుశీ ఉక్రోషం పట్టలేదేమోనని. ఆ రోజు సుభా, శంకరం కూడ ఎక్కలేదు!

*　　*　　*

అర్ధరాత్రి అయింది. ఒక మధుర స్పర్శతో మెలకువ వచ్చింది. ఉలిక్కిపడి లేచాను. సుశీ వణికిపోతోంది. రాత్రి అంతసేపూ ఒంటరిగా వుండడంవల్ల ఏదైనా చూసి భయపడిందేమో అనుకొన్నాను. ఆమె రెండు భుజాలూ పట్టుకొని 'ఏం సుశీ' అన్నా లాలనగా, కాని సుశీ నా అప్యాయత గుర్తించే స్థితిలో లేదు. అసలు స్పర్శ జ్ఞానమే లేనట్లుంది ఆమెకి. పెదిమలు వణికిపోతున్నాయి. భుజాలమీద నా చేతులు తీసేసి, బ్రహ్మప్రయత్నంమీద "శాటిలైటు" అంటూ నా చెయ్యి పట్టుకొని లాక్కెళ్ళింది. ఇంట్లో అంతా లేచారు. "అదుగో" అంది పైకి చూపిస్తూ. ఎర్రని నక్షత్రం. అవును ఎర్రగానేవుంది. రైలు కట్టకి కొంచెం పైన...అదుగో...అరే ఎంత బాగా కదుల్తోందో. ఇలాగే వస్తోంది. బాగా నడినెత్తిమీదికొచ్చేసింది...అరే ఇదేమిటో పడమరగా పోతోందే. అదుగో అదేనా...అరే......కనబడడంలేదు. వీరు చెప్పినట్లే హొరైజన్‌లో క్రుంగినట్లే కనబడలేదు......నా ఆశ్చర్యానికి అంతులేదు! ఏమిటిదీ?......

అది శంకరం అన్నట్లు 'మేన్ మేడ్ ఆబ్జక్టు'లాగే వుంది. కాని ఎంత ప్రయత్నించినా పేపర్లో వచ్చిన విషయాలనీ, దీనినీ అనుసంధించుకోలేకపోయాను. కళ్ళారా చూసిన దీన్ని నమ్మడమా? మానడమా? ఏదీ పాలుపోలేదు. మా శంకరం "బావ ఓడిపోయాడు. ఐతే మరి పదిహేను ఎప్పుడిస్తావుబావా" అన్నాడు. నేనేం జవాబు చెప్పలేకపోయాను.

క్రిందకి దిగాను. పెట్టెతీసి పదిహేను రూపాయలూ తీస్తూవుంటే సుశీ వచ్చి "ఇప్పుడేమంటారండీ" అని వెక్కిరించింది. డబ్బు చేతుల్లో పెట్టబోయాను. "ఒద్దులే" అంది, తీసికోనా వద్దా అనుకొంటూ 'గల్పావుగా తీసుకో. పదిహేనుపోతే పోయాయి కాని, శాటిలైటు ధర్మమా అని..." అంటూ కొంటెగా సుశీ కళ్ళలోకి చూసేను. సుశీ మొహం ఎర్రతామర మొగ్గలాగ అయిపోయింది. అంతలోకి శంకరం వచ్చి "ఒసేయ్. తీసికోవే...ఇలా గివ్వుబావా" అంటూ నా చేతిలోంచి డబ్బు తీసుకొని సుశీకిచ్చాడు. అంతలోకి అత్తయ్య వచ్చి "పన్నెండు కేమిట్రా ... మీ పందెం బంగారమవా...రేపొద్దున్న చూసుకొందురు గాని...అయినా సుశీ ఏమిటే ఆ పెంకితనం? రెండురోజులు కనబడకపోతే నీ దగ్గరనుండి బావ ఇలాగే లాగేడా?" అని కేకలేస్తే, అంతా ఎవరి ప్రక్కలు వాళ్ళు చేరారు.

సుశీ, సుభా శంకరంలతో ఎంతో సేపు తానెంత ధైర్యంగా, నమ్మకంగా ఉన్నదీ అన్నీ గర్వంగా చెబ్తోంది. సుభ ఆఖరికి "అయితే అక్క పెళ్ళికాకుండానే బావని ఓడించేసిందన్న మాట. అయితే అక్కదే పైచెయ్యి!" అంటే సుశీ గర్వంగా నవ్వడం విన్న నా మనస్సు కలుక్కుమంది. 'ఏమిటిది నిజంగా శాటిలైటా' అన్న ఆలోచనలో ఎప్పుడు నిద్రపట్టిందో తెలియదు.

*　　*　　*

మా సుశీ సుభా మర్నాడు ప్రొద్దున్నే షాపుకివెళ్ళి ఆ చీర కొనుక్కొని వచ్చారు. సుశీ తలంటిపోసుకొని కనకాంబరం కోయంబత్తూరు జరీచీర కట్టుకొని బుసబుస చప్పుడు చేసుకొంటూ గర్వంగా తలఎత్తి పదిసార్లు నా గదిముందు అటూ ఇటూ తారట్లాడింది. సుభ సుశీప్రక్కనే నిలబడి "ఐతే బావా పాపం! పదిహేను రూపాయలు పోయాయి కదూ" అంది నన్ను పీటీచేస్తూ. "పదిహేను పోతే పోయాయికానీ, దాన్ని మించింది లభించింది" అన్నా...

"ఏమిటీ."

"మీ అక్కనే అడుగు" అంటే, సుశీ సిగ్గుతో "ఒసే. మగవాళ్ళంతే లేవే...క్రింద పడ్డా ఇంకా నా చెయ్యి పైనే అంటూ వుంటారు" అని లేని విసుగు నభినయించి వెళ్ళిపోయింది.

*　　*　　*

మర్నాడు నేనొక్కణ్ణే డాబాఎక్కాను పందెం అయిపోయిందిగా, మూడు రోజుల నుండి నిద్రలేని సుశీ 7-30 కే పడుకుంది. 11.30 కి అదే దిక్కులో నుండి ఎర్రని నక్షత్రం బయలుదేరి నడినెత్తి మీదికి వచ్చి నైరుతి దిక్కుగా పోయింది. ఏమిటిదీ...నిన్న పడమరగా పోయింది. అదివరకు సుశీవాళ్ళూ చూసిన రోజు ఆగ్నేయ దిక్కుగా పోయిందట. శాటిలైటు ఇలాగ దిక్కులు మారుస్తుందా? అంతేకాక 95 నిముషాల కొకసారి భూమిని చుట్టివస్తుంది. అలాగైతే నిన్న 11-30 కి కనబడితే ఈ రోజు 9-45 కో, లేక 12-55 కో కనబడాలి న్యాయానికి. కాని రోజూ అదే టైముకి కనబడడం సాధ్యమా? మరి శాటిలైటేనా? కాదేమో! ఐతేమరేమిటీ?.... ఫిజక్సు ఎమ్ ఏ.నైనా ఒకేసబ్జక్టులో రిసర్చి చేసి తెక్కనదంతా పూర్తిగా మరచిపోయి నందుకూ, ఫీసెస్ పెట్టే హడావిడిలో శాటిలైటు విషయం గురించి శ్రద్ధతీసికొని ఏమీ చదవనందుకు నన్ను నేను తిట్టుకొన్నాను. నెమ్మదిగా ఆలోచనలోనుండి తేరుకొని క్రిందకెళ్ళి ప్రక్కమీద వాలాను.

*　　*　　*

నాలుగు రోజులు గడిచాయి. నాన్న మామయ్యకి ఉత్తరంవ్రాశారు. ముహూర్తం ఎంతలోందరలో పెట్టుకుంటే అంత మంచిదని అందులో వ్రాశారు... [illegible]

నాలుగు రోజులు గడిచాయి. నాన్న మామయ్యకి ఉత్తరం వ్రాశారు. ముహూర్తం ఎంతతొందరలో పెట్టుకుంటే అంత మంచిదని సంతోషిస్తామనీ, అభ్యంతర మేమీ లేదనీను. సుశీ ఈ ఉత్తరం వచ్చినదగ్గరనుండి నాకంట బడడం మానేసింది. నాకు పెళ్ళి అనుకొనేసరికి ఏవో మధురానుభూతులు మొలకెత్తి చాలా ఆనందంగా ఉంది. ఇంట్లో కూర్చోలేక అలాగ బజారువైపు వెళ్ళాను. టవర్ క్లాక్ దగ్గర నా ఇంటరు క్లాసుమేట్ మురళీధర కనిపించాడు. "ఇదేమిటి? ఇక్కడున్నావేం?" అన్నాడు. జవాబు చెప్పి నేనూ అదేప్రశ్న వేశాను. "ఏదో లేరా ఇంటరయ్యాక, మానాన్న పోయారు. కుటుంబ భారం నెత్తిన పడింది. బియ్యే మొదటి సంవత్సరంలో మన చదువుకి బ్రేక్ పడింది. ఏదో కలెక్టర్ ఆఫీసులో గుమాస్తాగా చేరాను. ఇలాగే బండిలాక్కొస్తున్నాను. అంతా నీలాగ బియ్యే, ఎమ్మే, ఎమ్మెస్సి, డి. యస్సీలూ చెలగాడితే మాలాగ గుమాస్తాల పని ఎవ్వరా చేసేది? అందుకని మేం ఇవిచేస్తున్నాం ఏదో అంటారే..అందరూ అందలం ఎక్కితే మోసేదెవరంటూ..." అన్నాడు. ఏవో అవీ ఇవీ మాట్లాడుతూ "ఏమోయ్ శాటిలైటు చూశావా?" అన్నా. "ఉహుఁ" అంటూ పెదిమవిరచి "నువ్వు చూశావటోయ్" అన్నాడు. "ఏదో ఎర్రనిచుక్క పదకొండు గంటల ప్రాంతానికి చూశాను. అది మరి శాటిలైటేనా అని అనుమానం..." అంటున్నానో లేదో "కొంప దీశావ్...నువ్వూ పడ్డావూ బుట్టలో...ఎర్రని చుక్క రైలు కట్ట కవతల వైపుగా బయలుదేరి నడినెత్తి మీదికి వచ్చి ఏదో ఒక దిక్కుకి పోతూ ఉంటుంది!..."

"ఆఁ ఆఁ అదే...అయితే ఏం? అది

శాటిలైటు కాదూ...రాకెట్టా?..."

"రాకెట్టూ కాదు, నా తలకాయా కాదు. శాటిలైటులైతే 500 మైళ్ళ పైనే కదూ ఉంటుందీ...కాని ఈ శాటిలైటు మబ్బుల క్రిందుగా పోతూ వుంటుంది గమనించావో లేదో. అంతేకాదు హోరైజన్ వరకూ పోదు. మధ్యలోనే పేలి అంతమైపోతుంది. ఒకొక్కరోజు అల్లల్లాడుతూ గజిబిజిగా పోతుంది," అన్నాడు.

"చంపేశావ్. అదా సమాచారం! నాకూ అనుమానమే, అది శాటిలైటు కాదని. కాని మేం చూసిన రోజు ఒక లైన్ గీస్తే అందులోనే పోయినట్టుపోయింది. పైగా ఆనాడు మబ్బులూ లేవు..." అన్నా.

"గాలివేగం ఎటుంటే అటు పోతుందిలే" అంటూనవ్వాడు, వాళ్ళ ఆఫీసు డాబాపైనే ఈపనంతా చేస్తారట. టెలిస్కోపులూ అవి పెట్టుకొని ఖగోళ పరిశీలన గావిస్తూ ఉంటారట. "గాస్ సిలిండర్లు తెప్పిస్తాములే దాన్ని వదలడానికి ప్రతిరోజూ ఇద్దరు గుమాస్తాలు డ్యూటీగావెడుతూ ఉంటారు. సరిగా 11 దాటేక గాస్ వదిలి పంపిస్తారు. టెలిస్కోపులో దాని గమనాన్ని చూసి ఆనాటి గాలి స్పీడ్ నిర్ణయించి నోట్ చేసుకొనేందుకు మరిదరు గుమాస్తాలుంటారు. ఎప్పుడూ చేస్తూనే ఉంటాం ఈ పని. కాని ఈ శాటిలైటు కోసం ప్రజచూడ్డం ప్రారంభించాకే ఇది వాళ్ళకళ్ళ బడింది. పాపం అదే శాటిలైటు అనుకొని సంతోషిస్తున్నారు" అన్నాడు. 'నీతస్స దియ్య బ్రతికించావు. అదే శాటిలైటు అనుకొంటే వచ్చినది సంతోషం కాదురా బాబూ"అని మనస్సులో అనుకొని, "ఓరేయ్' నాకో ఉపకారం చేస్తావూ" అన్నా.

"ఏమిటీ? నేను చేయగలిగినదైతే" అన్నాడు. "చెయ్యలిగినదేరా నాయనా... కాని ఎందుకూ అని అడగకూడదు. ఏం?" అన్నా.

"ఓరేయ్. చిన్ననాటి స్నేహితుడివి. అందులో డి. యస్. సి. వి. ఇలాంటి చిన్న గుమాస్తాగాణ్ణి......"

"నువ్వలాగ అంటే ఊరుకోనేది లేదు. ఊఁ అను చాలు" అన్నాను. "ఊఁ", అన్నాడు.

"ఏం లేదురా, ఇవాళ మా కుటుంబం అంతా వస్తాము కాని చూడ్డానికి అనుమతి ఇస్తావూ?" అన్నాను. "చంపేవే ... ఏం విశేషం? అడగవద్దన్నావుగా ... ఊఁ..." అంటూ పళ్ళు బిగబట్టి, "సరే అయితే...నీకోసం ఎలాగో అలాగ ఎరేంజిచేస్తా. కాని పదకొండు గంటలకి రాక పోయావో...మరి చూస్కో... చలిలో నీ కోసం గేటువగర కాచుకొని ఉంటాను సుమా ... రావాలి" అంటూ సెలవు తీసుకొన్నాడు.

నేనింటికి వచ్చేసరికి మా మావయ్య ఆరోజు సినిమాకి ప్లాన్ వేస్తున్నాడు. ఆఫీసు నుండి జీప్ తెప్పించి ఇంట్లో అందరినీ ప్రయాణం కమ్మంటున్నాడు. ఆ సుశీ అదే కనకాంబరం కోయంబత్తూరుచీర కట్టుకొని హడావిడిగా అటూ ఇటూ తిరుగుతోంది. జీప్ రావడం బాగానే వుందనుకొని, "నువ్వూ తయారవు రామం" అంటున్న మామయ్యతో మెమ్మదిగా సినిమా అయ్యాక అలాగ కలకర్ ఆఫీసుకు ఓ ట్రిప్ కొట్టేందుకు అనుమతి నడిగాను. "ఏం విశేషం?" అన్నాడు. మామయ్య చెవిలో అసలు రహస్యం చెప్పక తప్పిందికాదు. "ఊఁ...అదా సంగతి. సరేకానీ...అని నవ్వుతూ భుజం తట్టాడు......"

సినిమా అయింది. అంతా జీప్ ఎక్కాం. "సావిత్రి బాగాచేసిందిగదూ. 'అనురాగాలు నిండాలి' అన్నపాట బాగుంది" అంటూ సినిమా కబుర్లలోపడ్డ సుశీ, సుభా, జీప్ కలెక్టరాఫీస్ వైపు పోదడం గమనించలేదు. జీప్ ఆగగానే "ఇదేమిటి" అన్నారు ఇద్దరూ ఒకేసారి. మురళి నాతో అన్నట్లుగానే కాచుకొని ఉన్నాడు. "తమాషా చూపిస్తానురండి" అంటూ తీసికెళ్ళాను. అత్తయ్య "నేనురాలే" నంటున్నా మామయ్య బలవంతపెట్టి తీసుకొచ్చాడు. మెట్లెక్కుతూ శంకరం, సుభా, సుశీ అంతా "ఏమిటిదీ, ఎందుకు" అనే ప్రశ్నలు ఒకలక్షఅయినా అడిగివుంటారు. మేడ ఎక్కాం. మురళి "ఇది" అంటూ వివరించబోతే "ఉష్ ఉండు చూస్తారుగా" అంటూ ఆపేశాను. తెల్లబోయాడతను.

పైన గాల్లో ఒక బెలూన్వుంది. క్రింద నుంచి ఒక జవాన్ గాస్ పంపుచేస్తున్నాడు "ఏమిటదీ" అంటూ శంకరం సుభా వేధించినా 'చూస్తూవుండండి' అనిమాత్రం ఊరుకొన్నాను. సరిగ్గా 11 గంటలు కొట్టారు. జవాను దారంతో ఆటోమ్యాటిక్ కట్టేసి గాస్ సిలిండరుకు కనెక్టుచేసిన స్క్రూ తిప్పి వదిలేడో లేదో బెలూన్ పైకి లేచిపోయింది. "అరే ఏమిటదీ" అంది సుశీల ఆశ్చర్యంగా, అప్రయత్నంగా. వెన్నెట్లో మిలమిల్లాడుతున్న కనకాంబరం జరీచీరవైపు చూస్తూ "శాటిలైటు" అన్నాను ధీమాగా...సుశీ మొహం వెల్లబడివుంటుంది. "అరే ఇదాయనం శాటిలైటు అనుకొన్నదీ" అంది సుభ. "ఇది బెలూనా? ఇలాగపంపి ఏంచేస్తారూ?... ఎందుకూ?...మరైతే శాటిలైటు కాదన్నమాట! 'ఇత్యాదిప్రశ్నలొకదానివెంటమరొకటి నన్ను చుట్టేశాయి. మురళికి థాంక్స్ చెప్పి జీప్ ఎక్కాం. మా అత్తయ్య అడిగే ప్రశ్నలకి మామామయ్యా, సుభా, శంకరమూ అడిగే వాటికి నేనూ జవాబులు చెప్తూంటే ఇల్లు వచ్చేసింది. సుశీ మొహంలో రంగులెలా మారేయో కనిపెడదామని ప్రయత్నించాను కాని, చీకటివల్ల వీలు కాలేదు. పైగా ఆ పిల్ల తలవంచేసుకొని మాటి విడాయించుకొంది.

జీప్ దిగుతూ సుభ "అయితే అక్క ఓడిపోయిందన్నమాట. బావ చెయ్యే పైన. అయినా డి. యస్. సి మొగుణ్ణి ఈవిడగారి ఎస్. ఎస్. ఎల్. సి. తో లొంగదీసుకోవాలనుకొంటే సాధ్యమా?" అంది. "ముదిపెరక్కమాటలు మాట్లాడ"కంటూ అత్తయ్య

(47-వ పేజీ చూడండి)

# అపాయంలో ఉపాయం

"కాశీపతీ! ఓరి కాశీపతీ!" అని ఒక్కసారి బిగ్గరగా అరిచింది రావమ్మగారు. తల్లి కేక విని-నిద్ర మంచంమీంచి కంగారుగా, లేచి వచ్చాడు కాశీపతి—"ఎందుకే అమ్మ అలా పిలుస్తున్నావ్" అంటూ.

అప్పటికింకా తెల్లారలేదు. తెల్లవారకట్ల మూడున్నరగంట లవుతుంది. రావమ్మగారు ప్రతిరోజూ అదే సమయానికి లేస్తుంది. చక్కని గీత గోవిందం పాడుతూ-వీధి వాచి ఊడుస్తుంది. తన కంఠస్వరం-చీపురుకట్టధ్వని సందడిగా వుంటాయి.

రావమ్మగారు ఢక్కామొక్కీలు తిరిన మనిషి. మొగుడు మూడేళ్ల క్రితం పోయినా-కొడుకు కాశీపతి స్కూలుఫైనలు డింకీలు కొడుతున్నా, నీళ్ళబిందెలు మోసుకొని-నుప్పెట మూసినట్లు కాలక్షేపం చేస్తోంది. ధైర్యస్థురాలు. సామాన్యంగా జడుపూ-గిడుపూ లేని మనిషి. దెయ్యాలతో హోరాహోరీని దెబ్బలాడగల ఆరావమ్మగారు ఆవేళ బెదిరిపోయింది. హఠాత్తుగా ఆ అరుగువైపు చూసి-గాబరా పడింది. గుండెలు దడదడ కొట్టుకుంటున్నాయి.

కాశీపతి వచ్చి అడిగేసరికి రావమ్మగారు తమాయించుకొని-'అలా చూడరా' అంటూ అరుగువైపు చూపింది. పోయి-చూడమంది. తీరా కాశీపతి పోయి చూసేసరికి-అక్కడో పెద్దమనిషి పద్మాసనం వేసుకొని కూర్చున్నాడు. బుట్టతలపాగా చుట్టాడు. బుగ్గమీసాలున్నాయి. తీవిగా పంగనామాలు దిద్దుకున్నాడు. ఖద్దరు పంచె-ఖద్దరు లాల్చీ-సేలం అంచుల ఖద్దరు కండువా; గడ్డం కొంచం మాసింది. వయసు ముదిరిన ఆసామీలా వున్నాడు. కాని వడ్డూ-పొడుగూ-నిదానిస్తే బహు ముచ్చటగా వున్నాడు. ఖద్దరు లాల్చీపై శల్లెవాటు-తీవిగా వున్నాడు. ప్రక్కనే వుంది గొడుగు. జోళ్ళు కొంచెం దూరంగా వదిలాడు. 'ఏవూరయ్యా నీది?' అని ప్రశ్నించాడు కాశీపతి. సమాధానంలేదు, 'అలా చూస్తూ-మాట్లాడవేమయ్యా?' అని ఘట్టిగా డబాయించాడు కాశీపతి. "మాటా లేదు మంతీ లేదు, నిన్ను కాదటయ్యా-పిలిచేది" అంటూ ఒక్క తోపు తోశాడు కాశీపతి. ఆ పద్మాసనంలో వున్న విగ్రహం వొరిగింది. "అమ్మ-యిలా రావే" అన్నాడు కాశీపతి. రావమ్మ వచ్చింది. తమాయించుకొని పరిస్థితిని అవగాహన చేసుకుంది. "అబ్బాయీ-" అంది, "ఏవంటావే అమ్మ" అన్నాడు కాశీపతి.

"ఏముందిరా నాయనా-యీ శరీరంలో ప్రాణం లేదింక" అంది-చావుకబురు చల్లగా చెప్పుతున్నారన్నట్లు. "ఎవడో తెలియదు. ఇక్కడకు వచ్చి-యీ అరుగును పద్మాసనంతో అలంకరించి - చెక్కుచెదరకుండా చచ్చి వూరుకున్నాడు" అంది రావమ్మగారు.

"ఇది పిడి చావుకాదే తల్లీ. పిడివరసంతా చూస్తే ఏ కలరా విరోచనాలతోనో చచ్చినట్లుగా వుంది" అన్నాడు కాశీపతి.

"ఇంకా సందేహంట్రా వెధవాయ్. వూరినిండా కలరాలే. ఈ పెద్దమనిషి ఏ కోర్టు పనిమీదనో ఇక్కడకు అఘోరించి-యిలా చచ్చి మనకీచావు తెచ్చాడు-"అంది రావమ్మగారు. కాస్తాగి.

## అయ్యగారి విశ్వేశ్వరరావు

"ఈ కలరారోజుల్లో-యీ శవం కాటికి వెళ్ళాలంటే మాటలుట్రా వెర్రాడా! దిన కృత్యం గడవక ఛస్తున్నాంగదా-యీ కరువులో యిదోటా - ఏం చేయాలో తట్టటం లేదురా! కాశీపతీ-" అంది రావమ్మగారు.

ఇంతలో కాశీపతి-చచ్చినశవంమీదవున్న లాల్చీజేబులు తడిమాడు, ఒకజేబులోనున్నపు పీసా-తంబాకు-తమలపాకులూ వున్నాయి. రెండోజేబులో నలిగిపోయిన రూపాయనోట్లు నాలుగు - ఎనభై నయాపైసలు వున్నాయి. చేతిసంచీ లేదు - ఏమీ లేదు-గొడుగూ జోళ్ళు మినహాయిస్తే మరేమీ లేదు.

రావమ్మగారు ధైర్యం తెచ్చుకొని - కొంచం హుషారుగా - "ఒరే కాశీపతీ! ఒకవూహ తట్టిందిరా!" అంది. "ఏవిటి అమ్మ!" అని ఆతురతతో అడిగాడు కాశీపతి. "ఉపాయంతో - అపాయం నుంచి తప్పించుకోవాలిరా" - అంది రావమ్మగారు. "అంతకన్నానా - చెప్పవే అమ్మ" అన్నాడు కాశీపతి.

"ఏమీ లేదురా - ఆ రూపాయనోట్లు - ఆ చిల్లరాతీసేయ్. మనం యిద్దరంకలిసి మెల్లిగా యీ శవాన్ని ఆ ఎదురింటి ప్లీడరుగారి అరుగుమీదికి చేరుద్దాం. దహన సంస్కార విధులన్నీ - ఆయన నెత్తిమీద పడతాయి. నీకూ - నాకూ ఎందుకురా - యీ బెడద. ఇంకా తెల్లారలేదు. పాలవాళ్ళ గడబిడ - కార్లసందడి - రైలు కూతలు - ఫ్యాక్టరీ పిలుపులు - జనసంచారం ఆరంభం కాకముందే యీపనిచేసి - స్నానంచేసి - యింట్లో కూర్చుందాం" అంది రావమ్మగారు.

తల్లిచెప్పిన సలహాను శిరసావహించి - ఆతురాలా ఆశవాన్ని ఆ ఎదురింటి ప్లీడరుగారి అరుగుమీదికి చేర్చాడు కాశీపతి. చక్కగా స్నానంచేసి - ఇంట్లోకిపోయి - తమ ఘనకార్యాన్ని తలుచుకుని తలుచుకుని కడుపు చెక్కలయ్యేటట్టు నవ్వుకుంటున్నారు తల్లీ కొడుకూను.

ఇంకాకొంచెం చీకటి వుండగానే ఎదురింటిప్లీడరు పార్వతీశంగారు లేచారు. ఆనాటిరాత్రే వారి వియ్యంకుడుగారు వచ్చారు. వియ్యంకుడిగారిని మెప్పించేందుకు పార్వతీశం - తన ప్రాక్టీసును గురించి ఏమేమో చెబుతూవస్తున్నాడు. వియ్యంకుడు అన్నింటికీ వూకొట్టుతున్నాడే కాని ప్రశంసాలేదు ఏమీ లేదు.

"బావగారూ - రండి - అలా మార్నింగు వాక్ కుపోదాం" అంటూ వియ్యంకుడుతో సహా తలుపు తెరిచి బయటకు వచ్చాడు పార్వతీశం.

"చూశారా - బావగారూ - నేను చెప్పటంలేదూ - ఈ పార్టీలు యింతేనండీ. వేళాలేదు. పాళాలేదు. తెల్లారటం భయం. ఇంతేననుకోండి. నేనింకా నిద్రమంచం మీంచి లేచానోలేదో - అదుగో - అప్పుడే తయారు, తయారంటే నమ్మండి. అదుగో పిల్లిపిల్లలా కూర్చున్నాడు. వీడి పుట్టేం మునిగింది చెప్పండి. ఏ ఎనిమిదిగంటలకో రాకూడదూ! బావగారూ - వూపిరి సలపటం లేదనుకోండి - ఏ వూటీకో పోవాలనుకుంటున్నాను నుమండీ" అన్నాడు పార్వతీశం.

"వూటీకి వేసవికాలంలో పోతారుగాని శీతాకాలంగదా - ఇప్పుడు పోతారా బావగారూ" అన్నాడు వియ్యంకుడు. "ఆకాలం - యీకాలం యేవిటిబావగారూ-

ఎప్పుడు కాంతి కుదరాలంటే అప్పుడే పోవచ్చు" అని వియ్యంకుడిగారిని దబాయిస్తూ - ఆ అరుగుమీద విగ్రహాన్ని చూసి - "ఎందుకయ్యా - ఇప్పటినుంచీ యిక్కడ అఘోరించడం - పోయి కాఫ్యాదులు సేవించి ఎనిమిదింటికిరా" - అన్నాడు పార్వతీశం.

అవతలనుంచి బదులు రావటం లేదు. వియ్యంకుడుగారు అందుకున్నాడు. "పాపం - ఎప్పుడు ఏ రైలు దిగివచ్చాడో - విశ్వనికునుకు తీస్తున్నాడు తీరుబడిగా-" అన్నాడు వియ్యంకుడూ.

"ఇంకేనండి బావగారూ - మంచిగా వుంటే సరేసరి - లేకుంటే కూరిపార్టీలు. ఇంత అరుస్తున్నారూ మనం - కొంచెం నిద్రమాని - నా కోపం తగ్గించకూడదుటండీ. అల్పే వటిపడును మనుష్యులండీ యీపార్టీలు బావగారూ-చెండనాడుకో కూడదండోయ్. లబ్బుగాలాలించి - వచ్చేది వొదుక్కొని - పెట్టేటోటి పెటాలిగాని-కొ క్కైలాడితే మన తక్కో - పత్రమూ వాళ్ళకి-యీరోజుల్లో పీపర్లు ఎక్కడబడితే అక్కడ - అతివవక-మహోచవక. అంచేత నే ఏ రైనంతవరకూ మనుష్యుల్ని బెదిరించ కూడదని నామతం బావగారూ-" అన్నాడు పార్వతీశం.

వియ్యంకు లిద్దరూ ఇలా చెప్పుకుంటుండగానే వెలుతురు ఎక్కువ అవుతూంది. పార్వతీశం లేరిపార చూశాడు ఆ విగ్రహం వైపు. పరిచయంలేనికొత్తమనిషి. పార్టీకాదు —మన్నాకాదు. పార్వతీశం దబాయింపు తగ్గించి—"బావగారూ—అతణ్ణి కొంచెం పలకరించి చూద్దురూ" అన్నాడు. "ఏం పలకరించడం బావగారూ!" అంటూ— వియ్యంకుడు ఆ విగ్రహాన్ని సమీపించాడు. "బావగారూ—మీపార్టీ యాత్ర చాలించాడు. పాపం—మీ కుపూరి ఫీజు యిచ్చాడో లేదో, ఎదట పార్టీవాళ్లు ఎంత అదృష్టవంతులవుతారో—పాపం— పాయిదా—యివాకనా—ఏవిటి" అంటున్నాడు వియ్యంకుడుగారు.

"ఎంతపని చేశాడో వీడు, వచ్చీ వచ్చీ మా అరుగుమీదే చావాలా. వూరినిండా కలరాలు. ఎలావచ్చినా—కలరాతో వచ్చాకనే వాడుతప్పదు. భళ్లున తెల్లారింది. రాత్రిలా పగలు మాయచేయలేం. ఏంచేసేదిరా" అంటూ పార్వతీశం ఆ శవానికి లక్షకాపాలు పెట్టాడు. శవం చొక్కా జేబుల్లో ఏమైనా పైకం తగులడిందేమో—అని— తడిమిచూసే—ఎర్రని ఏగానీలేదు.

ఇంక రోజాలెలా వున్నాయో! శవాన్ని —దహనం చేయించాలంటే వందరూపాయలు మామూలయింది. వియ్యంకుడిదగ్గర ఏవో ఆత్మగౌరవం మాటలు వూ పేసినా— వీజానికి పార్వతీశానికి అంత ప్రాక్టీసు లేదు.

ఏంచేసేది నారాయణా అని శైవ్యంలో పడ్డయోగిలా గిజగిజ లాడుతున్నాడు పార్వతీశం.

గౌతమీ జీవకారుణ్య సంఘంలాంటిది ఆవూళ్ళో లేదు. అదివున్నా సహం తెంగతీరేది. ఈ కలరా రోజుల్లో రోజుకి ఎంతో మంది చస్తున్నారు. ఈ శవ వాహకులు సంఘంగా ఏర్పడ్డారు. వందరూపాయలు రేటు ఒక శవానికి. గవ్వ తక్కువైనా లాభంలేదు. ఎంతపరీక్ష పెట్టావు నారాయణమూర్తీ అనుకుంటూండగా వియ్యంకుడుఆరంభించాడు.

"ఏవిటి బావగారూ అలా ఆలోచిస్తున్నారు. ఈ పార్టీ ఎవరో అజతెలలేదా" అన్నాడు. "అదే ఆలోచిస్తున్నాను బావగారూ. మాపార్టీగా కనిపించటంలేదు. పోనీ —జేబుల్లో—ఏ డియడ్రస్సూ లేదు, పాదూ లేదు. మనీపర్సు లేదండి. నాకోసం వనిగట్టుకు వచ్చాడల్లే వుంది వీడూ" అన్నాడు పార్వతీశం.

"అలాగైతే కర్తవ్యం ఏవిటి" అని వియ్యంకుడు అడుగుతూండగానే—ఇంటిల్లిపాదీ వచ్చి—ఆ శవాన్ని చూశారు." ఇదేం ఖర్మం—ఈడ్చి అవతల పారేయించండి" అంది పార్వతీశం భార్య.

"అంత తేలిక కాదమ్మా—వందరూపాయలుండాలిట శవసంస్కారానికి" అన్నాడు వియ్యంకుడు.

ఇంతలో యిరుగువారూ—పొరుగువారూ రావడం ఆరంభించారు. దగ్గర వాడా? అనికొందరు. రోజులు బాగాలేవని మరికొందరు. ఈ కలరా ఎందరి జీవాలు తీస్తోందో? అని ఇంకొకొందరు. ఈ కలరా యింకా వృద్ధికావాలని శవవాహకులు కోరుకొంటున్నారటగా అని కొందరు ప్లీడరుగారి యింటివద్ద యిప్పుడొచ్చినట్లు విమర్శన చేసుకుంటూ పోతూ వున్నారు ప్రజలు. ఎవరికీ ప్లీడరు వచ్చినఆసామీ ఫలానా అనిమాత్రం చెప్పటం లేదు—

పార్వతీశం ధైర్యం తెచ్చుకున్నాడు. వందరూపాయలు చేతులారా యీ అనాథప్రేత సంస్కారానికి ఇచ్చించడం అతనికిష్టంలేదు. ఈ పాయంతో అపాయం నుంచి తప్పించుకోవాలనుకున్నాడు. వియ్యంకుణ్ణి రహస్యంగాపిలిచాడు. "అడుగో ఒక పెద్దమనిషి మనవైపే వస్తున్నాడు. నేను వాడితో చెప్పేమాటలకి తందానతానఅనాలి బావగారూ" అన్నాడు పార్వతీశం. తప్పనిసరిగా సరేనన్నాడు వియ్యంకుడు.

అవస్తాడన్న ఆసామీ వచ్చాడు. "ఏవిటి ప్లీడరుగారూ—ఇంతమందిజనం వున్నారేవిటి" అన్నాడు.

"అయితే మీకు కబురందిరావటం లేదన్నమాట" అన్నాడు పార్వతీశం. "నాకు కబురందలేదే" అని నిర్ఘాంతపడ్డాడు అవచ్చిన ఆసామీ-శ్రీరామం. "అయితే శ్రీరామం గారూ-మీ రొట్టె నేతిలో పడిందండీ" అన్నాడు పార్వతీశం. కొంచెం తెప్పరిల్లి -

(48- వ పేజీ చూడండి)

[illegible] విజయమీద వాలిపోయింది ఏడుస్తూ.

"కళ్యాణీ! ఏమిటీ పిచ్చితనము? ధైర్యంలో నీకంటే ఎక్కువ ఎవరూ లేరని అన్నమాటా శంకరం అంటూవుండేవాడు. నువ్వు యిలా ఏడుస్తే..."

"ఇప్పుడు శంకరానికి ఎలావుంది" అంటూ లోపలికి వచ్చింది విజయ.

ప్రక్కగదిలో మంచంమీదవున్న శంకరం దగ్గరకు వెళ్ళింది విజయ. కళ్ళుమూసుకొని మూలుగుతూ బాధపడుతున్నాడు. అతని ముఖం చూస్తే ఎంతో ఆవేదనతో బాధపడుతున్నాడని తేలికగా గ్రహించవచ్చు. అకస్మాత్తుగా కళ్ళుతెరిచాడు శంకరం. 'వదినా!' అంటూ లేవబోయాడు కాని నీరసంవల్ల లేవలేకపోయాడు. పరిస్థితిని స్పష్టంగా చూసి విజయ శంకరంవిషయంలో చాలా ఆందోళన పడింది.

"వదినా! అన్నయ్య......అన్నయ్య ఎప్పుడు...వస్తాడు? ఇక్కడికి వస్తాడా వదినా?" అతని కళ్ళు అశ్రుపూరితాలయాయి.

"నేను ఒంట్లో బాగుండలేదని రఘు మాటలు ఆమెను చాలా బాధపెట్టాయి. నిజం చెబితే శంకరం చాలా బాధపడతాడని, అతని స్థితిలో యింకా ఎక్కువవుతుందని, అబద్ధమాడక తప్పలేదు విజయకు.

కళ్యాణి, మందుకోసము ప్రక్కగది చెప్పటానికి వచ్చినప్పుడు ఆయన యింట్లో లేరు. బహుశా యిప్పుడే వస్తారు...ఏదో ఆఫీసుపనిమీద కొంపుకు వెళ్ళారు..." అని అతి మెల్లిగా విజయ చెప్పింది కాని అలోకి వెళ్ళింది. విజయకూడ వెనకాలే వెళ్ళింది.

"కళ్యాణీ! డాక్టరు ఎవరు?"

"డాక్టరు రామారావుగారే వచ్చి చూస్తున్నారు. ఇంతవరకు 100 రూపాయలు ఖర్చు అయాయి. రేపు ఏదో యింజక్షనులు, మాత్రలు కొనాలిట. కనీసము యాభయి రూపాయలైనా కావాలన్నారు. నా తమ్ముడు ఇక్కడే వుంటున్నాడుగా. వాడు పనిచేసే కంపెనీలో యాభయి రూపాయలు అడ్వాన్సు తెచ్చాడు. అది కూడ ఖర్చయిపోయింది. పూర్తిగా జ్వరము తగ్గటానికి యింకో కనీసం రెండువందలు ఖర్చు అవుతాయన్నారు డాక్టరుగారు. ఎక్కడికి వెళ్ళి తేవాలో ఏమీ అర్థముకావటములేదు. ఆయన చెప్పిన మందులు కొనకపోతే చాలా ప్రమాదమని......" ఇంక మాట్లాడలేకపోయింది కళ్యాణి. ఆమె కళ్ళమ్మట ధారలు ధారలుగా నీళ్ళు కారాయి. ఆ దుఃఖాన్ని విజయ కూడా భరించలేకపోయింది.

అప్పటికి టైము 12-30 అయింది. విజయ తన యింటికి బయలుదేరింది. తనమెళ్ళో వున్న చంద్రహారాన్ని తీసి కళ్యాణికిచ్చి 'కళ్యాణీ దీన్ని నీతమ్ముడిద్వారా ఎక్కడైనా తాకట్టుపెట్టించి శంకరానికి తగినవైద్యం చేయించు. ఆశ్చర్యపడకు. స్త్రీలకు నగలనేవి ఆపదల నుండి కాపాడుటానికే కాని అలంకరణానికి కాదు. తర్వాత మళ్ళీవస్తాను," అంటూ అడుగు ముందుకు వేసింది విజయ.

"అక్కయ్యా! ఆయనకు యిది తెలిస్తే!"

"భయంలేదు. నాతోకూడ ఆయనవచ్చివున్నట్లయితే ఆయన యిలా పనిచేసివుండేవారు. నువ్వు ధైర్యంగా వుండు. నేను వెళ్ళొస్తానులే"

అంటూ, విజయ తన యింటికి తిరిగివచ్చింది.

## 2

కాలము గడచిన కొద్దీ విజయకు భయంగా ఎక్కువౌతోంది. భయంతో వణికిపోతోంది తను చేసిన పనికి.

ఆ రోజు శనివారము. మధ్యాహ్నము రెండుగంటలకే తన భర్త యింటికి వస్తుంటాడు. మెడలో చంద్రహారం లేకపోవటము చూచి "అది ఏది" అని అడిగితే ఏం జవాబు చెప్పాలో అర్థం కాలేదు విజయకు. దానికితోడు పొద్దున్న జరిగిన సంఘటన తనను మరింత కలవరపెడుతోంది.

పొద్దున్న సుమారు తొమ్మిది గంటలయి వుంటుంది. మోహనరావు ఆఫీసుకు వెళ్ళే ముందు భోజనానికి కూర్చున్నాడు. అప్పుడే వచ్చాడు రఘు. "మామా! శంకరానికి వారం రోజులనుంచి టైఫాయిడ్ జ్వరంట. నిన్నటినుంచి ఒళ్ళెరగకుండా పడివున్నాడు. ఈ సమయంలోనైనా నువ్వు ఒకసారి వెళ్ళి



# ★ చంద్రహారం ★

చూసివస్తే చాలా బాగుంటుంది. పాపము! అతని భార్య చాలా ఆదుర్దాపడుతూంది. తప్పకుండా వెళ్లుమోహన్!" అని మరీ మరీ చెప్పి వెళ్లాడు రఘు.

ఆమాటలువిజయనుచాలాకలవరపరిచాయి. కాని మోహనరావు ఏ మాత్రము పశ్చాత్తాప పడలేదు. మోహనరావు ఆఫీసుకు వెళ్ళే ముందు "ఇవాళ కొంచెము తొందరగా ఆఫీసునుంచి వస్తే, యిద్దరము వెళ్ళి ఒకసారి శంకరాన్ని చూసివస్తే బాగుంటుందేమో" అని బెదురుతూ, బెదురుతూ మోహన రావుతో చెప్పింది విజయ. ఈ మాటలు అత నికి అగ్గిమీద గుగ్గిలము వేసినంత పని చేసింది.

"ఏమన్నావు? నేను వెళ్ళి వాణ్ణి చూడాలా? ఈ జన్మలో వాడి ముఖం చూడనని ఎన్నిసార్లు చెప్పాను? వాడు నాకు తమ్ముడూ కాదు. నేను వాడికి అన్నను కాదు. వాడితో సంబంధము ఆనాడే వదులుకొన్నాను. ఎల్లా ఛస్తే నాకేం!" అంటూ విసురుగా వెళ్ళి పోయాడు మోహనరావు.

భర్తను శాంతపరచి మాట్లాడాలను కొంది విజయ. కాని అందుకు సమయ సందర్భాలు కలసి రాలేదు.

"శంకరం ఒళ్లెరగకుండా పడివున్నా డుట" అని రఘు చెప్పినమాటలు విజయను దహించివేశాయి. ఏ పని మీద కూడా ధ్యాసలేదు. తనని తానే మర్చిపోయింది. తనభర్త వచ్చేలోపుగా శంకరాన్ని చూసి రావాలని నిశ్చయించుకొని, అక్కడికి వెళ్లి, అక్కడి పరిస్థితిని చూసి భరించలేక తన మెళ్ళోవున్న చంద్రహారాన్ని యిచ్చి వచ్చింది.

మోహన్‌రావు, శంకరం ఏకోదరులు. వారి తల్లిదండ్రులు, వారి చిన్నతనంలో నే స్వర్గస్థులయ్యారు. మోహన్‌రావు పెద్దవాడు. రెండవవాడు శంకరం. ఇద్దరికి వయస్సులో పన్నెండుఏళ్లు తేడావుంది. ఒకే గర్భాన్ని జనించిన యీ అన్నదమ్ములిద్దరి గుణ గణాల్లోను చాలా వ్యత్యాసముంది. మోహన్‌రావు బి. య్యే. దాకా చదివాడు. ఆతర్వాత చదువు చాలించి ఉద్యోగంలో చేరాడు. తను సంపాదించిన దానితోనే ఎట్లాగో కష్టపడి తమ్ముడికి చదువు చెప్పించాడు.

మోహనరావు ఉద్యోగంలో చేరిన కొద్ది రోజులకే వారి కుటుంబ భారము వహించిన వారి పెత్తల్లి పోయింది. కుటుంబాన్ని నడిపే "ఆడ" తోడు లేకపోయింది వారిద్ద రికి. అప్పట్లోనే విజయతో వివాహము జరి గింది మోహనరావుకు.

విజయ ఒక సామాన్య కుటుంబంలోనిది. గుణవంతురాలు, మంచి వివేకవంతురాలు కూడ. శంకరాన్ని తన సొంత తమ్ముడులాగ చూచుకొని పెంచి పెద్దచేసింది.

శంకరం బి. య్యే. ప్యాసు కాగానే, తలవని తలంపుగా ఒక పెద్దకంపెనీలో మంచి ఉద్యోగము దొరికింది. ఆదే సమ యంలో ఒక లక్షాధికారి తన ఏకైక పుత్రిక అయిన కమలను పదిహేనువేల రూపాయలు కట్నముతో శంకరానికి యిచ్చి పెళ్ళి చెయ టానికి యిష్టపడ్డాడు. మోహనరావు సంతో షానికి పట్టపగ్గాలు లేవు. ఆ సంబంధాన్ని ఖాయపరచితే, ఆవచ్చే వరకట్నంతో తనూ తన తమ్ముడూ కలిసి, ఏదైనా మంచి వ్యాపారం చేసి, బాగా డబ్బుగడించి, భాగ్యవంతులయి, స్వతంత్ర జీవనము చేయ వచ్చని, గాలిమేడలు కట్టాడు. కాని శంక రం, వారి వీధిలోనె వున్న ఒక సామాన్య గృహస్థుని పిల్లను చేసుకోనేందుకు నిశ్చ యించుకొన్నాడు.




NAS-56

మోహనరావు ఆ లక్షాధికారి కూతురు సంగతి అడిగినపుడు శంకరం ఎదురు సమా ధానమే చెప్పాడు.

"ఇంకొకరిసొత్తు మనము తీసుకొంటే మనయింట్లో ఉంటుందా అన్నయ్యా! ఆమాత్రం మనము సంపాదించుకోలేమా! మన అదృష్టమే బాగున్నట్లయితే అంతకు వేయిరెట్లు సంపాదించవచ్చు. భాగ్య వంతుల సంబంధమే మనకు వద్దు అన్నయ్యా! మనలాంటి వాళ్ళంతా భాగ్యవంతుల సంబం ధాలకోసము ఎగబ్రాకితే,మనలాటి సామాన్య కుటుంబీకులు కన్న ఆడపిల్లలగతిఏమిటి? మనకు ఒక చెల్లెలువుండి, దానిని పెళ్ళిచేసు కొనేటందుకు ఎదటివాళ్ళు వేలకొలది వర కట్నాలడిగితే నువ్వు ఏం చెప్పగలుగుతావు? అదృష్టవశాత్తు మనకు చెల్లెలు లేకపోవటము వల్ల మనము యీ విపరీతగండాన్నించి తప్పాము," అన్నాడు శంకరం.

"చాలించు నీ మెట్ట వేదాంతం. బ్రతుకు తెరువు తెలియని మూర్ఖుడా! ఏళ్ళంటే వచ్చాయేగాని లోకజ్ఞానమనేది కొంచెము కూడా నీకు లేదు" అన్నాడు కోపంగా మోహనరావు.

"నువ్వు ఏమన్నాసరే అన్నయ్యా! ఈ ఒక్కవిషయంలో మాత్రము నన్ను క్షమించు.

ఇంతవరకు నన్ను పెంచి పెద్దచేసి చదువు చెప్పించావు. ఇందుకు నీకు నేను ఎల్లప్పుడూ కృతజ్ఞుడనే. కాని, నా వివాహము మాత్రము ఒక సామాన్య కుటుంబీకుల పిల్లతోనే చేయమని నిన్ను కోరుతున్నాను. నాయందు దయయుంచి యింతకన్న ఎక్కువగా యీ విషయంలో బాధపెటవద్దు" అని ఖచ్చితంగా చెప్పేశాడు శంకరం.

విజయకూడా శంకరంతో, శతవిధాల చెప్పి చూసింది భర్త సంతోషము కోసము. ఆ విషయంలో ఎవరూ జోక్యం కలగ చేసుకోవద్దన్నాడు శంకరం. శంకరానికి యిష్టమైన సంబంధమే చేయమని భర్తను కూడా బ్రతిమాలింది విజయ. తత్ఫలితం రెండు రోజులు యింటిముఖము చూడలేదు. అప్పటి నుంచి మోహనరావుకు శంకరానికి మధ్య మనస్పర్థలు ఏర్పడ్డాయి.

చివరకు శంకరం నిశ్చయించుకొన్న ప్రకారము ఒక శుభముహూర్తాన కల్యాణితో కల్యాణము జరిగింది శంకరానికి. శంకరం వివాహానికి మోహనరావు వెళ్ళలేదు. విజయను వెళ్ళనివ్వలేదు. ఎంతో అన్యోన్యంగావున్న ఆ అన్నదమ్ములకు మన స్పర్థలు ఏర్పడ్డాయే యని కుమిలి కుమిలి ఏడ్చింది విజయ. అప్పట్లోనే వేరు వేరు కాపరాలుకూడా ఏర్పడ్డాయి.

శంకరం వివాహమయి, వేరుపడ్డాక అప్పుడప్పుడు తనే అన్నగారింటికి వచ్చేవాడు. తను రావటానికి అర్హతలేదని, యిక్కడికి వచ్చినట్లయితే తన మర్యాద దక్కదని ఒకనాడు ఖచ్చితంగా మోహనరావు శంకరంతో చెప్పేశాడు. శంకరానికి వివాహమయి మూడుసంవత్సరా లయింది. ఈ లోపుగా ఒక్కసారి కూడా తమ్ముడిని చూడలేదు మోహనరావు.

వ్యాపారంచేసి లక్షలకొలది లాభం గడించి స్వతంత్రజీవనము చేయాలని 'గాలి మేడలు' కట్టిన మోహనరావు, తన తమ్ముని పట్టుదలవల్ల తను ఆశించిన ఆశలు ఫలితాలు లేకుండానే నేల కూలిపోయాయనే ఉక్రోషంతో ఏవిధంగానైనా పెద్దవ్యాపారము ప్రారంభించి, బాగా లాభంగడించి తన తమ్ముడి ముఖాన పేడనీళ్ళు చల్లాలని తీర్మానించుకొన్నాడు.

అందుకని విజయ నగలు ఒక్కొక్కటే అమ్మి గుఱ్ఱపుపందెములు ప్రారంభించాడు. జరిగినదల్లా విజయ నగలు పోవటమే తను అదృష్టదేవతను వెతుక్కుంటూ వెళ్తే, దురదృష్టదేవత తనను వెతుక్కుంటూ వచ్చి తిష్ఠవహించింది. నగలన్నీ పోగా మిగిలినదే 'ఆ' చంద్రహారం. శంకరం వల్లెరగకుండా పడివున్నాడని రఘు చెప్పిన మాటలు విన్నతరువాతనైనా తనభర్త మనసు మారుతుందని ఆశించింది విజయ. కాని ఆమె ఆశ నిరాశే అయింది.

# 3

రైము రెండుగంట లయింది. వీధిలో మాటలు వినిపించాయి విజయకు.

"ఇవాళే ఆఖరు రేస్. ఆతర్వాత యిక్కడ రేసేలేవు. ఒక్కఛాన్సుకూడా చూడు..." మూర్తి గొంతుక. తన సంసారాన్ని సర్వనాశనం చేసిన మూర్తిగొంతుక.

"లేదు. మిస్టర్ మూర్తి. ఇంకనాకా ఆశలేదు. చేతిలో దమ్మిడీ కూడ లేదు. ఈవారం రేషను కొనటానికి కూడా డబ్బులేదు;" మోహన్‌రావు గొంతుక.

"ఇన్నాళ్ళు చూశావు...ఈ ఒక్కసారికి ఏదైనా తాకట్టుపెడితే సరిపోతుంది. రేపు మనగుఱ్ఱము తప్పకుండా గెలుసుంది. నామాటవిను. ఎల్లుండి యీపాటికి నువ్వు లక్షాధికారి వన్నమాట...అన్నట్లు... మర్చిపోయాను...సమయానికి జ్ఞాపకం వచ్చింది. చంద్రహారం వుందికదూ... ఆలోచించి చూడు. వచ్చే అదృష్టాన్ని కాలదన్నకు."

"క్షమించు మూర్తీ! నాబాధ నీకు అర్థముకాదు. అన్నీపోగా మిగిలినదే ఆ చంద్రహారము. దానిని నా చేతులతో తీయలేను"

"సరే నీయిష్టము...తర్వాత విచారిస్తావు." అని వెళ్ళిపోయాడు మూర్తి.

భర్త తలుపు తటాడు.

మెల జాగ్రత్తగా చిరకొంగులో కప్పుకొని తలుపుతీసింది విజయ. దీర్ఘాలోచనతో తనగదిలోకి వెళ్ళాడు మోహనరావు. అతి మెల్లిగా అడుగులో అడుగు వేసుకొంటూ, వెదురుతూ కాఫీ తీసుకొనివెళ్ళి బల్లమీద పెట్టి, వెనక్కు తిరిగింది విజయ.

'విజయా!' అని పిల్చాడు భర్త.

పై ప్రాణాలు పైనే ఎగిరిపోయాయి విజయకు. అయినా ధైర్యాన్ని వదలలేదు. "విజయా! అర్జంటుగా నాకు కొంచెము డబ్బు కావల్సి వచ్చింది. నిన్ను బాధపెటకూడదనే నా ఉద్దేశము. 'ఈ' ఒక్కటీ కూడా నీ వంటి మీదనుంచి తీయటము నాకు ఏ మాత్రము యిష్టము లేదు. కాని యివాళ తప్పలేదు. నాకు తెలుసున్న వాళ్ళనందరిని అడిగి చూశాను. ఎక్కడా కూడా అప్పు పుటలేదు. నువ్వు కోపగించుకోకుండా నిండు హృదయంతో నీ చంద్రహారాన్ని యిచ్చినట్లయితే, తాకట్టుపెటి కావలసిన డబ్బు తెచ్చుకొంటాను. జీతము రాగానే నీ చంద్రహారము నీకు తెచ్చి యిచ్చేస్తాను" అన్నాడు మోహనరావు.

విజయకు ఉన్న మతికాస్తా పోయింది. ఆ రోజు తన రేదో మూడిందనుకొంది. తన సామర్థ్యాన్నంతా ఉపయోగించి మాట్లాడాలనుకొని—

తన మెడలోవున్న చంద్రహారాన్ని తీసి యిచ్చే భావనలో తన చేతులను మెల్లిగా మెడవద్దకు పోనిచ్చి, అకస్మాత్తుగా గొప్ప ఆశ్చర్యాన్ని తన ముఖంలో కనబర్చింది. మెడలో చంద్రహారము లేక పోవటము చూసిన మోహనరావు "విజయాచంద్రహారం ఏది?" అన్నాడు.

"అదే నేనూ ఆలోచిస్తున్నాను. చాలా ఆశ్చర్యంగా వుందే!...ఆ!...యిందాకా స్నానం చేసే టప్పుడు నీళ్ళ గదిలో గట్టు మీద పెటాను. తీసుకోవటము మర్చిపోయాను" అంటూ నీళ్ల గదివైపు వెళ్లింది విజయ. ఆమె వెనకాలే మోహనరావుకూడా వెళ్ళాడు. అక్కడ వెతుకుతున్నట్లు నటించింది. మొత్తముమీద యిద్దరూ కలసి యిలంతా వెతికారు. చంద్రహారం కనిపించక పోయేటప్పటికి మోహనరావు కోపానికి పట్టపగ్గాలులేవు. ఆ కోపానికి ఆగలేక విజయను బాదేశాడు చెయ్యిమంటెక్కే వరకు. విసురుగా యింట్లోనుంచి వెళ్ళిపోయాడు మోహనరావు.

దెబ్బలు చాలా ఘాటుగా తగలటమువల్ల స్పృహ తప్పి పడిపోయింది విజయ. కొంతసేపటికి తేరుకొంది. చాలాసేపు ఏడుస్తూనే కూర్చుంది.

సుమారు నాలుగుగంటలకు మోహనరావు మళ్ళీ యింటికి వచ్చాడు. దీర్ఘాలోచనలో మునిగిన తను, తనకోసము తెచ్చిన కాఫీతో వచ్చిన విజయను చూడలేదు. నిస్త్రాణవల్ల విజయ చేతిలోని కాఫీగ్లాసు జారికింద పడిపోయింది. ఆ శబ్దానికి మోహనరావు ఉలిక్కి పడి విజయను చూశాడు. ఎఱ్ఱగా కందిపోయి వాచిన ఆమె ముఖాన్ని చూసి మోహనరావు కళ్ళనుంచి రెండు కన్నీటిబిందువులు రాలాయి.

'విజయా!' అంటూ దగ్గరకు వచ్చాడు.

(47-వ పేజీ చూడండి)




(గతసంచిక తరువాయి)

## 16

కొడుకు తన మెడను చేతులతో చుట్టివేయగానే, పుల్లయ్య అలా చిన్న పరుగు నడకలతో వీధిలో పడ్డాడు. కొడుకు సంతోషంతో నవ్వుతున్నాడు. మళ్ళీ మెల్లిగా నడుస్తూంటే "ఊ! ఊ! అయ్యా..." అని పరుగెత్తమనే వుబలాటాన్ని వ్యక్తం చేస్తున్నాడు. అలా ఆగుతూ, పరుగెత్తుతూ ఆదెమ్మప్ప ఇంటికి చేరుకున్నాడు.

ఆదెమ్మ కడుపునొప్పితో యేడుస్తూంది. వాము జీలకర్రలు ఇప్పుడు పని చెయ్యటం లేదు. పొరుగూర్లో వున్న నేటివ్ వైద్యుడు లవణం పొట్లాలిచ్చాడు. కొద్దిగా శాంతంగావున్నా మళ్ళీ ఒక్కొక్కసారి ఉధృతంగా నొప్పి వస్తోంది.

చుట్టూ చేరినవాళ్ళు మనిషోలా అంటున్నారు. "పట్నం తీసికెళ్తే పొటో తీస్తారు. ఏమున్నాదో తెలిసిపోతాది" అని ఓ సలహా ఇచ్చాడు. ఏ సలహాలు అల్లుడు వినలేదు. అసలే పిసినారి. అందులో పెద్దరికం వచ్చింది. "ఎందుకర్రా, ఆ వైదుగుడు, ధంకామీద దెబ్బకొట్టి నయం సేస్తానంటూంటే, తొందరపడకండి," అని తమాయించుకొస్తున్నాడు.

మందు ఒక పొట్లాం వెయ్యగానే కొంతసేపటికి నొప్పిసర్దుకుంది. ఆదెమ్మప్ప ముఖం మల్లుని చూడగానే కొంచెం తేరుకుని అలా నులకమంచం మీద దొర్లుతూనే, మల్లుని దగ్గరగా చేర్చుకుంది. కాని వాడు తండ్రి వేపు పురకలు వేసుకుంటూ వచ్చేశాడు. మళ్ళీ మెడను ఆ చిన్న చేతులతో చుట్టివేసి తండ్రితో ముద్దులాడుతున్నాడు.

అనుకోని మాటలు అల్లుడి నోటివెంబడి వచ్చాయి. పుల్లయ్య పెళ్ళికి పుచ్చుకున్న రెండువందలూ వేగంగా తీర్చమన్నాడు. 'కొంప కోదాలు' కొనే అవసరం వచ్చిందనీ, డబ్బు రొక్కటంగా వుందనీ చెప్పాడు. పుల్లయ్య బదులు చెప్పలేదు. ఆదెమ్మప్ప 'తొందరపెట్టె యిలాగరయ్యా' అంది. "వాడి అవసరానికి యిచ్చేటప్పుడు మన అవసరం చూడాలంటావా లేదా? నిన్న నూరు రూపాయలున్న కోదాలు యీవేళ నూటపాతికై పోతున్నయ్. పుల్లయ్యా! యోగం యేదో నూసి, అప్పుతీరిస్తే నా కివతల నష్టం వుండద"న్నాడు.

తల ఆడించి ఇంటికివచ్చి పెళ్ళంతో అన్నాడు. "ఆడికి యెవడో సెప్పిన మాటలు కాకపోతే, దాన్నంగరికె ఏడొందలకి అమ్మేడు – డబ్బు నేదా?"

నీలి ఓక్షణం వూరుకొని "ఇన్నాళ్లు ఊరుకొన్నారు - ఇంకొక రైతే వూరుకొంటారా?"

"మాకు వూరికినే యిచ్చారే? వడ్డీ దాన్నం యీధరల్లోనూ తగ్గించకండా యివ్వలేదా?"

"నీపో! ఈ బంగారం వుండి యేం సెయ్యాల?" అంటూ ఉన్నదంతా వూడ్చి, మొగుడిచేతిపెట్టి, బలవంతాన కంసాలి చిన్నోడి దగ్గరకి పంపించింది. తిరిగివచ్చి నాశిరకం బంగారం అని తులందగ్గర నాలుగు రూపాయలు గుంజుకోవాలని సూస్తున్నాడు. పట్నం తీసికెల్దాంలే," అన్నాడు.

నీలి, "ఊర్ని కనిపెట్టి బతుకుతునోణ్ణి మాని, పటపోడిని పోషిస్తామా? పిల్లలుగలోడు. కష్టపడుతున్నాడు. మనంకొన్న ధరకంటే యెక్కువడబ్బు వస్తోందికదా... యీడికే యిచ్చీ" అని బలవంతం చేసి మొగుడ్ని పంపించింది.

అప్పుతీర్చగా మిగిలినడబ్బుతో బట్టలు కొందామంటే, కోపరేటివ్ స్టోర్సులో బట్టలేదు. ఏదోవాదిస్తే, "ఏనాడో నీకు డబ్బు కలుగుతాదని బట్ట దాసిపెట్టామా?" అని హేళనచేశాడు స్టోర్సులో వున్న నాయుడు.

ముసలి సాలిపాపయ్య దగ్గరకెళ్తే, నూలుధరలు పెరిగాయనీ కంట్రోలు నూలన్న పేరేగాని దొరకలేదనీ, వాడి కష్టసుఖాలు చెప్తూ, చీరలు చూపించాడు. మిగిలినడబ్బుకి తనకోకచాపు, పెళ్లానికి ఓకోక, ముసలమ్మకోకతాను వచ్చింది. ఆనాడు రెండురూపాయలకోక యీనాడు పదిరూపాయలు! ఊరిని కనిపెట్టుకున్న సాలిపాపయ్యదగ్గర కొన్నందుకు నీలి సంతోషించింది.

నీలి కొత్తబట్టలు పెద్దలు పేరంటాలకు

చూపించింది. ముసలమ్మ బోసి నోటి నవ్వుతో కొత్తతాను కట్టుకుంది. మనమడ్ని ముద్దుపెట్టుకొంది. పొలంనుంచి వస్తున్న తండ్రిని చూడగానే ముసలమ్మ చేతులనుంచి జారిపోయి, గబగబా గెంతులేసుకుంటూ నవ్వుతూ ఎదురెళ్ళాడు. తండ్రి మీదికి ఎక్కగానే, పుల్లయ్య అలా అరుగు మీదకూర్చునే కొడుకుని ఆడిస్తున్నాడు. కొత్తపంచలో కొడుకుని కప్పాడుముందు. బోసినోటి నవ్వుచూసి, పైకెత్తేసెత్తగానే పెణకఅందుకున్నాడు మల్లు. ఉయ్యాల్లా ఊగిస్తూంటే యేడవలేదు. కొడుకుని గుండెకు హత్తుకుంటూ, "భళి! భళి!" అన్నాడు. రోజుకిరోజూ మల్లుకి అయ్యతోనే సంబంధం హెచ్చుగావుంది. రాత్రుళ్లు ఏడ్చేటప్పుడు అయ్యదగ్గరవుంటేచాలు ఏడుపు పోతుంది. ముసలమ్మ హాస్యానికి "అదు అయ్య కొడుకుగానీ! అమ్మకొడుకా?" అంటే పుల్లయ్య "ఎవడైనా, నీమనవడే లే!" అంటే, ముసలమ్మ ఆనందంతో, పళ్లులేని పెదాలతో నవ్వుతో మురిసిపోయింది. వంగిన ఆ నడుం యెక్కడవాల్చినా అమనమడివేపే కళ్ళు—ఎక్కడ ఆ శుష్కించిన దేహం వున్నా మనసు ఆ మనుమడివేపే—!

ఒక్కసారి గతం జ్ఞాపకం వచ్చేది. ఆదేముడు—నా అయ్యా! అనుకొని మురిసిపోయేది. దేనికీ ఆమె విసుక్కోని యెరగదు; దుఃఖంలో కుమిలిపోలేదు. సంతోషంలో వుబ్బితబ్బిబ్బవలేదు. మనుమడు పొలానికి వెళ్తున్న తండ్రి వెంటబడటానికి అడుగులు వేస్తూంటే, పట్టుకుంది. విరుచుకపడ్తూ మామ్మ జుట్టుపీకేస్తున్నాడు. అప్పటికీ వదలకపోవటంతో, గుంజాటనపడుతూ విడిపించుకొన్నాడు. ముసలమ్మ ఫకాలుమంది. "ఏ చెట్టు యిత్తనం..ఈ" తండ్రి కనపడకపోవటంతో యేడవటానికి లంఘించుకున్నాడు. ఎవరు ఎంతబోధపరిచినా లేదు. ఏడుస్తూ ఏడుస్తూ పడుకుండిపోయాడు.

పుల్లయ్య పొలంనుంచి వచ్చేసరికి, నేల మీద పడుకున్న కొడుకుని చూసి యెత్తి మంచంమీద వేస్తూంటే, తెలివివచ్చి "అయ్యా" అంటూ ఒక్కకేక వేశాడు. అయ్యనుచూడగానే ప్రాణంవచ్చింది. ఒడిలోనిల్చుని మెడను చేతులతో చుట్టివేశాడు.

గ్రామకరణం తండ్రికి, పోయిన ఆస్తులను గడించాలనే కోరిక వున్నా లేకపోయినా, కొడుకు తన కుటుంబాన్ని పోషించుకోడానికి సరిపడే భూవసతైనా ఈ కంట్రోలు రోజుల్లో గడించాలని వుబలాటపడ్డాడు. రాత్రికిరాత్రి రోడ్డువెంబడి, అడ్డుత్రోవంటి నల్లబజారులో కొన్న ధాన్యాలు నడిచిపోతూంటే, కరణం ఆపకుండా వుండటానికి కొంతడబ్బు మొదలే చేరుతోంది. కోపరేటివ్ సొసైటీవల్ల కొంతడబ్బు కూడుతోంది. ఇక వూళ్ళో ప్రొక్యూరుమెంటు లెక్కల గొడవల్లో దొరకవలిసింది బాగా దొరుకుతోంది. ఇంతవచ్చినా ముసలాడికి తృప్తి కలగలేదు. వచ్చినదని పొదుపుచెయ్యటం కోడలికి తెలియదు. పెళ్లాంకి అంతకన్నా తెలియదు. నెలకు అంతకంటే పెద్దకుటుంబాలున్న ఇంటికి రెండు అడ్డలు మంచినూనయితే, వీళ్లకి అయిదుఅడ్డలు చాలటంలేదు. కేకలువేసినా ముసలాడిని వాళ్ళు లక్ష్యం చెయ్యలేదు. ఇంతవచ్చినా ఇంట్లో సరిగా జరుగుబాటు లేనేలేదు.

పుల్లయ్యకు పంపవలిసినవేవో పంపేమని అడిగితే, నాకేం వుందన్నాడు. ఈ విషయం నీలికి తెలియదు. ప్రొక్యూరుమెంటు ఈ సంవత్సరం, యేప్రిల్, మే నెలల్లో చాలా తీవ్రంగా జరుగుతోంది. ఏజంట్లు వస్తున్నారు. ధాన్యం కంట్రోలుధరకి కొలుచుకుపోతున్నారు. కంట్రోలుధర, గరిసె మూడువందలు, ఆ ఏజంటే, రాత్రిమీద నల్లబజారులో గరిసె ఏడువందలకి కొంటున్నాడు. ఈ తతంగంలో వుద్యోగుల సహాయం బాగా దొరుకుతోంది. ఇదివరలో డబ్బు కళ్లవ

# ★ దగాపడిన తమ్ముడు ★

మొత్తుకొనేవారు. ఇప్పుడు నోట్లు కట్టలు మామూళ్లు కాగితాల కట్టలులా చూస్తూ, ధాన్యాన్నే కళ్లకు మొత్తుకుంటున్నారు. కరణం లెఖ్ఖలవల్ల పదిగరిసెలు పండే పెద్ద రైతు, ఒకగరిసె ప్రొక్యూరిమెంటుకి కొలుస్తున్నాడు. ఒకగరిసె పండే చిన్న రైతు సగం కొలవాలి. ఇది అన్యాయం అంటే, పెద్దరైతుకి, కూలికి, తిండికి. పశువుల ఆహారంకి, ధాన్యం తియ్యగా మిగిలింది ఒక్కగరిసే! ఆగరిసే ప్రొక్యూరిమెంటుకి కొలుస్తున్నాడంటున్నారు! ఈ వాదాన్ని పోలీసుల సహాయంతో, ఒక్కొక్కసారి, వస్తున్న ఆఫీసర్లవలన, పెద్ద రైతులు వుద్యోగుల పక్షాన వుండటంవలన, చిన్నరైతు లెవరూ మాటాడలేకపోతున్నారు.

పుల్లయ్యవంతు వచ్చింది. పదిహేను పుట్లు (పుట్టికి 20 కుంచాలు) కొలవాలనీ, "నా కొట్లో వున్నది పదిపుట్లైనా లేదు. ఇంకో ఏడాదంతా తినాలి—ఉడుపులకీ, దుక్కులకీ, కోతలకీ, కూలికి యిస్తాను? నాను కొలవనని" పుల్లయ్య భీష్మించాడు. కొలవక విధిలేదని నాయుడు కరణం పట్టుబట్టి ఇంటికివెళ్తే, బాణా కర్ర పట్టుకొని కొట్టుదగ్గర "ఎవడువచ్చి నాకొట్టు ముట్టాడో చూస్తానని," నిల్చున్నాడు.

అంతదూరంనుంచే అంతా వెనక్కి వెళ్ళారు. ఆ సమయానికి నీలి ఇంట్లో లేదు. ఏటికి వెళ్ళింది. రాగానే ముసలమ్మ జరిగింది చెప్పగానే, దప్పున కరణం ఇంటికి పరిగెత్తింది. కరణం వూళ్ళో పాలనాయకులతో పేకాటలో నిమగ్నుడైవున్నాడు. ప్రాధేయపడుతూ ఆపదనుంచి తప్పించమని బ్రతిమలాడింది. కరణం వినిపించుకోనట్లుగానే వుంటూ "నివ్వెంత చెప్పినా లాభంలేదు. ఆ బుద్ధి నీ మొగుడికివుంటే ఈ గొడవంతా వొచ్చేదా? ఈ రోజుల్లోనూ మంచిగా వుండి బతకగలమూ?"

నీలి ఏం చెప్పినా కరణం పేకాట గొడవలో "వెళ్ళు, వెళ్ళు" అన్నాడు తృణీకరంగా. ఇంటికి వచ్చింది. ఏమి వస్తుందో అని భయపడ్తూంటే, పుల్లయ్య వెటకారంగా, "యింక కొట్టు దగ్గరికి వస్తారే" అంటూ మీసాలు మెలివేశాడు.

కొడుకుతో అప్పుడే మస్తీలకు దిగుతున్నాడు. మీసాలు మెలివేయటం, తొడ చరవటం నేర్పిస్తూంటే, నీలి అలా చూస్తూ కూర్చుండిపోయింది. "ఈసారి కొట్టు దగ్గరికి యెవడైనావస్తే, నాదాకా యెందుకు? మల్లు సాలడా?" అంటూ బిగ్గరగా నవ్వుతూ, కొడుకుని యెత్తుకొని వీధిలోకి వెళ్ళిపోయాడు.

ఈ సంఘటన జరిగిన నాలుగోరోజునే, వూళ్ళోకి పోలీసులు, ఎఫ్.ఎస్, డి. టి.ఎస్. ఓ. లు వచ్చారు. చిన్నచిన్న రైతులు వీళ్ళని చూడగానే ధాన్యం కొలిచారు. కొలుస్తూనే కళ్ళంట నీరు కారుతోంది. ధాన్యంకు వచ్చిన కాగితాలు కర్ర పెట్టెల్లోకి విసిరేశారు కొందరు.

పుల్లయ్య మీసాలు తముడుకొని, కర్ర పట్టుకొని, కొట్టుఅరుగుమీద కూర్చున్నాడు. ముసలమ్మ పెరటి గడ్డిమేటిదగ్గర, పిడకలు చేస్తూంది. మల్లు ఉయ్యాలలో నిద్రపోతున్నాడు. నీలి ఆకులు తొక్కి కొల్లటానికి తోటకి వెళ్ళింది.

ఈ దండుకుదండు పుల్లయ్య ఇంటిమీదకు వచ్చారు. టి. ఎస్. ఒ. "నువ్వేనోయ్ పుల్లయ్య?" అన్నాడు.

"చిత్తం."

"నువ్వు కొలవవలిసిన పదిహేనుపుట్లు కొలుస్తావా? లేక జైలులో కూర్చుంటావా?"

"ఎందుకుబాబూ అలా గాకట్టిరచేస్తావ్?"

"నీ వుద్దేశం!"

"కొలవను!"

"నువ్వు కొలవకపోతే మేమే కొలుచుకుని, నీ డబ్బు నీ ముఖాన్న పారేస్తాం." అని ముందుకు వస్తూంటే, పుల్లయ్య ఒళ్ళంతా రౌద్రంతో మండుకుపోయింది. బాణాకర్ర పట్టుకొని నిల్చుంటూ "అక్కడే ఆగండి. నా కొట్టుమీద చెయ్యిపడిందీ అంటే, మీ వీపులు పచ్చడైపోతాయి. పదిగరిశెలు పండినోడూ నానూ, ఒకేలా కొలవాలా? ఈ దొంగరాతలతో మాకడుపు మాడ్చేస్తారా?"

"ఉపన్యాసం చాలించి లేస్తావా లేదా!" అంటూ టి. ఎస్. ఒ. ముందుకు చొచ్చుకపోతుంటే, పుల్లయ్య ఆటకాయించి గంభీరంగా వాడి కళ్ళలోకి చూశాడు. ఇంతలో పోలీసులవైపు అధికారి చూసి సైగచేశాడు. వారు చుట్టు ముట్టూంటే, అధికారి కొట్టు గడప యెక్కబోతూంటే, పుల్లయ్యకు ఒళ్ళంతా పౌరుషంతో మండుకపోయి, "కొట్టు ముట్టక!" అని గట్టిగా గద్దించాడు. ఆ అరుపుకు దద్దరిల్లినా, అధికారి సగర్వంగా కొట్టును ముట్టుకోగానే, పుల్లయ్య ఒక్క వురుకు వురికి, ఆ యెత్తునుంచి, అధికారిని త్రోసి

(48- వ పేజీ చూడండి)

### నేటి పరీక్షలపద్ధతిలో రావలసిన మార్పులు:

# క్లాసు రికార్డుకు, ముఖాముఖి పరీక్షలకు ప్రాధాన్యం

డా॥ టి. కె. ఎన్. మీనన్

నేటి పరీక్షల పద్ధతిలోని లోపాలను పేర్కొనేటప్పుడు ముఖాముఖి పరీక్షలు బొత్తిగా లేకపోవటాన్ని విమర్శించకుండా ఉండటానికి వీలులేదు.

ముఖాముఖి పరీక్షకు గల ప్రాధాన్యము, ప్రయోజనముగురించి చాలమందికి స్పష్టముగా తెలియదు. తెలిసినా తప్పుగా తెలిసి ఉంటుంది. పరీక్షాధికారికి తెలిసిన విషయాలు, కనీసం అతగాడు తనకు తెలుసననుకుంటున్న విషయాలు అభ్యర్థికి తెలుసునో లేదో కనిపెట్టటానికి కాదు ముఖాముఖి పరీక్ష చేసేది. న్యాయస్థానంలో మాదిరిగా నుంచోపెట్టి క్రాసుపరీక్ష చేయటానికి అంతకన్నా కాదు. అభ్యర్థి చదవవలసినదాన్ని చదివి, జీర్ణంచేసుకున్నాడో లేదో కనిపెట్టటానికే ముఖాముఖి పరీక్ష. చదవవలసిన పాఠాలు చదివాడో లేదో, వ్రాయవలసిన వ్యాసాలు వ్రాశాడో లేదో, టరమ్‌పరీక్షలు వ్రాశాడో లేదో, మేష్టరు చదవమని చెప్పిన పుస్తకాలు చదివాడో లేదో ఒకసారి అడిగి తెల్సుకోటానికి ముఖాముఖి పరీక్ష పనికివస్తుంది.

అలాగ ముఖాముఖి విద్యార్థిని పెట్టుకుని పరీక్ష చేసేటప్పుడు అతనికి పాఠాలు చెప్పిన ఉపాధ్యాయుడో, ఉపాధ్యాయులో అక్కడ హాజరుగా ఉండక తప్పదు. ఆ సబ్జక్టును ఆ విద్యార్థికి బోధించే ఉపాధ్యాయుడు, ఆ సబ్జక్టుకి సంబంధించిన వేరొక ఉపాధ్యాయుడు, హెడ్ మేష్టరు గాని, ఆ శాఖ ముఖ్యోపాధ్యాయుడుగాని హాజరైవుంటే పరీక్షాధికారుల మండలి సమగ్రంగా ఉంటుంది.

విద్యార్థికి వచ్చిన మార్కులు, నోట్సు, వ్యాసాలు, టరమ్ పేపర్లు, అతడు చదివిన పుస్తకాల జాబితా ఇవన్నీ పరీక్షాధికారులు తమముందు పెట్టుకుని మరీ పరీక్ష మొదలెట్టాలి. రికార్డులన్నీ పరిశీలించిన తర్వాత విద్యార్థిని లోపలికి పిలవాలి. విద్యార్థి చేసిన పనిని దృష్టిలో పెట్టుకుని దానికి సంబంధించిన ప్రశ్నలే వెయ్యాలి. క్లాసురికార్డులను ధ్రువపరచటానికి గనక ఈమాదిరిగా ముఖాముఖి పరీక్షలు జరిపితే వీటివల్ల లాభం ఉంటుందా లేదా అని పబ్లిక్ పరీక్షాధికార్లు ఆందోళన పడవలసిన పని వుండదు.

## సోవియెట్ పద్ధతి

జర్మన్ విద్యావిధానంలో కనిపించే సమగ్రతకు ముఖాముఖి పరీక్షలే కారణం. సోవియెట్ యూనియన్‌లో ప్రాథమిక దశనుంచి విశ్వవిద్యాలయాల దశ దాకా, యీ పద్ధతే అమల్లో వుంది. విద్యార్థి తాలూకు రికార్డులన్నీ తమముందు పెట్టుకుని అర్హులైన పరీక్షాధికారులు ముఖాముఖి పరీక్షలు జరుపుతారు. విద్యార్థుల్లో ఎవరెవరు పైచదువుకుపోవటానికి అర్హులో కరక్టుగా నిర్ణయించటంలో సోవియెట్ పరీక్షా పద్ధతి చాలా జయప్రదమైన పద్ధతి అని అంతా ప్రశంసిస్తూ ఉన్నారంటే, దానికి కారణం ముఖాముఖి పరీక్షలు మంచి ఫలితాల నివ్వటమే గాని మరేమీ కాదు.

ప్రస్తుత పరీక్షా పద్ధతిలోని ముఖ్య లోపాలను ఎత్తి చూపించటానికి నేను ప్రయత్నించాను. ఈ లోపాలుగల ఈ పరీక్షలు సరియైనవి కానూకావు; వాటిపై ఆధారపడి ఊరుకోటానికి వీల్లేనూలేదు. ఈ లోపాలను గుర్తించటంవల్లనే పరీక్షలమీద అందరికి ఏవగింపు కలిగింది. వీటిని తొలగించటానికికూడా చాలా ప్రయత్నాలు జరిగాయి. పాఠశాలాధికారులు, విద్యాశాఖాధికారులు చేస్తున్న ఈ ప్రయత్నాలు ఏవో కొన్ని రాష్ట్రాల్లోను, కొన్ని విద్యాలయాల్లోనూ మాత్రమే జరగటంలేదు. దేశమంతటా, మొత్తం పాఠశాలన్నిటికీ వర్తించేటట్లుగా జరుగుతున్నాయి.

భారతీయ సెకండరీ విద్యాసంఘం చేసిన ముఖ్యమైన సిఫార్సుల నాధారం చేసుకుని పరీక్షా సంస్కరణ ప్రయత్నాలు ప్రస్తుతం జరుగుతున్నాయి. ఆ సిఫార్సులు ఈ క్రింది రీతిగా ఉన్నాయి:

1. బయటివారు ప్రశ్నాపత్రాలిచ్చే పరీక్షల సంఖ్య తగ్గించాలి. వ్యాసరచనను కోరే పరీక్షలలో వ్యక్తిగత మానసిక పరిస్థితుల ప్రసక్తిలేకుండా, ఎవరైనా ఒకేరకంగా విలువకట్టేందుకు వీలిచ్చే పద్ధతిని ప్రవేశపెట్టాలి. ప్రశ్నల ధోరణినికూడా మార్చాలి.

2. విద్యార్థి వివిధ విషయాలలో ఏవిధంగా అభివృద్ధి కనబరుస్తున్నాడో, అతడు ముందుముందు ఎలా తయారవుతాడో కనుక్కోటానికిగాను, ఎప్పటికప్పుడు అతడు చేసిన పనిని, వివిధ విషయాలలో అతని అభివృద్ధిని, కనబరిచే రికార్డులు ప్రతి విద్యార్థికీ ఒక్కొక్కటి ఉండేలాగున పాఠశాలలలో సక్రమంగా ఏర్పాటు చెయ్యాలి.

3. విద్యార్థి విద్యార్జనను ఆఖరు సారిగా విలువకట్టేటప్పుడు, అతని క్లాసుపరీక్షా ఫలితాలు ఎలావుందీ, లేనిదీ చూసి, అతని రికార్డుల్లో అభివృద్ధి ఎలా ఉందీ, పరిశీలించాలి.

4. పబ్లిక్ పరీక్షల్లోగాని, స్కూలుపరీక్షల్లోగాని, లేక క్లాసురికార్డుల్లో గాని, విద్యార్థుల పనిని విలువకట్టేటప్పుడు 'ఇన్ని మార్కులు' అని వేయకుండా, తర తమ భేదాలను అనుసరించి ఎ,బి,సి,డి, ఇ అని విలువకట్టే పద్ధతిని ప్రవేశపెట్టాలి.

## సంస్కరణ ప్రయత్నాలు

ఈ సంస్కరణలను అమలుచేయటానికి కేంద్ర, రాష్ట్రప్రభుత్వాలు, సెకండరీ స్కూల్ పరీక్షా సంఘాలు, పాఠశాలలు, ఇతర సంస్థలు అనేక విధాలుగా ప్రయత్నిస్తున్నాయి. ఆ 'ఇతర సంస్థల్లో' ముఖ్యమైనది అఖిలభారత సెకండరీ విద్యామండలి. ఈ మండలి స్థాపితమైనప్పటినుంచీ, దేశంలో పరీక్షా సంస్కరణోద్యమానికి సహాయంచేస్తూ

(33- వ పేజీ చూడండి)

## ...ర నిర్మాణం:

# ...త్రాలతో ...క శిక్షణ

...రియన్

నుంచి 880 అడుగులఎత్తు ఉంటుంది. నదికి అడ్డంగా దీనినిడివి 3900 అడుగులుఉంటుంది. దీని నిర్మాణానికి 122 కోట్ల రూపాయలు ఖర్చు కాగలదని అంచనా. దేశంలో అతిపెద్ద నీటివనరులలో ఒకటిగా ఉంటుంది. ఆంధ్రప్రదేశంలో ఈ సాగర నిర్మాణంవల్ల 21 లక్షల మెట్టపొలం సుక్షేత్రమైన మాగాణి అవుతుంది.



ఇది మోటారు యంత్రసహాయముతో పనిచేసే పెద్ద పారలాంటిది. త్రవ్వకంపని జరగవలసినచోట వుంటే రాళ్లను, రప్పలను పగలకొట్టి అక్కడినుంచి సులభంగా తొలగించి వేస్తుంది.

ఈ సాగరనిర్మాణం చాల భారీ ఎత్తున సాగుతున్నది. తదనుగుణంగా ఈ నిర్మాణప్రాంతాన ఒక బస్తీ ఏర్పడింది. ఇక్కడ పనులుచేసే 15,000 మందికి ఈ పట్టణంలో నివాసవసతి ఉన్నది.

ఇక్కడ నిత్యం ధ్వని పెడుతూ పనిచేస్తుంటే షావెల్ (మట్టి రాయి ఎత్తిపోసే) యంత్రాలు రాళ్లు బ్రద్దలుకొట్టే యంత్రాలు, డోజర్ (మట్టి త్రవ్వే) యంత్రాలు చూస్తుంటే నేటి ఆనకటల నిర్మాణప్రతీయ ఇదికదా అనిపిస్తుంది. ఈ దేశానికి ఇవన్నీ క్రొత్తవనే అనవచ్చు. ఈ యంత్రాలు నడపటానికి, వీటిచేత పని చేయించడానికి సాంకేతిక శిక్షణపొందినవారెందరో మంది కావలసివుంటుంది.

ఇటువంటి భారీనిర్మాణాలు ఈ దేశంలో ఇదొక్కటేగాదు; ఇంకా చాలా జరుగుతున్నవి. వీటి అన్నిటికీ కావలసిన సాంకేతికుల కొరత చాలా హెచ్చుగా ఉన్నది.

ఈ కొరత తీర్చటానికై భారతప్రభుత్వం ఇటువంటి సాంకేతికులకు శిక్షణ ఇప్పించటంలో తోడ్పడేటందుకు ఈ దేశంలో గల అమెరికా సాంకేతిక సహకార సంస్థతో ఒక ఒప్పందం చేసుకొన్నది.

ఈ ఒప్పందం ప్రకారంగా భారతదేశంలో ఏర్పాటైన రెండు సాంకేతిక శిక్షణ కేంద్రాలలో ఒకటి నాగార్జున సాగరం వద్ద ఏర్పాటు చేశారు. ఈ కేంద్రానికి 4,60,000 డాలర్లు కిమ్మతుగల భూమి త్రవ్వకం సర్వీసింగు వగైరా యంత్రాలు చేకూర్చడం జరిగింది. ఇటువంటి రెండవ కేంద్రం రాజస్థాన్‌లో కోట అనే చోట చాంబల్ లోయ ప్రాజెక్టుకు అనుబంధంగా ఏర్పాటు చేశారు.

నాగార్జున సాగరంవద్దగల సాంకేతిక శిక్షణ కేంద్రంలో భూమి త్రవ్వకంవంటి బరువు పనులుచేసే యంత్రాలను నడిపించటం వాటిచేత పనిచేయించటం, వాటిని మరమ్మతులు చేయటంవంటి పనులలో ఒక సంవత్సరకాలం శిక్షణ గరపుతారు. ఇక్కడ 1956 జూన్ నెలలో ప్రారంభించి, అప్పుడే



...కూజా సాంకేతిక సహకారసంస్థ బహూకరించిందే



నాగార్జున సాగరంవద్ద సాంకేతిక శిక్షణాలయంలో ఉద్యోగులకు యంత్రపరికరాల ఉపయోగంపై శిక్షణ ఇస్తున్న డిప్యూటీ డైరెక్టర్ శ్రీ ఎస్. జి. యుకీ.

# భారీయంత్రాలతో సాంకేతిక శిక్షణ

తొలి జట్టులో 40 మంది శిక్షణ పొందటం పూర్తి చేశారు.

సాధారణ సాంకేతిక పరిజ్ఞానం సంపాదించిన ఈ శిక్షితులు అప్పుడే యంత్రాలతో పనిచేయించటం, వాటి కిటుకులు తెలుసుకోవటం మొదలుపెట్టారు. షోవెల్ యంత్రాలు ట్రాక్టర్లు, డోజర్లు, స్క్రాపర్లు గ్రేడర్లు, డంపర్లు—ఇట్లా అనేక యంత్రాలను పని చేయించడమే గాక వాటిని శుభ్రం చేసుకోవటం, మరమ్మతులు చేసుకోవటం, వంటి విషయాలలో కూడా వీరికి శిక్షణ ఇచ్చారు. ఇందుకుగాను, మరమ్మతులకు, శుభ్రం చేయటానికి కావలసిన సమస్త వస్తుపరికరాలతో కూడిన కార్ఖానా ఒక ట్రక్కు మీద అమర్చింది ఇక్కడ ఉన్నది. ఇది సంచార కార్ఖానా వంటిది.

ఇందులో శిక్షణ పొందేవారంతా ఈ శిక్షణ విద్యాలయం సమీపాన గల చిన్న కుటీరాలలో ఉంటారు. వీరు ఉదయం 7 గంటలకే లేచి శిక్షణ ప్రారంభించి సాయంత్రం 4 గంటలదాకా పని చేస్తారు. ఈ శిక్షణ కాలంలో మొదటి మూడు నెలలు ఈ యంత్రాలకు సంబంధించిన విషయాలు బోధిస్తారు. ఇంజన్లలోపల ఉండే వివిధ భాగాలను గురించిన పరిజ్ఞానం మొదలుకొని వాటిని మరమ్మతులు చేయటంవరకు అన్ని సంగతులు ఈ కాలంలో నేర్పుతారు. మిగతా 9 నెలల కాలంలో యంత్రాలచేత పని చేయించడం కార్ఖానాలో పనులు చేయటం మొదలైన ప్రత్యేక శిక్షణ గరపుతారు. దేశంలో పలు ప్రాంతాలనుంచివచ్చి ఇక్కడశిక్షణపొందిన వారిని అనంతరం ఆయా నదీలోయప్రాజెక్టులలో ఏదో ఒక దానికి పంపుతారు.

ఈ శిక్షణ కేంద్రాన్ని ఏర్పాటు చేసి, నిర్వహించటంలో తోడ్పడటానికని అమెరికన్ సాంకేతిక సహకార సంస్థ (యు. యస్. టి. సి. ఎం) అమెరికన్ నిపుణులను ఇద్దరిని నియోగించింది. వీరిలో ఒకరు శ్రీ జె. బి. స్టాంబెల్ ఈ కేంద్రంలో 6 నెలల పాటు ఉండి వెళ్లారు. మరొకరు శ్రీ ఎస్. వి. బంపర్ 9 నెలలు ఉండి వెళ్లారు.

ఈ శిక్షణ కేంద్రాన్ని భారత ప్రభుత్వ శాఖాకు కేంద్ర జలవిద్యుచ్ఛక్తి శాఖ నిర్వహిస్తున్నది. ప్రస్తుతం ఈ కేంద్రపు డిప్యూటీ డైరెక్టర్ శ్రీ ఎస్. జి. యూకీ శిక్షణ కార్యక్రమానికి అధ్యక్షత్వం వహిస్తున్నారు. శ్రీ యూకీ నాలుగేళ్ళపాటు బ్రిటన్‌లో సాంకేతిక విద్య అభ్యసించిన వ్యక్తి. ఆయనకు సహాయకులుగా మరి ముగ్గురు ఉన్నారు. వీరు ప్రస్తుతం 84మంది విద్యార్థులుగల జట్టుకు శిక్షణ ఇస్తున్నారు.

ఈ యువసాంకేతిక బృందం ఆనకట్ట నిర్మాణ ప్రదేశంలో బుల్‌డోజర్లు, గ్రేడర్లు నడుపుతూ కనుపిస్తుంటారు. ఇప్పటికి వారి శిక్షణ కాలంలో గడిచింది సగమే అయినా, అప్పుడే వారిలో ఆత్మవిశ్వాసం ప్రస్ఫుటమవుతున్నది.

వీరంతా నాగార్జునసాగరం వద్ద ప్రాచీన అవశేషాల మధ్య జరుగుతున్న ఈ ఆధునిక నిర్మాణ కార్యక్రమంలో ఎంతో తోడ్పడుతున్నారు.

ఈ విధంగా ఒకనాటి బౌద్ధవిద్యాపీఠం ఈ నాడు తిరిగి సాంకేతిక విద్యాకేంద్రంగా వర్ధిల్లుతున్నది. ★

# నక్షత్ర ఫలితాలు

**(12-3-58 మొదలు 18-3-58 వరకు)**

బి. నరసింగరావు

### గ్రహ స్థితి

| బు | శు | | |
|---|---|---|---|
| ర | 14 వ తేదీన రవి మీనములో ప్రవేశించును. | | |
| కు శ | 18 వ తేదీని పశ్చిమమున బుధుడు ఉదయించును. | | |
| కే | | గు రా | |

### *అశ్వని [చూ, చే, చో, లా]*

ఈ వారము మీరు మొదలుపెట్టిన పనులు ఫలించవు. మీ ఆలోచనలుకూడా ఇంకా కొంత కాలానికిగాని కార్యరూపంలోకి రావు. ఆశించిన డబ్బు సమయానికి చేతికి రానందున అప్పుచేయవలసి వస్తుంది. అన్నదమ్ముల కుటుంబాల రాకవల్ల ఖర్చులు ఎక్కువ. ఉద్యోగస్తులు అధికారులచే మాటపడి మనోవ్యథ పొందుతారు. విద్యార్థులు వినోదములలో పాల్గొని ప్రమాదాలకు లోనౌతారు. భూస్వాములకు, యంత్రములు నడుపు నిపుణులకు, పోలీసు శాఖలోనివారికి ఖనిజముల వ్యాపారస్తులకు లాభము. వారమంతయు భయాందోళనలతో కూడి వుంటుంది.

### * భరణి [లీ, లూ, లే, లో] *

ఈ వారము మీ ప్రజ్ఞవల్ల పలుకుబడిని ఉపయోగించి కార్యసాధన పొందుతారు. మిత్రులను కలుసుకుంటారు. భార్య ఆరోగ్యము బాగుపడుతుంది. విద్యార్థులు కొత్త విషయాలు నేర్చుకుంటారు. ఈశాన్య దిక్కునుండి వచ్చిన కుశల వార్తవల్ల కొంతకాలం నుండీ వున్న ఆందోళన తగ్గుతుంది. డాక్టర్లకు, మందుల వర్తకులకూ లాభము. కవులకు, కళాకారులకు మేలుకాలము. వారమంతయు శుభయోగములున్ననూ, శ్రమలోనూ, ఆందోళనతోనూ కూడి శాంతి లేకుండా వుంటుంది.

### *కృత్తిక [అ, ఈ, ఊ, ఏ]*

ఈ వారము మీ అధికారము పెరగడముతో ఆదాయముకూడా ఎక్కువవుతుంది. గతవారము అసంపూర్తిగా నిలిచిపోయిన పనులు పూర్తి అవుతవి. విజ్ఞాన విషయాలు తెలుసుకుంటారు. పిల్లల క్షేమాభివృద్ధివల్ల సంతోషము కలుగుతుంది. విద్యార్థులు శ్రద్ధగా విషయాలు నేర్చుకుంటారు. ఉపాధ్యాయులకు, న్యాయవాదులకు, పండితులకు, కళాకారులకు యోగకాలము. ఆర్థిక లాభము, కార్యసిద్ధి మొదలగు శుభయోగము లున్ననూ, ఈ వారమంతయు, మనస్సుకు నిలకడ లేకుండా వుంటుంది.

### *రోహిణి [ఓ, వా, వీ, వూ]*

ఈ వారము మీకు శుభయోగము. ఉన్న చిక్కులు తీరిపోతవి. అనుకున్న డబ్బు చేతికి వస్తుంది. మాతృవర్గము వారిని కలుసుకొని శుభకార్యాలోచనలు చేస్తారు. మృష్టాన్న భోజనముతో వినోదిస్తారు. ఇంటియందున్న వారి ఆరోగ్యము బాగుపడుతుంది. విద్యార్థులకు చదువుపై శ్రద్ధకలుగుతుంది. వెండినగలు, బియ్యము, నూలు, బట్టల వర్తకులకు లాభము. కవులకూ, గాయకులకూ, నటీనటులకూ యోగకాలము. ఈవారము శుభయోగములు వున్ననూ, మనస్సుకు నిలకడ వుండదు.

### * మృగశిర [వే, వో, కా, కీ] *

ఈ వారము మీకు యోగదాయకము. అసంపూర్తిగావున్న కార్యములు లాభకరముగా ముగియుటే కాకుండా నూతన కార్యారంభము చేస్తారు. ఇతరులకు మేలు చేస్తారు. మీకు వాహన యోగము కలుగుతుంది. విద్యార్థులు శ్రద్ధగా చదువుకుంటారు. బంగారము, వజ్రములు, రత్నములు మొదలగు ఖరీదైన వస్తువుల క్రయ విక్రయములలో వర్తకులకు లాభము. బట్టల వర్తకులకు కూడా యోగకరము. కవులకు, గాయకులకు, కళాకారులకు, నటీనటులకు మేలుకాలము. కార్యలాభము ధనయోగము వంటి శుభ యోగము లున్ననూ. వారమంతా శ్రమ, త్రిప్పట, అశాంతి వుంటవి.

### * ఆరుద్ర [కూ, ఖ, జ, ఛ] *

ఈ వారము అన్ని రంగములలోనూ మీరు జాగ్రత్త వహించడమువల్ల మేలు. కార్యభారము ఎక్కువ. ఆదాయాభివృద్ధికి చేసే ప్రయత్నాలకు ఆటంకములు కలుగుతాయి. ఆశించిన ధనసహాయము కలుగనందున గృహావసరములు తీరక మనోవ్యథ పొందుతారు. ఆరోగ్యభంగ సూచనలు కనబడగానే శ్రద్ధ వహించండి. విద్యార్థులకు చదువుపై శ్రద్ధ తక్కువ. గోధుమలు మొదలగు ఆహార ధాన్యముల వర్తకులకు లాభము. రాజకీయ వాదులకు మేలు. అధికారములో వున్న వారికి యోగము. ఈవార మంతా భయాందోళనలతో కూడి వుంటుంది.

### పునర్వసు [కే, కో, హా, హి] *

ఈ వారము మీకు అంత యోగకాలము కాదు. కార్య రంగములో అనేక ఆటంకములు కలుగుతూ వుంటాయి. మిత్రులెవరో శత్రువు లెవరో తెలుసుకుందికి కూడా మీ బుద్ధి పనిచెయ్యదు. వ్యాపారస్తులకు ఆటంకము. విద్యార్థులకు చదువుమీద శ్రద్ధతక్కువ. వ్యతిరేకులని అనుమానించిన వ్యక్తి సహాయంవల్ల వారాంతమున కార్యసాధన జరుగుతుంది. ఈవారం మొదట్లో కార్యభంగము, అస్థిమితము, శ్రమ కలిగిననూ అటుపిమ్మట ప్రయాణము, ఆకస్మిక మిత్రసహాయము కార్యసిద్ధి కలుగుతాయి. అధిక ఖర్చులు, మానసికవ్యథ వుంటాయి. విదేశీయులను కలుసుకొని విచిత్ర వస్తుసంపాదన చేస్తారు.

### *పుష్యమి [హూ, హే, హో, డా]*

ఈ వారము మీకు మిశ్రమయోగము. యత్నకార్యములకు ఆటంకాలు కలుగుతాయి. దైవమును నమ్మకొని కార్యాచరణ చేస్తారు. కనుక మీ ప్రయత్నాలు చివరకు ఫలిస్తాయి. అయిననూ గృహావసరములు తీరక ఇంట్లోవారికి అసంతృప్తి కలుగుతుంది. విద్యార్థులకు చదువు సవ్యముగా సాగకపోయినా నూతనాంశాలను నేర్చుకుంటారు. ఈ వారమంతయు నిలకడలేని స్థితి శ్రమ వున్నప్పటికీ ప్రయాణము, ఆత్మ వికాసము, కార్యలాభము మొదలగు యోగములు కలవు.

### *ఆశ్రేష [డి, డూ, డే, డో]*

గడిచిన వారములోవలె ఈవారముకూడా ఆదాయాభివృద్ధికి ఎక్కువ కార్యభారమును మీద వేసుకుంటారు. కాని ఆశాభంగము చెందుతారు. కోర్టు వ్యవహారములలో కొంత అనుకూలత వుంటుంది. ఉద్యోగస్తులకు అధి

# ★ నక్షత్రఫలితాలు ★

కాయల ఒత్తిడి వున్నప్పటికీ తోటివారి సహకారము వుంటుంది. వ్యాపారస్థులకు లాభము తక్కువ. భార్యకు అరోగ్యము చెడేసూచనలున్నవి. వ్యవహారముపట్ల స్త్రీలతో పేచీలువస్తాయి. ఈ వారములో కొద్దిగా కార్యసిద్ధి వున్ననూ కార్యములపట్ల ఆటంకాలు, త్రిప్పట, శ్రమ, వివాదము మొదలగు అవయోగములు ఎక్కువ.

### * మఖ [మా,మీ,మూ,మే] *

ఈ వారము ఎన్నివిధాల కార్యసిద్ధికి ఆటంకాలు కలిగినప్పటికీ పట్టుదలతో ప్రయత్నముచేసి తుదకు ఫలసిద్ధి పొందుతారు. సోదరులసహాయముతో చాలావరకూ ఒడిదుడుకులు సద్దుకుంటాయి. అగ్నివల్లగాని, యంత్రములవల్లగాని, వాడిపనిముట్లుతగులుటవల్లగాని ప్రమాదము కలిగే సూచనలున్నవి. జాగ్రత్తవల్ల తప్పవచ్చును. గనుల యజమానులకు, ద్రావకము పనివారికి, భూస్వాములకూ మేలుగావున్నా శ్రమ ఎక్కువ. వారమంతా మానసికాందోళనతో కూడి వుంటుంది.

### * పూర్వఫల్గుణి (పుబ్బ) * [మో, టా, టీ, టూ,]

ఈ వారము మీ బుద్ధికుశలతవల్ల కార్యానుకూలత పొందుతారు. హోదా, అధికారము పెరుగుదలతో ఆదాయము కూడా వృద్ధి అవుతుంది. క్రొత్తవారితో పరిచయలాభము కలుగుతుంది. కొంతకాలమునుండి పరిష్కారము కాకుండావున్న వ్యవహారములు సాధ్యమవుతాయి. అధికారుల మన్నన కలుగుతుంది. విద్యార్థులకు జ్ఞానాభివృద్ధి కలుగుతుంది. మందులవ్యాపారస్తులకు లాభము. కవులకు, శిల్పులకు, చిత్రకారులకు, నటీనటులకు యోగకాలం. శుభయోగములున్నప్పటికీ వారమంతా ఆందోళనగానే వుంటుంది.

### * ఉత్తరఫల్గుణి (ఉత్తర) * [టే, టో, పా, పీ]

ఈ వారము మీకు యోగకాలము. ధనయోగము ఎక్కువ. కొంతకాలమునుండి చిక్కు కలిగిస్తున్న కోర్టు వ్యవహారములు చాలావరకూ పరిష్కారమై శాంతిని కలిగిస్తాయి. ఉద్గ్రంథపఠనవల్లను, విజ్ఞానచర్చలవల్లను నూతన విషయాలు తెలుసుకుంటారు. పిల్లల క్షేమాభివృద్ధి సంతోషము నిస్తుంది. విద్యార్థులు ఉత్సాహముతో చదువుకుంటారు. ఉద్యోగస్తులకు హోదా పెరిగే సూచనలున్నవి. ఉపాధ్యాయులకు, న్యాయవాదులకు, పండితులకు, కళాకారులకు యోగకాలము. ఈవారమంతా ధనలాభము పండిత సాంగత్యము, కార్యసిద్ధి మొదలగు యోగములు. మానసికాందోళన వుంటవి.

### * హస్త [పూ, ష, ణ, ఠ] *

ఈ వారము యత్నకార్యములు అనుకూలిస్తవి. ఆర్థికస్థితి మెరుగ్గా వుంటుంది. బంధుమిత్రులలో కలసి వినోదాలలో పాల్గొంటారు. శుభవార్త వింటారు. నూలు, బట్టలు, బియ్యము, వెండి వర్తకులకూ లాభము. విద్యార్థులకు చదువుపై ఆసక్తి ఎక్కువవుతుంది. కవులకు, గాయకులకు, కళాకారులకు యోగకాలము. ఈ వారము త్రిప్పట, శ్రమ, మానసిక అశాంతి ఎక్కువ అయినప్పటికీ ఆర్థికలాభము, కార్యసిద్ధి, శుభవార్తా శ్రవణము, బంధుసమాగమము, మృష్టాన్న భోజనము వినోదము మొదలగు శుభయోగములుకూడా వుంటవి.

### *చిత్త [పే, పో, రా, రీ]*

ఈవారము యోగదాయకముగా వుంటుంది. మీ కార్యములు నిర్విఘ్నముగా నెరవేరుతవి. సంఘసేవవల్ల కీర్తివృద్ధి అవుతుంది. రాజకీయాలలో జయము కలుగుతుంది. బంధుమిత్రులతో కలసి, విందు, వినోదములలో పాల్గొంటారు. వాహనయోగము కలుగుతుంది. ఉద్యోగస్థుల హోదా, దానితో ఆదాయము పెరుగుతవి. శుభకార్య నిర్ణయము చేస్తారు. బంగారము, వజ్రములు, నవరత్నములు మొదలగు ఖరీదైన వస్తువుల వర్తకులకు లాభము. కవులకు, గాయకులకు, కళాకారులకు, నటీనటులకు యోగకాలము. విద్యార్థులు శ్రద్ధగా చదువుకుంటారు. కార్యరంగములో అధిక ఖర్చులు, త్రిప్పట, శ్రమవున్ననూ ఈ వారమంతా శుభయోగములు ఎక్కువ.

### *స్వాతి [రూ, రే, రో, తా] *

ఆదాయాభివృద్ధి ప్రయత్నాలకు ఆటంకాలు కలుగుతాయి. కార్యభారము ఎక్కువ. అకాలభోజనమువల్ల ఆరోగ్యము చెడుతుంది. పితృవరమునుండి ఆశించిన ధన సహాయము కలిగిననూ గృహావసరములకు సరిపడక అసంతృప్తి ప్రబలుతుంది. విద్యార్థులకు చదువుపై శ్రద్ధ తక్కువ. అధికారములో ఉన్న ఉద్యోగస్తులకూ, రాజకీయవాదులకూ కార్యలాభము కలుగుతుంది. ఆటవిక సరుకుల వర్తకులకు మేలు. ఈవార మంతయు భయాందోళనలతోకూడి వున్నా స్వల్పముగా యోగముకూడా వుంది.

### ధరలు:

నూలు, వస్త్రములు: సమస్థాయిలో వుండును.

నూనెదినుసులు: మందముగా వుండును.

బెల్లము, పంచదార: మార్పులేదు.

చింతపండు: తగ్గుదలలో వుండును.

ఆహారధాన్యములు: మందముగా వుండును.

పప్పుదినుసులు: తగ్గుదలలో వుండును.

వెండి, బంగారము: స్వల్పతేడాలో వుండును.

* * *

జన్మనక్షత్రము బట్టిగాని, జన్మనక్షత్రము ఎరుగనివారు నామనక్షత్రము (వారి వారి పేర్ల ననుసరించి పేరు మొదటి యక్షరము)ను బట్టిగాని ఫలితాలు తెలుసుకొనునది. కృష్ణుడను పేరునకు మృగశిరా నక్షత్రమును, హృష్ఠుడను పేరునకు స్వాతియు, శ్రీధరుడను పేరునకు చిత్తయును, క్షేత్రపాలకుడనే పేరునకు హస్తయును, భీముడు, భైరవుడు అనే పేర్లకు పూర్వాషాఢయును చూచుకొనునది.

### *విశాఖ [తీ, తూ, తే, తో]*

ఈ వారము ఆర్థికపరిస్థితులు సుఖవంతముగా వుండవు. నిలకడలేని ఆలోచనలవల్ల చికాకు పొందుతారు. కార్యాచరణలో శ్రమపడుతూకూడా మాటపడవలసివస్తుంది. ఇంటోవున్న వృద్ధుల అనారోగ్యమువల్ల ఆరాటం చెందుతారు. ప్రయాణములో కలిసిన వ్యక్తి సలహా, సహాయములవల్ల కార్యసిద్ధి పొందుతారు. వర్తకులకు మొదట్లో అనుకూలత లేకపోయినా వారాంతమునకు లాభముకలుగుతుంది. ఈ వారము మొదటిలో అమితఖర్చులు, ఆరోగ్యచింతవల్ల ఆరాటవ మొదలగు అవయోగములు, వారాంతమున ప్రయాణము నూతనమిత్ర దర్శనము, కార్యలాభము మొదలగు మంచియోగములు కలవు.

### *అనూరాధ [నా, నీ, నూ, నే]*

ఈ వారము మీరు నమ్మినవారే మీకు చిక్కులను కలిగించి ఏపనిచేసిందికీ వీలులేకుండా చేస్తారు. మీవల్ల లాభము పొందినవారే మీకు మోసము తలపెడతారు. కాని దైవబలంవల్ల అన్ని కష్టములుగడిచి చివరకు కార్యసిద్ధిని పొందుతారు. ఉద్యోగస్తులకు మాట నేర్పరితనమువల్ల అనుకూలముగా వుంటుంది. ఈ వారమంతయూ భయాందోళనలతో కూడుకొని వుంటుంది. ఇంట్లో వ్యా

ఆరోగ్యముగురించికూడా ఆరాటన.

## *జ్యేష్ఠ [నో, యా, యీ, యూ]*

ఈ వారము అనుకూలతకన్న ప్రతికూలత ఎక్కువ. కార్యభారంచే విశ్రాంతి తక్కువ. ఇతరులకు మేలు చేయబూని అనవసర వివాదములకు లోనౌతారు. కోర్టు వ్యవహారములు మీకు అనుకూలించినా అధిక ఖర్చులవల్ల ఆ సంతోషము వుండదు. భార్య ఆరోగ్యము సరిగా వుండదు. ఇంటా బయటా అసంతృప్తిగా వుంటుంది. ఈ వారము స్వల్ప లాభము ఉన్ననూ భయాందోళనలతో కూడుకొని వుంటుంది.

## *మూల [యే, యో, బా, బీ]*

ఈ వారము శ్రమ కలిగే పనులు ప్రారంభిస్తారు. కార్యసాధనలో ప్రతిఫలము లేక పోవడమే కాకుండా అనేక చిక్కులు కలుగుతవి. అయినప్పటికీ నిరాశచెందక ధైర్యముతో వ్యవహరిస్తారు. బంధు సహాయమువల్ల ఆర్థిక ఇబ్బందులు చాలావరకూ తగ్గుతవి. అధికారుల చురుకుమాటలవల్ల ఉద్యోగస్తులు వ్యథపొందుతారు. యంత్రములవల్లగాని, వాహనములవల్లగాని కలిగే ప్రమాదములు జాగ్రత్తవల్ల తప్పవచ్చును. ఇంజనీయర్లకు, పోలీసుశాఖలో వారికి మేలు కాలము.

## *పూర్వాషాఢ [బూ, ధ, భా, ఢ]*

ఈ వారము మీ ఆశయాలను కార్యరూపములో పెట్టి సాధిస్తారు. సమయమునకు మిత్రులు కూడా మీకు సహాయము చేస్తారు. జ్ఞాతులవల్ల ధనసహాయము లభిస్తుంది. ఈశాన్యదిక్కునుంచి ఆప్తబంధువుల శుభవార్త తెలిసి సంతోషము పొందుతారు. ఉద్యోగస్తులకు హోదా పెరుగుతుంది. వైద్యులకు మేలుకాలము. కవులు నూతన రచనలు ప్రారంభిస్తారు. గణితశాస్త్రజ్ఞులకు, శిల్పులకు, కళాకారులకు యోగము.

## *ఉత్తరాషాఢ [బే, బో, జా, జీ]*

ఈ వారము మీకు యోగకాలము. ఉత్సాహముతో కొత్తపనులను మొదలు పెడుతారు. ధనయోగము కలుగుతుంది. కోర్టు వ్యవహారములు మీపరముగా తీర్పు అవుతాయి. పిల్లలకు అభివృద్ధి కలిగే పథకాలను ఏర్పాటు చేస్తారు. ఉద్యోగస్తులకు గతవారము కలిగిన మంచి యోగము ఈ వారము అభివృద్ధిచెందుతుంది. విద్యార్థులకు చురుకుగా చదువుసాగుతుంది. పండితులకు విద్యాగోష్ఠివల్ల సన్మానము జరుగుతుంది. ఉపాధ్యాయులకు, న్యాయవాదులకు, నటీనటులకు యోగకాలము.

## *శ్రవణము [జూ, జే, జో, ఘా]*

గతవారముకన్నా ఈవారము మీ ఆర్థిక స్థితి ఎక్కువవుతుంది. యత్నకార్యములు ఫలిస్తాయి. బంధుమిత్రులతో కలసి వినోదములలో పాల్గొని మృష్టాన్నభోజనము ఆరగిస్తారు. విద్యార్థులకు ఉత్సాహముగా చదువు సాగుతుంది. నూలు, బట్టలు, బియ్యము, వెండివస్తువుల వ్యాపారస్థులకు లాభము. కవులకు, గాయకులకు నటీనటులకు యోగము. శుభయోగములతో పాటు వారమంతా భయాందోళనలతో కూడి వుంటుంది.

## ధనిష్ఠ [గా, గీ, గూ, గే]

ఈ వారము మీకు యోగదాయకము. ధనాదాయము వృద్ధిపొందుతుంది. యత్నకార్యములు ఫలిస్తాయి. ఇతరులకు సహాయముచేసి కీర్తి పొందుతారు. వాహనయోగము కలుగుతుంది. పట్టుబటలు, బంగారము, నవరత్నములు మొదలగు ఖరీదైన వస్తువుల వ్యాపారస్థులకు క్రయవిక్రయములలో లాభము. విద్యార్థులకు చదువుపట్ల నూతనోల్లాసము కలుగుతుంది. బంధువులతో కూడి విందు, వినోదములలో పాల్గొంటారు. కవులకు, గాయకులకు, కళాకారులకు, నటీనటులకు యోగం. వార మంతా శుభయోగము ఉన్ననూ ఆందోళనగా వుంటుంది.

## శతభిషం [గో, సా, సీ, సూ]

ఆదాయాభివృద్ధికి చేసేపనులు విఫలమవుతాయి. మీకు కలిగిన ధనసహాయముతో గృహావసరములు తీరక కలతలువస్తాయి. కార్యభారముచే త్రిప్పట ఎక్కువవుతుంది. అకాలభోజనమువల్ల వుష్ణాధిక్యముకలిగి, తలనొప్పి, కళ్ళమంట మొదలగు అనారోగ్య సూచనలు కనబడగానే శ్రద్ధవహించండి. ఉద్యోగస్తులకు కొత్తబాధ్యతలు కలుగుతాయి. వర్తకులకు ఆందోళన. రాజకీయాలలో పనిచేయువారికి స్వల్పయోగం. గోధుమలు మొదలగు ఆహార దినుసుల వర్తకులకు లాభము.

## *పూర్వాభాద్ర [సే, సో, దా, దీ]*

ఈ వారము అనుకున్నట్టు సొమ్ము చేతికి అందకపోవుటచేత ముందు ముందు మీ ఆదాయాభివృద్ధికి చేసే ప్రయత్నాలు విఫలమవుతాయి. అవసరాలు తీరకపోవడమే కాకుండా గృహకలతలు కూడా వస్తాయి. ఇంతవరకూ తటస్థముగా వున్న వ్యక్తి సమయానికి ఆదుకొని సహాయము చేయుటవల్ల వారాంతమునకు కార్యసిద్ధి అవుతుంది. విద్యార్థులకు చదువుమీద శ్రద్ధతక్కువ. వర్తకులకు మొదట్లో ఆశాభంగము, వారాంతమునకు లాభం. విదేశీయులతో స్నేహము, విచిత్రవస్తు సంపాదన కలుగుతాయి.

## *ఉత్తరాభాద్ర [దూ, శం, ఛా, ధా]*

ఈ వారము తలపెట్టిన పనులు ఫలించవు. అనుకున్న సహాయము లభించదు. గృహావసరము తీరక కలతలు వస్తాయి. ధైర్యంతో మెలగుటచే ఈశ్వరానుగ్రహమువల్ల అన్ని కష్టములు గడుస్తాయి. 12, 13 తేదీలలో వర్తకులకు త్రిప్పట, ఆశాభంగము, వారాంతమునకు లాభం. 14, 15 తేదీలలో ఉద్యోగస్థులకు ఒత్తిడి, ఆపైని అనుకూలత. 17, 18 తేదీలలో ఇంట్లోవున్నవారి ఆరోగ్యము గురించి ఆందోళన.

## * రేవతి [దే, దో, చా, చీ] *

ఈ వారము అనుకూలతకన్న ప్రతికూలత ఎక్కువ. మిక్కిలి శ్రమపడినమీదట కార్యసిద్ధిని పొందుతారు. కోర్టు వ్యవహారములు అనుకూలిస్తవి. ఒకరికి సహాయపడేందుకు తలపెట్టి అనవసరముగా నిందలపాలౌతారు. భార్యకుగాని, ఇంట్లోవున్న ఇతర స్త్రీలకుగాని ఆరోగ్యము సరిగా వుండనందున అశాంతి కలుగుతుంది. విద్యార్థులకు చదువుమీద అనాసక్తి, ఉద్యోగస్థులకు ఒత్తిడి వున్ననూ తోటివారి సహకారమువల్ల సర్దుబాటుగా వుంటుంది. వారమంతా అలజడిగా ఉంటుంది. ★

సర్వేషాం సన్మంగళాని భవంతు.

---

# నేటి పరీక్షలపద్ధతి

(27 వ పేజీ తరువాయి)

ఉంది. ఇది చేసిన మొట్టమొదటి పని ఏమిటంటే, పరీక్షలను గూర్చి ఒక గోష్ఠిని భోపాల్‌లో ఏర్పాటుచేయటం, ఈ గోష్ఠికి పరీక్షా సంస్కరణల విషయమై కృషి చేసిన ప్రముఖులను, సెకండరీ స్కూలు పరీక్షాసంఘాల ప్రతినిధులను ఆహ్వానించారు.

పరీక్షల పద్ధతిని, కార్యక్రమాన్ని సవరించటానికి భోపాల్‌లో జరిగిన గోష్ఠి సిఫార్సులు చేసింది. వీటిని అమలుచేస్తున్నారు. సెకండరీ విద్యామండలి పరీక్షా సంస్కరణలకు వేరే ఒక నిపుణుల సంఘాన్ని ఏర్పాటు చేసింది. ఈ సంఘం పరీక్షలకు పాతపద్ధతిని మానేసి నవీన పద్ధతులను అనుసరించాలని పాఠశాలలకు సలహాఇస్తుంది.

పరీక్షా సంస్కరణలపై చాలాకాలం కృషి చేసిన డా॥ బెంజమిన్ బ్లూమ్ (చికాగో విశ్వవిద్యాలయం)ను సెకండరీ విద్యామండలి భారతదేశానికి ఆహ్వానించింది. ఆయన గత సంవత్సరం మొదట్లో మనదేశంవచ్చి కొన్ని నెలలున్నారు. దేశంలో వివిధ ప్రాంతాల్లో శిక్షణ తరగతులు, గోష్ఠులు ఏర్పాటు చేసి హెడ్ మాస్టర్లకు, ఉపాధ్యాయులకు, ఉపాధ్యాయ కళాశాలల్లోని లెక్చరర్లకు పరీక్షా సంస్కరణల విషయమై ఆసక్తి కలిగించారు.

పరీక్షా సంస్కరణలకు ఒక కొత్త దృక్పథాన్ని సూచించిన డా॥ బెంజమిన్ బ్లూమ్ మన

# ★ నేటి పరీక్షల పద్ధతి ★

దేశానికి రావటం ఒక గొప్ప సంఘటన అని చెప్పవచ్చును. విద్యార్థి పనికి విలువ కట్టటానికీ, మొత్తం విద్యాకార్యక్రమానికీ అవినాభావ సంబంధం ఉన్నదని గుర్తించితే తప్ప పరీక్షలను సంస్కరించటానికి సమర్థమైన చర్య ఏదీ తీసుకోటానికి వీలుపడదనీ, ఈ విద్యాకార్యక్రమంలో విద్యాలక్ష్యాలు, విద్యార్జన అనుభవాలు, విలువకట్టే తతంగం—వీటన్నిటికీ సన్నిహితసంబంధం ఉందనీ డా॥ బ్లూమ్ అన్నారు. ఈ దృక్పథం సహజమైనదని, సహేతుకమైనదనీ నేను లోగడ నే చెప్పాను.

ఈ కొత్త దృక్పథంతో పనిచేసేందుకు తగినట్లుగా చాలామంది ఉపాధ్యాయులను, హెడ్‌మాస్టర్లను, లెక్చరర్లను డా॥ బ్లూమ్ తన శిక్షణ తరగతులలో, గోష్ఠులలో తర్ఫీదు చేశారు. ఈ దృక్పథమే సరియైనదని, సమర్థమైనదని ఆయన దేశంలోని సెకండరీస్కూలు పరీక్షా సంఘాల అధ్యక్షులకు, కార్యదర్శులకు నచ్చచెప్పి ఒప్పించారు. ఆయన సలహామీద అఖిలభారత సెకండరీ విద్యామండలి కేంద్రంలోను, మరి నాలుగైదు ప్రాంతాలలోను ఈ సమస్యనుగూర్చి పనిచేసేందుకుగాను నిపుణులతో కూడిన ఒక పరీక్షా సంఘాన్ని ఏర్పాటు చేసేందుకు నిశ్చయించింది.

## గోష్ఠులు

అఖిల భారత సెకండరీ విద్యామండలి హెడ్‌మాస్టర్ల కోసం, వివిధ ప్రాంతాలలోని విద్యాశాఖ ఇన్స్పెక్టర్ల కోసం సెకండరీ విద్యనుగూర్చి గోష్ఠులను జరుపుతోంది. ఈ ప్రాంతీయగోష్ఠులలో సాధారణంగా చర్చించే ముఖ్యవిషయాల్లో ఒకటేమిటంటే పరీక్షా సంస్కరణకుఅనుసరించవలసిన కార్యక్రమం ఏమిటి అని. పరీక్షా సంస్కరణకు సెకండరీ విద్యామండలి మరొకవిధంగా కూడా పని చేస్తోంది. దేశమంతటా దాదాపు 40 ఉపాధ్యాయ కళాశాలల్లో అదనపు శాఖలను ఏర్పాటుచేసింది. ఈశాఖలకుఅయ్యే ఖర్చును మండలి తనే భరిస్తోంది. ఈ శాఖలలో కొత్త పరీక్షా పదతులను, విలువకట్టే పద్ధతులను ఉపాధ్యాయులకు బోధిస్తారు.

అదనపు శాఖలు ఉపాధ్యాయులకోసం నిర్వహించే పునశ్చరణతరగతుల్లో, శిక్షణ తరగతుల్లో, గోష్ఠులలో ఈవిషయమై చర్చలు జరుగుతాయి. అంతేకాక ఈ అదనపు శాఖలు పాఠశాలల ఉపయోగార్థం స్కూలు రికార్డు ఫారములు, విద్యార్థి రికార్డు కార్డులు, పరీక్షల మాన్యువల్ పుస్తకాలు మొదలైన ముఖ్యమైనవాటిని చాలా ప్రచురించాయి.

దేశంలో పురోగమన శీలంగల ఒక పాతిక సెకండరీ స్కూళ్ళకు ధనసహాయంచేసి వాటిని ప్రయోగ పాఠశాలలుగా మార్చటానికి సెకండరీ విద్యామండలి నిశ్చయించి ధనం మంజూరుచేసింది. ఈ పాఠశాలలు తమకు ప్రత్యేకంగా వేరే పాఠ్యగ్రంథాలను పెట్టుకుని ప్రత్యేక పద్ధతుల్లో బోధిస్తూ, పరీక్షలు కొత్తరకంగా జరపటానికి కూడా వీలుకలిగించింది. ఈ పాఠశాలల్లో పద్ధతులను ప్రస్తుతం విద్యాశాఖ, సెకండరీ విద్యాసంఘాలు నియమించిన పాఠ్యగ్రంథాలనే అనుసరించే మిగతా పాఠశాలలుమాని నేర్చుకునేదంతైనా ఉండగలదు.

## పత్రికలు, పుస్తకాలు

పరీక్షాసంస్కరణలకు అఖిలభారత సెకండరీ విద్యామండలిమీదనే ఎక్కువగా ఆధారపడి ఉంటున్నా, కేంద్ర విద్యాశాఖ తనుకూడా పరీక్షాసంస్కరణలకు వేరే ప్రయత్నాలుచేస్తూనేఉన్నది. సెకండరీ విద్యను సంస్కరించటానికి ఉపాధ్యాయ కళాశాలల్లో జరిగే పరిశోధనలకు కేంద్రవిద్యాశాఖ సహాయంచేస్తూఉంది. ఈ పరిశోధనలు చాలవరకు, పాఠశాలా పరీక్షలలో ప్రశ్నలను ఎలా తయారుచేయాలీ, సమాధానాలను ఎలా విలువకట్టాలీ అనే సమస్యలకు సంబంధించినవి.

కేంద్రవిద్యాశాఖ "ఎడుకేషనల్ క్వార్టర్లీ", "సెకండరీ ఎడ్యుకేషన్" మొదలైన పత్రికలు ప్రచురిస్తోంది. వీటిలో పరీక్షల సమస్యలనుగూర్చి చర్చలు జరుగుతూ ఉంటాయి. "క్యూములేటివ్ రికార్డ్ కార్డు" మొదలైన కొన్ని ప్రత్యేక ప్రచురణలను గూడా అందించటంవలన, విద్యార్థి అభివృద్ధిని వరసగా రికార్డుచేసి ఉంచదలుచుకునే పాఠశాలలకు చాలా ఉపయోగంగా ఉన్నది.

పరీక్షాసంస్కరణలపై రాష్ట్రప్రభుత్వ విద్యాశాఖలు కూడా ఆసక్తి కనబరిచాయి. వేర్వేరు తరగతులకు నియమించిన కోర్సులను బోధించటంలో ఉపాధ్యాయునికి ఎక్కువ స్వేచ్ఛను ఇస్తున్నాయి. అంతేకాక విద్యార్థిని పైతరగతులకు పంపించటానికి ఇదివరలో ఉన్న కఠిన నిబంధనలను కూడా సడలించారు. ఇదివరలోనైతే, సాంవత్సరిక పరీక్షల్లో విద్యార్థికి వచ్చే మార్కులమీదే అతని విజయమూ, అపజయమూ ఆధారపడి ఉండేవి. ఇప్పుడు అతని క్లాసు రికార్డులను గూడా చూసి మరీ నిర్ణయిస్తున్నారు.

ఎస్.ఎస్.ఎల్.సి. పరీక్షా సంఘాలుకూడా పరీక్షల పద్ధతిపై వెలువడిన విమర్శను త్రోసిపుచ్చటంలేదు. పబ్లిక్ పరీక్షల్లో వ్యాసరచనను కోరే ప్రశ్నలతోపాటు కొత్తరకం ప్రశ్నలు, చిన్నచిన్న సమాధానాలిస్తే సరిపోయే పరీక్షలుకూడా ఉండాలని ఈ సంఘాలు ఇప్పుడు నిర్ణయంచేశాయి. కొన్నిసంఘాలు పరీక్షా పద్ధతి పరిశీలనకు కొన్ని చిన్న ఉపసంఘాలను కూడా నియమించుకున్నాయి.

ఉదాహరణకి, బొంబాయి రాష్ట్రపు ఎస్. ఎస్. ఎల్. సి. పరీక్షాసంఘానికి ఒక పరిశోధన ఉపసంఘం అనుబంధమై ఉన్నది. ఈ ఉపసంఘం సమర్థులైన కొందరు ఉద్యోగుల సహాయంతో పరీక్షల కార్యక్రమాన్ని, మార్కుల్నీ పరిశోధిస్తోంది. ఇప్పుడు బొంబాయి ఎస్. ఎస్. ఎల్. సి. సంఘం ఒక నిపుణుల బృందం సహాయంతో, ఉపాధ్యాయుల ఉపయోగార్థం వ్యక్తిగతవైరుధ్యాలకు ఆస్కారం ఇవ్వని పరీక్షలు నిర్వహించటాన్నిగూర్చి ఒక చిన్న పుస్తకం తయారుచేయిస్తోంది.

ఈ సమస్యపై బరోడా విశ్వవిద్యాలయం వంటి సంస్థలుకూడా ధైర్యంగా పరిష్కార ప్రయత్నాలు చేస్తున్నాయి. కళాశాలల్లో పరీక్షలను, విలువకట్టే పద్ధతులను అవి సంస్కరించాయి. ఎస్. ఎస్. ఎల్. సి. లో ఉత్తీర్ణులైన విద్యార్థులను కాలేజీల్లో చేర్చుకునేందుకు ఇప్పటిదాకా ఉన్న అర్హతా నియమాలను సడలించాయి. దీనివల్ల ఎస్. ఎస్. ఎల్. సి. పరీక్షా సంఘాలుకూడా తమ పరీక్షావిధానాన్ని సంస్కరించుకునేందుకు వీలుకలిగింది.

స్వాతంత్ర్యం రాకముందు రోజుల్లో భారతీయ విద్యలోకల్లా అధమలక్షణం పరీక్షా విధానమేననీ, ఇప్పుడీ విధానాన్ని సంస్కరించటానికి జరిగే ప్రయత్నాలు చాలవరకు సమగ్రంగాను, సమర్థంగాను ఉన్నాయని నేనిప్పటిదాకా చెప్పినదాన్నిబట్టి గ్రహించవచ్చు. ఇప్పుడిప్పుడు కనబడుతున్న ఉత్సాహము, సంస్కరణాభిలాష ముందుముందు కూడా ఏమాత్రమూ తగ్గకుండా నిలబడేటట్లయితేను, డా॥ బ్లూమ్ వంటి పెద్దలు సిఫార్సుచేసిన కార్యక్రమానికి దేశమంతటా తగిన ఆదరణ లభిస్తేను, వచ్చే నాలుగైదేళ్లలో స్కూలుపరీక్షా పద్ధతి, ఫలిత నిర్ణయ పద్ధతి లోపరహితమైన చక్కని స్థాయిని అందుకోగల వవటంలో ఏమీ సందేహం అక్కర్లేదు. ★

# వనితాలోకం

## 'నే నింక కాలేజీకి పోనమ్మా-'

బి. ప్రేమలీల

ఆ దివసం శనివారం. లక్ష్మిగారింట్లో నేనూ మరో ఫ్రెండూ పిచ్చాపాటీ మాట్లాడుతూ కూర్చున్నాం. నాలుగున్నర కొట్టింది గడియారం. ఇంటికి పోదామని లేచే వేళకి- గేటు దఢాలున తోసుకుని ధుమధుమలాడే ముఖంతో జోళ్ళను పెద్దగా చప్పుడు చేసుకుంటూ విసురుగా లోపలకు వచ్చింది లక్ష్మిగారి పెద్దమ్మాయి. చేతిలో ఉన్న పుస్తకాలను సోఫాలకు గిరవాటువేసి ఎర్రబడ్డ ముఖంతో "నే నిక కాలేజీకి పోనే అమ్మా!" అంది తీవ్రంగా.

ముగ్గురం ఒక్కసారిగా తెల్లబోయాం.

"అదేం. ఇప్పు డేమయింది?" అంది వాళ్ళమ్మగారు.

ఆ పిల్ల జవాబు చెప్పకుండా ఏడుస్తూ కూర్చుంది. కాలేజీకి మరి పోనని మొరాయించింది. అడగ్గా-అడగ్గా-తేలిన విషయం ఏమంటే, ఆ అమ్మాయి ఇంటికి వస్తూంటే కొందరు పెంకిపిల్లవాళ్లు కూడా వెంబడించి ఏవేవో కొంటెకూతలు కూశారట; నవ్వారట. ఇదీ సంగతి.

ఆ అమ్మాయిని సముదాయించబోతూ, మొదటిసారిగా ఆ పిల్లని పరీక్షించి చూశాను. పల్చని షిఫాన్‌చీర కట్టుకుంది. ఆ చీర లోపలి శాటిన్‌పూలపావడా స్పష్టంగా బయటకు కనిపిస్తోంది. జడ అదో తమాషాగా సగంనుంచి రెండు అల్లికలు మాత్రం అల్లి, మిగతా జుట్టు కుప్పలా వదిలేసింది వీపు మీద. పెదాలకు, పొడుగ్గా పెంచుకున్న గోళ్ళకూ రంగు వేసుకుంది. వీపూ, పొట్టా, సగానికి సగం కనిపించేలా జాకెట్టు వేసుకుంది. కళ్లకొసలనుంచి కణతల వరకు వ్రాసియున్న కాటుకరేఖలు-ఇంకా ఏమిటేమిటో; అదంతా నేను వర్ణించలే నసలు కొండిక; మొత్తంమీద ఆ అమ్మాయి వాలకం చూస్తే ఏ బ్యూటీ కాంపిటీషన్‌కో, పిక్చర్‌కో, పార్టీకో, వెళ్లిం దనుకుంటారు, కాని చదువుకోడానికి కాలేజీకి వెళ్లిందని ఎవరూ అనుకోరు. మనస్సులోని ఈ భావమే ఆ అమ్మాయితో చెప్పా లనిపించింది. కాని మొహమాటం కొద్దీ ఊరుకున్నాను. కాని నా ఫ్రెండు ఉంది చూశారూ, మనసులోని మాటలను తకీమని మొహంమీదే అనేసే రకం.

"చూడమ్మా! వాళ్ళేదో అంటున్నారని బాధపడుతున్నావ్ కాని నీ విషయం కూడా ఎలా ఉందో గమనించావా? నీ మట్టుకు నీవు ఆలోచించు: నీవు చేసుకున్న అలంకరణ చూసేవాళ్లకి నీ యెడల గౌరవ భావం కలిగిస్తుందే కాని ఎవరికీ నీ యందు సద్భావాన్ని కలిగించదు. అందుకే నిన్ను వాళ్లంత లోకువగా తీసికొని మాట లంటున్నారు. మరి నిన్ను అంటున్నట్టు నీ కూడా వస్తూన్న మిగతా పిల్లల్నంటున్నారా? కారణం ఏమిటంటావు?"

నా ఫ్రెండు ఉపన్యాసానికి ఆ అమ్మాయి కోపగించుకుంటుందేమోనని భయపడ్డాను. కాని స్వతహాగా మంచిపిల్ల కాబట్టి వింటూ కూర్చుండిపోయింది.

ఇలాంటి అనుభవాలు నేటి విద్యార్థినులకు సర్వసాధారణమైపోయింది.

నేనీ వ్యాసాన్ని వ్రాస్తూఉంటే నాకు తెలీకుండా వెనకాలనుంచుని చదువుతూన్న మా చెల్లాయి కోపంగా ముందుకువచ్చింది. "ఒక్క కాలేజీపిల్లలేనా అట్లా తయారవుతూంది? మిగతా ఆడవాళ్ళు తయారవడం లేదా" అంటూ ఆమెకి, ఈ వ్యాసం చదువుతూ ఆమెలాగే కోపగించుకొనే (ఎవరూ కోపగించుకోరనే నా నమ్మకం) మిగతా వారికీ నా దొక్కటే సమాధానం: తక్కిన స్త్రీలవలెగాక విద్యార్థినులకు ఒక ప్రత్యేకత ఉంది. రోడ్డుమీద బయటికెళ్ళి చదువుకొని అమ్మాయి ఎంత ఫాషన్‌గా తయారయి వెడుతూన్నా ఎవరూ పట్టించుకోరు. ఒక చూపు చూసి ఊరుకుంటారు. అదే రోజూ బయటికెళ్లి చదువుకుంటూన్న పిల్ల అయితే ఈ కొస నుండి ఆ కొసవరకూ ఎన్ని జతలకళ్లో ఆమెను వెంటాడుతుంటాయి. ఆమె కట్టూ, బొట్టూ, తీరును విమర్శిస్తుంటాయి. అందుచేత విద్యార్థినులు-ముఖ్యంగా మగపిల్లలతో కలసి చదువుకొనే విద్యార్థినులు-తమ వస్త్రాలంకరణ విషయంలో ప్రత్యేక శ్రద్ధ తీసుకోవాలి. అలాగే ఉద్యోగాలుచేస్తున్న స్త్రీలసంగతికూడా. వాళ్లుకూడ తమ్ము తాము గుర్తించుకుంటూ అతిగా పోకుండా, ఆడంబరం లేకుండా వినయం వందనం ఒప్పేవిధంగా అలంకరించుకున్నప్పుడే నలుగురిమధ్య నిలబడి గౌరవంగా ఉద్యోగం చేయగలుగుతారు.

అయితే ప్రస్తుతం నేను విద్యార్థినుల అలంకరణ విషయమే ప్రత్యేకించి వ్రాస్తున్నాను గనుక మిగతా వారిసంగతి వదిలేద్దాం. విద్యార్థినులంతా విపరీతంగా తయారవుతున్నారని అనను. వారివారి అభిరుచులనుబట్టి ఎవరికి వారు వారికిష్టంవచ్చినట్లు అలంకరించుకోవచ్చు. అలంకరణ దోషమని ఎవరూ అనరు. కాని ఆ అలంకరణ విపరీతమై మితిదాటినప్పుడు మన ఆనందంకోసం-మనసంతోషంకోసం-సంతుష్టికోసం మనం చేసుకున్న అలంకరణ ఇతరులకు ఎబ్బెట్టుగా కనపడవచ్చు. వారి ఏకాగ్రతకు ప్రశాంతతకు ప్రతిబంధకం కావచ్చు. దుష్ఫలితాలను కలిగించవచ్చును. అప్పుడు మన అలంకరణను సవరించుకోమని చెప్పే హక్కు ఇతరులకు వుంది. ఈ అలంకరణ ఎంత విపరీతంగా ఉండకపోతే, కొందరు ప్రిన్సిపాల్స్ ట్రాన్స్‌పరెంట్ (ఉల్లిపొర) దుస్తులు వేసు

(41-వ పేజీ చూడండి)

## దేశదేశాల మహిళలు 2:

# అల్జీరియా స్వాతంత్ర్య సమరంలో స్త్రీల భూమిక

"ఎవరది" అని కళ్ళు నులుపుకొంటూ, లేచివెళ్ళి తలుపుతీసింది నాడియా.

"నేను ఆయేషాని. మా అన్నయ్యని ఇప్పుడే కొండల్లోంచి, ఇంటికి తీసుకు వచ్చారు. ఫ్రెంచివాళ్ళతో పోట్లాటలో దెబ్బ తగిలింది. గుండు తొడలో గుచ్చుకు పోయింది. నువ్వు త్వరగా రావాలి" అంది ఆ తలుపుకొట్టిన అమ్మాయి.

నాడియా డాక్టరుకాదు. ఇంకా వైద్యం చదువుకొంటోంది అల్జీరియా విశ్వవిద్యాలయంలో. ఆ పిల్లకి ఇంకా ఇరవయ్యేళ్ళయినా రాలేదు. యూనివర్సిటీ ఆస్పత్రిలో ఆపరేషన్‌లూ అవీ చూస్తున్న పుడు తనకు కళ్ళు తిర్గు తమ్ముతాయని చెబుతూఉండేది తన స్నేహితులతో. అలాంటి పిల్లకు, ఇపుడు యుద్ధంలో గాయపడ్డ వొక దేశభక్తుడికి ఆపరేషన్‌చేసి తుపాకిగుండు బయటకుతీయవలసినపని మీద పడింది.

"ఆయెషా! నేనింకా ఆపరేషన్ చెయ్యటం బాగా నేర్చుకోందే! ఈ పని నావల్ల అవుతుందా!" అంది నాడియా పెద్ద కళ్ళను విప్పార్చి చూచి.

"నువ్వుతప్ప ఇంకెవరూ లేరిక్కడ. రాక తప్పదు. పదు" అంటూ ఆయెషా బలవంతం చేసింది.

ఆ అర్ధరాత్రిపూట, చీకటి సందులగుండా పోతూ, ఫ్రెంచి మిలిటరీ పోలీసులకంటబడకుండా తప్పించుకుంటూ ఆ అమ్మాయి లిద్దరూ గమ్యస్థానం చేరుకున్నారు. నాడియా సకాలంలో ఆపరేషన్‌చేసి గాయపడ్డ దేశభక్తుడిని కాపాడింది. అదొక్క సందర్భమేకాదు; అలాగ, ఆమె తరచుగా అర్ధరాత్రివేళ రహస్యంగా వెళ్లి స్వాతంత్ర్య సమరంలో గాయపడ్డవారికి శస్త్రచికిత్స చేస్తూఉండేది. కోలుకుని తిరిగి యుద్ధానికి వెళ్ళినవాళ్ళలో కొందరు ఫ్రెంచివాళ్ళకి దొరికిపోయారు. వాళ్ళలో కొందరిని ఫ్రెంచి సైనికాధికారులు చిత్రహింసలుపెట్టి, గుట్టూ మట్టూ అడిగేవారు. ఆ విధమైన హింసలవల్ల, కొంత కాలానికి ఇలా నాడియా అనే వైద్యవిద్యార్థిని, ఫ్రెంచివాళ్ళమీద తిరుగుబాటుచేసిన వారందరికీ వైద్యసదుపాయాలు చేస్తోందని తెలిసిపోయింది. అక్కడితో, నాడియా ఔరుకదలి కొండల్లోకి పారిపోయి జాతీయ సైన్యం సేవాదళంలోచేరి పూర్తిగా ఆ ఉద్యమంలో పాల్గొనసాగింది.

స్వాతంత్ర్యంకోసం తల్లడిల్లిన మహిళలు కూడా పురుషులకు తీసిపోకుండా, ఆ కొండల్లో కష్టాలుభరిస్తూ ఎలా పోరాటం సాగిస్తున్నారో తెలుసుకోవడానికి, నాడియాకథ మచ్చుతునకలాంటిది. 1955లో జాతీయసైనికదళం, శిక్షణపొందిన నర్సులు కావాలని విజ్ఞప్తిచేయడంతో నాడియావంటి 'విద్యార్థినులు, వైద్యులు, నర్సులూగా పని చేస్తున్నవాళ్ళూ కండలాది యువతులు బయలుదేరి కొండప్రాంతాలకు తరలి పోయారు.

అల్జీరియా, ఉత్తరాఫ్రికాలోని ఫ్రెంచి వలస. ఫ్రాన్సు 1880 లో ఆదేశంమీదకు దండెత్తి తిష్టవేసింది. అల్జీరియన్‌లు నాటి నుండీ పోరాటం సాగిస్తూనే ఉన్నారు. నాటినుండి ఆ దేశపు మహిళలు ఇందులో పాల్గొంటూనే ఉన్నారు. 1954 నవంబరు నుండి ఈ ఉద్యమం ఉన్నతమైన పెద్ద ఎత్తున జరుగుతుంది. అల్జీరియన్ దేశభక్తులు దుర్గమ అరణ్యాలలోను పర్వతాలలోను స్థావరాలు ఏర్పరచుకొని ఈ ఉద్యమాన్ని నడుపుతున్నారు.

ఈ మహోద్యమంలో స్త్రీలు చాలా గొప్ప భూమిక నిర్వహిస్తున్నారు. 1880 లగాయతు నేటివరకు జరిగిన సంఘటనలు ఎన్నిటిలోనో స్త్రీలు పాల్గొని ప్రాణాలు కూడా అర్పించారు. డాక్టర్లు, నర్సులు, ఉపాధ్యాయులు, కార్యదర్శులుగా మాత్రమేకాక, రేడియో ఆపరేటర్లుగా, ఫ్రెంచి ప్రభుత్వ ప్రయత్నాలను భగ్నం చేసే కుట్రదారులుగా, గూఢచారులుగా, యుద్ధంలో తుపాకీపట్టి నిలచిన సైనికులుగా కూడా వారు పోరాటంలో పాల్గొన్నారు. సైనిక వ్యవహారాలలో స్త్రీపురుష భేదాలు ఉండవు. అందువల్ల కొన్ని కొన్ని చోట్ల స్త్రీలే పురుషులకు ఆజ్ఞలు ఇచ్చి, వాళ్లను నడిపించడం జరుగుతూ ఉంటుంది కూడా. ఘోషాలకు, స్త్రీల బానిసత్వానికి ఆలవాలం అనిపించుకున్న అల్జీరియా చరిత్రలో ఇది పెద్ద విశేషం.

అల్జీరియా స్వాతంత్ర్యసైన్యంలో మొదట చేరినదిపట్టణాలలో విద్యావతులైన యువతులే. పల్లెటూళ్ళలో చాలామంది పట్టించుకునే వారు కాదు. అందువల్ల, పల్లెలలో గట్టిగా ప్రచారంచేసి అక్కడి వారందరినీ ఆ కట్టుకుని రావడం ఒక ముఖ్య కార్యక్రమం అయింది. అందువల, ఈ ఉద్యమంలో చేరి శిక్షణ పొందిన విద్యావతులంతా, జట్టుజట్టుగా బయలుదేరి, ఊరూరా పర్యటించారు. అక్కడక్కడా పెద్ద సభలు చేసే ముప్పు అని, ఆ ఊళ్లో చురుకుదనం, తెలివితేటలూ ఉత్సాహం ఉన్న పడుచులు విదారుగురిని చేరదీసి వాళ్ళకి తమదేశం చరిత్ర గురించీ, దాని పరిమాణం పాడిపంటల గురించీ తెలియ చెప్పేవారు. అందరు చదువు నేర్చుకోవలసిన అవసరం, ఆరోగ్యం కాపాడుకొనే పద్ధతులు వ్యాధులు నివారించడానికి చేసే ఉపాయాలూ, అంటువ్యాధుల నిర్మూలనపు మార్గాలూ, ఇవన్నీ వాళ్ళకి బోధపరచి పొరుగూరుకు వెళ్లిపోయేవారు. ఆనక, అది నేర్చుకున్న విదారుగురూ, తమఊళ్లో చిన్నకి పెద్దకి స్థిమితంగా ఓపికగా అన్నీ బోధపరచేవారు. ఈపద్ధతివల్ల, దేశంలోని ప్రతిమారుమూల పల్లెటూరునా, స్వాతంత్ర్యం ఏమిటో, ఎందుకు, అదిలేక, కామపడుతున్న కష్టనష్టాలేవిటో చక్కగా తెలుసుకున్నారు.

తత్ఫలితంగా, జాతీయ సైన్యంలో పల్లెటూళ్ళనుండికూడా ఎందరో యువతులు చేరసాగారు. ఈ సైన్యంలోచేరిన యువతులకు నర్సులుగా శిక్షణ ఇవ్వడానికి నాలుగు నెలలు పడుతుంది. దాదులకు వంట వాళ్లకూ తరిఫీదు ఆరువారాలు. అజ్ఞాతంలో ఉంటూ పోరాటం సాగించే యువతులు చాలమంది ఉన్నారు.

ప్రాణాలు కోల్పోయే ప్రమాదం ఉన్న పని అది. గతజూలై నెలలో జమీలాబౌహీరెడ్ జమీలా బౌవాజ అనే యువతులు ఇద్దరు పట్టుబడ్డారు. మొదటి అమ్మాయికి 19 ఏళ్ళు రెండవ ఆమెకు 21 ఏళ్ళు. ఫ్రెంచి సైనిక న్యాయస్థానం వాళ్ళకి గిలటిన్‌మీద వధించాలని తీర్పుఇచ్చింది. ఆ విచారణ సమయంలో ఫ్రెంచి సైనికులు తమను నానా హింసాపెట్టారనిజమీలాబౌహీరెడ్ చెప్పింది. ఈమె 'కాస్బా' (అల్జియర్స్ నగరంలో అరబ్బులు ఉండేవాడ) లో వెళ్తూ వుండగా ఫ్రెంచి సైనికుడు మరతుపాకి కాల్చాడు. గుండు వీపులో గుచ్చుకొని ఆమెపడిపోయింది. ఒక ఫ్రెంచి వైద్యుడు చికిత్స

# ఇనప చక్రాలక్రింద నలిగిపోయే అభాగినులు

ప్రతిజీవికీ, తన ప్రాణంకన్న, ప్రియమైన వస్తువు ఇంకొకటి వుండదు. ఎన్ని కష్టాలు వచ్చినా, ఎంత ప్రియమైన వారిని పోగొట్టుకున్నా మృత్యువును కోరదు జీవితం.

రమణమ్మగారు వ్రాసినట్టు, ముఖ్యంగా ఆ మూడు పరిస్థితులలోనే, స్త్రీలు ఎక్కువగా, ఆత్మహత్య చేసుకుంటారు. సాధారణంగా ఆత్మహత్య చేసుకునేవారు ఏవైపు నుంచీ సహాయం లేనివారే. స్త్రీలకి ముఖ్యంగా తనను తాను పోషించుకోలేని అసమర్థతే ఈ అనర్థానికి కారణం.

తమకూతురు తనని తను పోషించుకునేందుకు తగిన విద్య చెప్పించి ఆపైన పెళ్ళి సంగతి ఆలోచిద్దామనే తల్లిదండ్రులు ఎంతమంది వున్నారు? ఆస్తి వున్న స్త్రీలకు ఏ బాధా లేదు. అగ్రవర్ణుల మనుకునేవారిలో తప్ప తక్కిన వర్ణాలలో స్త్రీ పురుషునిమీద అంతగా ఆధారపడదు. వారిలో స్త్రీ సంపాయిస్తే, వీధి ముఖంచూస్తే తప్పు అన్న బాధ లేదు. అందుచేత వారిలో భర్తవల్ల బాధలు కలిగితే బ్రతుకుతెరువు లేక చనిపోవలసిన పరిస్థితి ఏర్పడదు. పైగా, వారిలో ఇటొస్తే, ఇది కాకపోతే ఇంకొకర్తి అనుకునేందుకు ఎదురు ఆడదానికి, డబ్బు పెడితేగాని పెళ్ళి అవదు. పిల్లవాడికోసం పిల్లతరఫువార్లు, పరుగెత్తవక్కర్లేకుండా, ఆడపిల్లకోసం వాళ్ళే వస్తారు. ఏ ప్రయోజకత్వం లేక, పోషించుకునే శక్తిలేని వాడవుతే అతడికి పెళ్లేఅవదు.

ఎటొచ్చి, ఈ వంశాలు మర్యాదలు అని గొప్పలు తగిలించుకుని, వీధిముఖం చూస్తే తప్పు అని భావించేవారిలోనూ, చదువుకుంటే తప్పు, ఆడపిల్ల పుట్టినది పెళ్ళికోసమే గనక ఆ యీడురాగానే ఇల్లూ వాకిలీ అమ్మైనా సరే కోరిన కట్నం పోసి, వదిలించుకుంటే ఏడుతరాలవారు తరిస్తారు అనుకునే వారిలోనే ఈ చిక్కు! కేవలం లాటరీలో లాగా ఆమె అదృష్టం బావుంటే జీవితం సాఫీగా నడుస్తుంది. లేదా భరించి నన్నాళ్లు భరిస్తుంది. ఎటూ బతికే దారిలేక, ఇహ నిలవడం దుర్భరం అయిన పరిస్థితుల్లో మరణమే శరణ్య మనుకుంటుంది!

ఎంతో ప్రగతి సాధించాం, మంత్రి పదవులలో కూడా స్త్రీలు వున్నారు, చదువులు కూడా మునపటికంటే ఎక్కువే. ఇటీవల, ఆస్తి హక్కులుకూడా వచ్చాయి, అని గర్వపడుతున్నామే కాని, సంఘంలో ఏ ఇళ్లల్లో

**అ. పార్వతి**

స్త్రీలకి జరుగుతున్న అన్యాయాలు ఏమాత్రం మారలేదు. చట్టాలలో మార్పులకన్నా, మనస్సులలో పరివర్తన రాందే, ఏం లాభంలేదని తేలుతోంది. అందాకా ఎంతమంది 'చలాలు' గోలపెట్టినా, ఎన్ని 'స్త్రీ'లు రాసినా సంఘం ఇనప చక్రాల కింద నలిగిపోయే అభాగినులు నలిగిపోతూనే ఉన్నారు. స్త్రీలలో ఎక్కువ ఆత్మహత్యా సందర్భాలు పెళ్లి అయాక భర్తమూలకంగానే జరుగుతున్నాయి. భర్త కొట్టినందుకు కాక, తోటికోడలు దెప్పినందుకు ఏడ్చానని ఒక సామెత వుంది. తన పుట్టిన వూరు, తన తల్లి, తండ్రి అందర్నీ వదులుకొని కేవలం తన్నే నమ్ముకుని, తన దయా ధర్మంమీద ఆధారపడి వచ్చిన స్త్రీని ప్రేమతో చూడడం పోయి, ఆ రాకలోని ప్రేమని అర్థం చేసుకోలేక, నేనుతప్ప దీనికి దిక్కు ఎవరు, నా చేతికి అప్పగించారు గనక, నేను ఏమన్నా, చెల్లుతుంది—అనే భావనలో వుంటారు కొంతమంది భర్తలు. ఎంతసేపూ, ఇదిభార్యగనక, తేరాకోరంగా అయినా, ఇది నా మీద అధికారంగా వుండకూడదు; ఎంత అణిచి వుంచితే అంతమంచిది-అనుకుంటారు మగవారు. తనో ఆఫీసరుననీ, ఆమె తనకింద పనిచేసేది అనీ భావం పెట్టుకుంటాడుగాని, ఇది గృహం, ఇక్కడ ఎవరి ఎచ్చు తగులూ లేవు, ఇద్దరం భాగస్థులం, ఇద్దరూ ఒకరినొకరు అర్థంచేసుకుని క్షమాభావంతో మెలగాలి అని అనుకోరు. పైపెచ్చు తనకి, కొత్త వంట్లో జలుబు చేసినా, ఇంట్లో ఎవరికేంవచ్చినా తన పరీక్ష పోయినా' ఆఫీసులో చీవాట్లుతిన్నా అన్నిటికీ ఈ పెళ్ళామే శనిగ్రహంలా కన్పిస్తుంది! కొత్త ఏ విషయంలో చిన్న పొరపాటు జరిగినా దాన్ని పెద్దదిగాచేసి, తన వాళ్ళందరికీ చూపించి కొట్టి, తిట్టి, సిచపరిస్తేగాని వారికి తృప్తి వుండదు.

భర్త, ఆదరించకపోతే తక్కిన అతని తరఫునవున్న ఇంట్లో ఆడవాళ్ళుకూడా వాళ్ళ ఇష్టంవచ్చినట్లు ఈమెను బాధపెడ్తారు.! వింటాడుగనక రెండు నేరాలుచెప్పికొట్టించి సంతోషపడేవాళ్లువుంటారుపాపం! ఇంకొళ్లు కొట్టినా, తిట్టినా తను ఆమెకు అండగా వుండవలసిందిపోయి, తనే అలుసు ఇచ్చి, ఇతరులు ఏమైనా బాధలు పెడ్తూవుంటే దీనికి ఇలాగ జరగాలి శాస్తి అనుకునే భర్త దొరికిన స్త్రీ, ఇన్ని అవమానాలు భరించలేక చివరకు ఏంచేస్తుంది పాపం!

భర్త పరస్త్రీలోలుడయి బాధలుపెడితే, ఆత్మహత్య చేసుకున్నట్టే, ఈరకం బాధ కూడా ఆత్మహత్యలకి కారణం. కొంతమంది మగవాళ్ళకి ఆమె కూచున్నా, నుంచున్నా, ఆఖరికి తన తమ్ముడితో మాటలాడినా అన్నిటికి అనుమానమే! ఓబయటికి పేరంటం కెళ్ళినా, కొత్త ఆమె అలంకరించుకొన్నా సహించలేరు. నానా రకాలుగా ఆమెని తిట్టి, హింసిస్తారు. భర్తకే తన్ను అర్పించుకున్న మానవతికి, తానువమ్మిన భర్తే ఆ విధంగా అపవాదులువేసి, పాపభీతి లేకుండా నీచంగా మాట్లాడుతున్నప్పుడు జీవితంమీద విరక్తిపుట్టి ఆత్మహత్య చేసుకోవలసిన అగత్యం ఏర్పడుతుంది.

లెక్కల్లోకివచ్చి చనిపోయినవారు ఇంతమంది వుండగా, ఇంకా ఎక్కువ బాధలు అనుభవిస్తూ చావలేక, బతకలేక దిన దిన గండం క్రింద బతుకుతున్నవారు

## అల్జీరియా స్త్రీలు

కానస్టెంటైన్ రాష్ట్రంలో ఊరూలా జరిగింది.

అల్జీరియా మహిళలు, తమ జీవన విధానాలు బాగుచేసుకోవాలనీ, అన్ని రంగాలలోనూ తాము ముందుకువచ్చి పురుషులతో సమానులుగా దేశాభివృద్ధికి పాటు పడాలనీ ఆకాంక్షిస్తున్నారు. పరపరిపాలన వదలిపోతేగాని, ఇది సాధ్యపడదని వారి నమ్మకం. అది సాధించి తీరుతారనడానికి సందేహం లేదు.

('విమెన్ ఆన్ ది మార్చ్' సౌజన్యంతో)



ఇటీవల భీమునిపట్నం మునిసిపల్ హైస్కూలులో నాట్యంచేసి బహుమతి పొందిన కుమారి వైజయంతి. (9 సం॥)

# ★ 'ఏడిపిద్దాంరా!' ★

ఈ రోజులలో ఎక్కువమంది యువకులలో ఈ మాట తరచు వినిపిస్తుంది. ఎక్కడైనా అమాయకమైన ఆడపిల్ల కనుపించడం చాలు. "ఏడిపిద్దాంరా" అని వాళ్లు వెనకాల పడతారు. ఇంతకూ ఏడిపించడం తక్కువ తక్కలితంగా కాను ఏతేర్పది రొక్కువ. మారుపేర్లు పెట్టి పిలవడం ఈ ఏడ్పించటంలో ఒక భాగంగా భావిస్తారు. కొంచెము లావుగావున్న అమ్మాయిని "ఎవరెస్టు" అని, కొంచెము గూనిగా నడచే అమ్మాయిని 'మామ్మ' అని వాళ్ళు వెనుక నడుస్తూ పిలుస్తారు. ఈమధ్య కాలేజీల్లో ప్రతి ఆడపిల్లనూ 'అత్తయ్యా' అని పిలవడం మీరు వినేవుంటారు.

ఈ ఏడిపించడం అన్నది విద్యార్థులలోనే ఎక్కువగా ఉన్నది. స్కూళ్ళు విడిచిన తరువాత విద్యార్థినుల వెంటపడుతూ విజిల్సు వేస్తూ మారుపేర్లు పెట్టి పిలుస్తూ వెళతారు. ఏ విద్యార్థినియైనా వెనక్కు తిరిగిచూచిందా ఇకవాళ్ళు మరీరెచ్చుతారు. బెదిరించుకొని పోతే ఏగొడవ యుండదు. ఏడిపించడంలో రకరకాలమాటలు మీరు వింటూనే ఉంటారు. ఏ సోదరియైన పొరపాటున నడుస్తూ రాయితగిలి తూలుతూందనుకోండి. వెంటనే కూడావస్తున్నవాడు తన ప్రక్కనున్న స్నేహితుని హెచ్చరించినట్లు ఒరే! కొంచెం జాగ్రత్తగా నడవరా లేకపోతే పడి పళ్ళు విరుగుతే చూడలేం' అంటాడు. అసలు యీ మాట ఆ అమ్మాయినే అనడం. కాని ఆ అమ్మాయి ఎదురుగా వెళ్ళి అంటే గొడవ చెడుతుందేమోనని యిలా 'యిన్‌డైరక్టుగా' అంటారు. కాలేజీలోను, హైస్కూళ్ళలోను ఆడపిల్లల సంగతి మరీ ఘోరం. కావాలని ఆమెతో గిల్లికజ్జా తెస్తారు. ఆమె హెడ్‌మాస్టరుకో, ప్రిన్సిపాల్‌కో రిపోర్టు చేస్తుంది. ఆయన ఆ పిల్లవాడిని సస్పెండ్ చేస్తాడు. అక్కడనుంచి స్టూడెంట్సు అందరు స్ట్రైయిక్ అంటారు. సస్పెండుచేసిన హెడ్మాస్టరుపేరు, ఆటీచరుపేరు సచిత్రంగా తెల్లగోడలపై ఎక్కుతవి. ఇలా నడుస్తుంది తంతు. ఇక ఆడవాళ్లు ఎప్పుడైనా ఏ కార్యక్రమములోనైనా వేషాలు వేయుట తటస్థిస్తే యిక చెప్పనక్కరలేదు. ఎక్కడతప్పవుందా అని నిశితంగా వెతుకుతారు. అప్పటి కార్యక్రమము అయినతరువాత మనవాళ్ళు వెతుకుతూంటే ఆవేసిన వేషముపేరుతో పిలుస్తారు. వీళ్ళు ఒకసారి తమకుకూడా అక్కచెల్లెళ్ళు ఉన్నారని కొంచెం ఆలోచించినచో వాళ్ల తప్పు వాళ్ళకే తెలుస్తుంది.

—ఎస్. ఆర్. చంద్రకుమారి,

—సామర్లకోట)

ఎంతమందో !

చాలామంది ఎన్నికష్టాలు, అవమానాలు భరించి అయినాసరే తమ చిన్నబిడ్డల మొహం చూసేసరికి అన్నీ మర్చిపోయి, వారికోసం, అన్నీ సహించి బతకాలని చూస్తారు. కాని అలా ఆయినా బ్రతకనివ్వకుండా, ఆమెకు ఇంట్లో విశ్రాంతం స్వతంత్రంలేకుండా ఆఖరికి ఆమెకు ఇంట్లో కాలులేకపోయినా చూడక, పనిమనిషికి ఇచ్చిన గౌరవం, స్వతంత్రంకూడాలేకుండా ఇంట్లో అద్దెకున్నవాళ్లదగ్గరనుంచి, వీధిలో వాళ్ళదాకా ఈమెను తిట్టినా చెప్పుకునేందుకు లేక ఒకవేళ విసుగువచ్చి పడలేక ఏమైనా అంటే 'ఛీ, పో, ముండా,' అని గెంటేసేవాళ్లు వున్నారు. ఎప్పుడూ భర్తనించి తిట్లు, దెబ్బలు, మనస్సుని గాయపరచే అవమానం మాటలకి నోచుకున్న స్త్రీకి, బ్రతుకుమీద విరక్తికాక అనురాగం ఎలా వుంటుంది? హిస్టీరియాలాంటి జబ్బులు కూడా స్త్రీలలోనే ఎక్కువ! అలా దారుణమైన దెబ్బలు చావలేనివారు బాధలవల్ల మనస్సుపాడయి ఇలాటి రోగులక్రింద తయారవుతున్నారు!

తన్నుతాను పోషించుకునే మార్గంలేక ఎంత నరకం అయినా ఆ పురుషుడ్ని పట్టుకు వేళ్ళాడవలసివస్తోంది. ముఖ్యంగా స్త్రీల సాంఘిక, సంక్షేమ సంస్థలు ఇలాటి దుస్థితికి పాలవబోయ్యే స్త్రీలకు ఆశ్రయమిచ్చేవిగా వుండాలి. వారికి ఏ విద్యమీద అభిరుచివుంటే దాంట్లో, తగు శిక్షణఇచ్చి జీవితంమీద తగు ఉత్సాహం కల్పించి బతుకుబాట కల్పించాలి. ప్రభుత్వం, సాంఘిక సేవయందు అభిరుచివున్న స్త్రీలు కలసి వూరూర మాతాశిశురక్షణకేంద్రాలు ఏర్పరిచి బ్రతకడానికి నీడలేక చనిపోయే పరిస్థితులను తప్పించాలి. మన మహిళాసమాజాలు ఏ డబ్బున్న ఆవిడనో ప్రెసిడెంటుగా ఎన్నుకుని, గొప్పవాళ్లంతా కలసి కుఆటలాడుకునే కేంద్రాలుగానూ, నాటక నాట్య కేంద్రాలుగానూ మాత్రమే తయారవుతున్నాయి. ఇవి ఎదటి స్త్రీ కష్టానికి సానుభూతిచూపి, ఏ దిక్కూలేని అభాగ్యులకి నిలవ నీడ నిచ్చే నిలయాలుగా మారాలి.

ఆడపిల్లలమీద నిజమైన ప్రేమవున్న తల్లితండ్రులు కనీసం స్కూల్ ఫైనల్ వరకైనా చదివించి, ఒక వృత్తిలోఅయినా కొన్నాళ్ళపాటు ఆమెకు శిక్షణ ఇప్పించి కొన్నాళ్ళు ఆమెకు ఉద్యోగానుభవం అయినతర్వాత పెళ్లి ప్రయత్నాలు చేస్తే మంచిది.

మన రెక్కలలాటి బంధువులు ఎవరూ లేరుకదా! ★




## ఉత్తరాలలో అసందర్భాలు

తమ 80 ఏళ్ల అనుభవాల గురించి మామ్మగారు వ్రాసిన వ్యాసం చాల బాగుంది. ఆవిడ అనుభవాలు ఇంకా విడమర్చి వ్రాయవలసిందని కోరుతున్నాం. ఆనాటి ఆచార వ్యవహారాలు మొదలైనవి వ్రాస్తే మనుమలు చదువుకుంటారు.

"మా కాలపు చదువులు" అంటూ వ్రాసినది చదువుతుంటే నాకు కొన్ని సందర్భాలు జ్ఞాపకం వచ్చాయి. ఇప్పటివాళ్ళు ఒక డిగ్రీకాదు మూడు, నాలుగు డిగ్రీలు తీసుకున్నా చిన్న కార్డుముక్క వ్రాసే విధం చాలామందికి తెలియదు. చిన్నవాళ్లకు నమస్కారాలన్నా చేస్తారు. పెద్దలను దీవించనన్నా దీవిస్తారు. ఇప్పటి వుత్తరాలు విమర్శనా దృష్టితో చదివితే చాల అసందర్భాలు వుంటాయి.

ఈమధ్య మా అక్కగారింటికి ఒక వుత్తరం వచ్చింది. అందులో, "చి॥ సౌ॥ అత్తయ్యకు నమస్కారములు" అని వ్రాశాడు ఆ అల్లుడు.

చి॥ సౌ॥ అని, దీవించడమేమిటి; మళ్ళీ నమస్కారములు ఏమిటి? మళ్ళీ ఆ అబ్బాయికి చదువూ డిగ్రీలు తక్కువకాదు! కాని ఇంగ్లీషులో ఆఫీసర్లకు వుత్తరాలు వ్రాయుటే తెలుసు. మేనమామ భార్యకు తెలుగులో వుత్తరం వ్రాయవలసి వచ్చేటప్పటికి పాతసంప్రదాయం జ్ఞాపకం చేసుకున్నట్లున్నాడు. అత్తయ్య తనకన్న చిన్నది గదా అని దీవించినట్లున్నాడు. మళ్ళీ మేనమామ భార్య పూజ్యురాలుగదా అని కొన్ని నమస్కారాలు పారేశాడు. అంతేగాని దీవించి నమస్కరించడమేమిటా అని ఆలోచించలేదు.

మావాడు ఒక డిగ్రీ తీసుకుని ఇంకొక డిగ్రీకోసం దూరం వెళ్లి చదువుతున్నాడు. దూరంలో వున్నాడని వారానికి ఒక వుత్తరం వ్రాయమంటాము. వారం వారం సంగతులు ఏమీ వుండవు. అదికాక "ఏమిటి చాదస్తం వుత్తరం కొంచెం ఆలస్యమైతేనేమి" అనే నిర్లక్ష్యంతో, అందుకు ఏం చేస్తాడంటే పైన క్షేమం అని వ్రాయడు వూరు పేరు తారీఖు వ్రాయడు. సరిగా రెండు పంక్తులు గీసిపారేస్తాడు కార్డుమీద.

అల్లాంటి వుత్తరం ఒకమారు ఒక ముసలావిడ చేతిలో పడింది. పైన క్షేమంలేక రెండే పంక్తులున్న కార్డుచూచి ఖంగారు పడడం మొదలెట్టింది. చదువుదామంటే చత్వారం చేత కళ్ళు కనిపించవు. ఇంకొకరు వచ్చి చదివేవరకు ఆవిడ మనసు ఎంత బాధ పడిందో! వాడిచేత అలవాటు మాన్పించడం కష్టం అయింది.

ఇరుగు పొరుగువారు నాచేత చదివించుకున్న వుత్తరాలలో అసందర్భాలు చెప్తాను. "మహారాజశ్రీ రాజపూజ్యులైన అమ్మగార్కి", "మ॥ స॥ అక్కను దీవించి వ్రాయున దేమనగా" - మొదలైన అసందర్భాలు చాల వుంటున్నాయి.

"మై డియర్, డియర్, డార్లింగ్" అని వ్రాసే అలవాటేగాని రాజశ్రీలు, బ్రహ్మశ్రీలు, మహాలక్ష్మి సమానలు వారికి తెలియవు. అందుచేత ఎప్పుడో వ్రాసే తెలుగు వుత్తరానికి ఇన్ని అసందర్భాలు తెచ్చిపెడతారు.

మామ్మగారి వూరిపేరు (పొన్నాడ సుబ్రమ్మగారిది) చెప్తే చాల సంతోషిస్తాము.

పాకల సీత, ఏలూరు.]

(తాళ్ళరేవు-తూ. గో. జిల్లా)

* * *

"నా ఎనభై ఏళ్ళ అనుభవములు" అను వ్యాసము వ్రాసిన మామ్మగారికి వందనములు. నిజంగా అంతవయస్సులో కూడా వ్రాయాలనే ఓపికతో చక్కగా విడమర్చి వ్రాశారు. మాటలుకూడా మనస్సుకు కష్టం కలుగకుండా సున్నితంగా హాస్యంగా వ్రాశారు.

వనితావాణిలో టి. రమాదేవిగారు వ్రాసినట్లు కూరకాయలు కోయునప్పుడు ముసలివారు చూడకుండా తరిగేస్తారు. మనంచేస్తే మీలాంటి చిన్నవాళ్ళు మాకు చెప్పతారా. మీరు ఇప్పుడు చదువుకొంటున్నా మొదట మావంట తిన్నవారేకదా అంటారు. పంజాబీ స్త్రీల దినచర్యవ్యాసం కూడా బాగుంది. వనితాలోకంలో వంటలకంటే కుట్లూఅల్లికలు, వ్యాసాలు ఎక్కువ వేస్తారనిఆశిస్తున్నారు.

—ఎ. రుక్మిణికుమారి సాలూరు.]

* * *

## ఎన్ని గుండెలుండాలని!

ఆ మధ్య భానుమతిగారు అత్తగారూ-ఆచారాలూ, అని వ్యాసం రాశారు. దానితో కొంత మందికి ఆచారముల మీద వున్న అభిప్రాయాలు బాహాటంగా చెప్పటానికి సాహసం వచ్చింది. లేకపోతే ఎవరికి మటుకు అత్తగారి మీద రాయటానికి గుండె చాలద్దూ! అయితే ఆ రాసిన వాళ్లు కూడా ఆచారమనేది, శుచి, శుభ్రం వుండటానికయితే ఫరవాలేదు, -కాని దురాచారమయితే కాస్త బాధ, అన్నారు కాబట్టి అది ఫరవాలేదు. కాని ఒక్కొక్కసారి తర్జన భర్జనలు వృధా అనిపించేలా, సాగుతున్నాయి. మంచి అనేది ఎందు ఉన్నదో కూడా తెలుసుకో లేకుండా చేస్తున్నాయి. ఇక, ఏదోలే కుర్రపిల్లలు రాసుకుంటున్నారు, ఇందువల్ల మనకు పోయే దేమిటి? అనుకోకుండా సుబ్బమ్మ మామ్మగారిలాంటి వాళ్ళకి కోపం వచ్చేస్తోంది. మామ్మలకే కోపం వచ్చేస్తూంటే మాబోటి దుడుకు పిండాల మాట వేరే చెప్పాలా?

వారి చిన్నతనాన్ని వరిస్తూ మామ్మగారు తొలికోడి కూసే వేళకి లేచే వాళ్ళమన్నారు. అంటే వారికి అన్ని పనులూ వారే చేసుకోవలసిన అవసరం వుండేది గనుక లేచేవారు. ఇప్పటికీ, అన్ని పనులు చేసుకోవలసిన వారు ఆ వేళకే లేవకపోతే పనులెల్లా అవుతాయి చెప్పండి? కొందరికి పని మనుషులు వుంటారు. వాళ్ళువచ్చి అన్నీ చేస్తారు గనుక కాస్త తీరుబాటుగా పడుకుంటారు. అంతేగాని 8 గం॥లకు లేచే ఆడవాళ్లను నేను ఎక్కడా చూళ్ళేదు. మామ్మగారు అతిశయోక్తి వుపయోగించారు కోపం కొద్దీ అనుకుంటూ. (తిట్టకేం మామ్మా)

ఆరోజుల్లో కాఫీలు లేవుగనక ఆవకాయి అన్నం తినేవారు. ఇప్పుడు కాఫీలు లేని ఇల్లు అరుదు. పైగా ఒకటికి రెండేసి మూడేసి సార్లు. ఇంట్లోవాళ్లు తాగుతుంటే ఇప్పుడిప్పుడు కొందరు మామ్మలు కూడా అలవాటు చేసుకున్నారు. కాల మహత్యమే

మరి చదువుల మాట కొస్తే, మామ్మల నాడు గుంట ఓనమాలు దిద్దిన మాట నిజమే మొన్న ఈ మధ్య మా రామకృష్ణకి, చదువు చెప్పే మాష్టరుని రమ్మన్నాము. ఆయన బాగా పెద్ద వాడు. ఆయన వస్తూనే "గుంటలు ఎక్కడ తీయమన్నారు?" అని అడిగాడు. నాకు తెలీక "గుంటలెందుకు?" అన్నాను. వేలుతో దిద్దిస్తారుట. నేను "పలక మీద చాల్లెండి. గుంటలు వద్దన్నాను. అల్లా, అయితే ఇంగ్లీషు మీడియమ్ (English medium) వున్న స్కూళ్లల్లో చదివిన మేము ఏం చెయ్యాలో తెలీదు. స్కూల్లో చదివేటప్పుడు తెలుగులో మాట్లాడరాదు. మాటకి అణా ఫైను.

ఇంటి కొచ్చి పొరపాట్న స్కూల్లో అలవాటు చొప్పున ఒక్క ఇంగ్లీషు ముక్క ఏ మామ్మ దగ్గరైనా దొర్లిందో చచ్చామే! "నాగరీకం బలిసి పోయింది. అప్పనిబట్టుకు వసంతమని, నా దగ్గర ఆ ఇంగిలీసు పేలుస్తున్నావా?" అని కోప్పడేస్తారు. స్కూలు మానినాక చచ్చిచెడి ఇంగ్లీషు ముక్కలు దొర్లకుండా అలవాటు చేసుకునే సరికి దేముడు కనిపించాడు. ఆ మధ్య మా మామయ్య ఒకసారి అన్నాడు "నువ్వు మాట్లాడుతూంటే ఒక్క ఇంగ్లీషు మాటైనా రాలేదేమిటే! చదువున్న వాళ్ళెవరూ నీలాగ మాట్లాడరు" అన్నాడు.

ఒక్క సంగతి చెప్పాలి. ఇలా ఒకళ్ళ మీద ఒకళ్ళు విమర్శలు చేస్తూ ఉంటే దీనికి అంతుండదు. అందరూ ఏదైనా వుపయోగపడే రచనలు రాసుకుంటే బాగుంటుంది; అత్తలుగాని, కోడళ్లుగాని, మామ్మలుగానీ, ఎవరు చేసే పనులు వాళ్లకి బాగుంటయి. వారి మీద వీరు, వీరి మీద వారు, రాసుకోటం వల్ల ఏమీ ప్రయోజనం లేక పోగా చదువుకున్న పిల్లల మీద వారికి ఇంకా దురభిప్రాయం, పెద్దల మీద వీళ్ళకింకొంత నీరసభావం కలుగుతాయి. కనుక అందరూ వనితాలోకంలో నూతన వికాసం తేవటానికి ప్రయత్నించాలని, అందర్నీ నన్ను మన్నించమని కోరుకుంటున్నా.

—వి. లలిత, కారుమూరు.]

* * *

## 'నే నింక కాలేజీకి పో నమ్మా-'

(35-వ పేజీ తరువాయి)

కని ఎవరూ కాలేజీకి రాకూడదని నోటీసులు పంపిస్తారు? విద్య నార్జించడానికి వెళ్లుతూన్న విద్యాలయాన్ని ఫ్యాషను సెంటర్నుగా కొందరు విద్యార్థినులు చూస్తున్నారనడం అబద్ధంకాదు. సహజంగా ఆ వయస్సులో ఉద్రేక హృదయాలు గల కాలేజీ యువకులు ఈ విపరీత ఆకర్షణలకు మరింత ఉద్రేకపడుతూ కేకలు వేస్తున్నారంటే— వెంబడిస్తున్నారంటే, ఇంకా యేవేవో కొంటెపనులు చేస్తున్నారంటే చేయరూ మరి? మనం ధరించే దుస్తులతీరునుబట్టే మన ప్రవర్తనను ఇతరులు నిర్ణయిస్తారనేది నగ్న సత్యం.

పూర్వం ఒంటినిండా దుస్తులు ధరించడం నాగరికత అనిపించుకుంది. ఈ నవీన యుగములో శరీరాన్ని ఎంత బహిర్గతం చేస్తే అంత నాగరికతగా చెలామణి కావడం పరిపాటి (గృహపాటుకూడా) అయిపోయింది. ఇంట్లో ఎలావున్నా ఇల్లు విడిచి నలుగురి మధ్యా ముఖ్యంగా మగవాళ్ళమధ్య సంచరించేటప్పుడు మన దుస్తుల అమరిక విషయంలో ప్రత్యేకశ్రద్ధ తీసుకోవాలి. అది మన మంచికొరకే. ఇతరులను ఆకర్షించడమే ప్రధానం కాదు. ఇతరుల గౌరవభావంకూడా మనం పొందగలగాలి. కాలేజీలలో నేకాదు; హైస్కూళ్ళలోకూడ ఈ విపరీతమైన వస్త్రాలంకరణ విద్యార్థినుల్లో కనిపిస్తూంది. ఇలా తయారై స్కూళ్ళకు వెడుతూన్న ఆడపిల్లల్ని చూస్తూ ఆ తల్లిదండ్రులు — ముఖ్యంగా తల్లులు-ఎలా ఊరుకుంటున్నారా అనిపిస్తుంది. ఈ రోజుల్లో ఉన్నత పాఠశాల విద్యార్థినుల్లో పావడామీద అరగజం వోణీ ముక్క ధరించిరావటం ఫ్యాషను అయింది. ఆ బెత్తెడుగుడ్డ పరికిణీమీద ఎందుకైతే వేసుకుంటున్నారో యెవరికీ అర్థంకాదు. ముఖ్యంగా మగపిల్లల స్కూళ్ళలో చదువుతూన్న ఎదుగుతూన్న ఆడపిల్లల వస్త్రాలంకరణ విషయంలో తల్లులు తగిన జాగ్రత్త తీసికోవడం మంచిది. అది పూర్తిగా తల్లి యొక్క బాధ్యతయే. తన కుమార్తె ఎలాంటి దుస్తులు ఎలా ధరించి వెడుతూందీ తల్లి పర్యవేక్షించడం ఎంతో అవసరం. అలా అని ఈ పర్యవేక్షణకూడా అతిగా వుండకూడదు. అతిగా పోతూ పిల్లల సున్నితమైన మనసుల్ని నొప్పించకూడదు. ఒక్కొక్కసారి మితిమీరిన ఈ పర్యవేక్షణ పిల్లల్ని పాడుచేస్తుందికూడా. అతిగా పోవడం అంటే మా బంధువుల్లో జ్ఞాపకం వస్తూంది. ఆవిడకూతురు స్కూలుకు తయారవుతున్నది మొదలు గుమ్మందిగేవరకూ, చేసే రిమార్కులకు, ఆ సాధింపులకు అంతుండదు. "జడ అంతవదులుగా వేశావేం?" "చెంపలు పైకి దువ్వు! "వోణీ కుచ్చెళ్ళు పరికిణీముందరిభాగందాకా రానీయి" జాగ్రత్తగావెళ్లు దారంటాపల్లి కిలించకుండా"... అంటూ ఒకటే దండకం చదువుతూంటుంది. ఆపిల్లకూడా వాళ్ళమ్మ కిష్టం వచ్చినట్టే తయారై వీధిమలుపు దిరిగేవరకూ ఎంతో బుద్ధిమంతురాలులాతలొంచుకుని ఎంచక్కా వెడుతుంది. (అంతవరకు ఆ జనయిత్రి సుపుత్రిని చూస్తూనే ఉంటుంది) ఆ వీధి దాటడంతోనే ఆపిల్ల దగ్గర్లోనే ఉన్న స్నేహితురాలింట్లో చెంగునదూకి తన కిష్టం అయినపద్ధతిలో బట్టలు కట్టుకొని, తలదువ్వి, మరీ స్కూలుకు బయలుదేరుతుంది. ఇలా ఆతల్లి కూతుర్ని 'చెక్' చేసేకొద్దీ ఆ కూతురు మొండికెత్తి పెద్ద ఆరిందాగా అయింది.

అందుచేత తల్లులు పిల్లల మనస్సులు మొండికెత్తించేవిధంగా కాకుండా సున్నితంగా చిన్నప్పటినుండీ దుస్తులను ఎలా ధరించితే బాగుంటుందో, మర్యాదగా వుంటుందో వారికి నేర్పించాలి. ఈ విషయంలో మొదట తల్లులే పిల్లలకు మార్గదర్శకులు కావాలి.

విద్యార్థినుల దుస్తుల అలంకరణనుగూర్చి చెప్పుకోవలసివస్తే, కాన్వెంటు విద్యార్థినులు ఆదర్శంగా కనపడతారు. ఎవరెవరిఅంతస్థులు ఎలాంటివయినా, అభిరుచులు ఎలాగున్నా, అంతా ఒకటే యూనిఫారం ధరించడంవలన ఏ ఆకర్షణకు లొంగిపోకుండా — ఏకాగ్రచిత్తంతో తమ లక్ష్యంమీద దృష్టి ఉంచడానికి వీలవుతుంది. ఈ విలువను గుర్తించియే కాబోలు కొన్ని, కొన్ని కళాశాలల్లో విద్యార్థినులకు ఇలాంటి యూనిఫారం దుస్తుల్ని, ఆ కళాశాలల పాలకవర్గం నిర్ణయించుతూంది.

విద్యార్థినులంతా విపరీతంగా తయారవుతున్నారని వారిని నిందిస్తూ రాయటం నా ఉద్దేశం కాదు. ఎంత ఉన్నతమైన చదువుల్లో ఉన్నా, ఎంతో నిరాడంబరంగా, సామాన్యంగా కనిపించే ఆదర్శ విద్యార్థినులు ఎంతోమంది ఉన్నారు.

ఏ వేళప్పుడు ఎలాంటి దుస్తులు ధరించి ఎలా తయారయితే బాగుంటుందో మనల్ని, మన పరిసరాల్నీ, మనసులో పెట్టుకుని— మనకున్న విచక్షణాజ్ఞానం ఉపయోగించుకొని నిర్ణయించుకోవడం మంచిది. ★



ప్రతి పసిబిడ్డకున్నూ అప్పుడప్పుడు అజీర్ణ
బాధలు కలుగుచుండును. గాలి, కడుపు
నులి నొప్పి, అతి విరేచనములు, (గ్రహణి)
అస్వస్థతను గలిగించును. ఒక టీ చెంచాడు
ఇన్‌ఫెన్‌టోన్ గ్రైప్ వాటర్ బిడ్డకు తక్షణం
శమనకారియై బాధావిముక్తిని గలిగించును.
తల్లులు 30 సంవత్సరములకన్నా ఎక్కువ
కాలము నుండియు తమబిడ్డలను సుఖం
గాను ఆరోగ్యవంతంగాను వుంచుటకు ఆరోగ్య
వైద్య శాస్త్రీయంగా తయారు చేయబడినట్టి
ఇన్‌ఫెన్‌టోన్ గ్రైప్ వాటర్‌ను వాడుచున్నారు.
మీ గృహమందు ఎల్లప్పుడూ ఒక సీసాను
ఉంచుకొని మీ బిడ్డకు ఇవ్వండి

# తక్షణ నివారణ!

# ఇన్‌ఫెన్‌టోన్

రిజిష్టర్డు

## గ్రైప్ వాటర్




బిడ్డను ఆనందోత్సాహంగా వుంచును.

హైదరాబాద్ కెమికల్ అండ్
ఫార్మసుటికల్ వర్క్సు లిమిటెడ్,
హైదరాబాద్ - దక్షిణ్

PSHC-29




# ★ చిలిపిచేష్టలు ★

వెన్న పెట్టునట్టి అమ్మ
నన్ను జూచి యిట్టు లనియె;
"ముద్దుకృష్ణు డనుచు నిన్ను
ముద్దాడెద నేటి నుండి"—

అనగ వెంటనే మట్టిని
తినగ మొదలు పెడితి నేను.
"ఛీ! పోకిరివాడా" అని
ఛీదరించుకొనియె అమ్మ!

"వెన్న తినెడి నీ కృష్ణుడు
మన్ను తినిన కోపమేల?"
అనుచుండగ అమ్మ నవ్వి
హత్తుకొనియె నెదకు నన్ను.

* * *

"మీ అందరిలోన నేను
మిక్కిలి తెలివైనవాణ్ణి.
నామాటలు వినకుంటే
నరికివేతు"నని మేష్టరు—

"అయితే పంతులుగారూ!
అడిగెద నొక చిన్న ప్రశ్న.
ఆకాశములోన అన్ని
నక్షత్రము లెందులకని
కదలకుండ చంద్రునితో
కలసియుండు చెపుతారా?"
అనుచు అడుగు నన్ను చూచి
"అనవసరపు ప్రశ్న లిట్లు
అడిగిన చెడిపోయెద"వనె.

* * *

"రూపాయి కాగితముల
పాపాయి చించుచుండె,"
అనగ నాన్న కోపముతో
"ఎవరూ! ఆపనిచేసె
వెధవ! చీల్చివేతు" ననుచు
కేక వేయ—పాప బెదరి
కెవ్వమనుచు యేడ్వసాగ!
నవ్వుచు నే నవ్వ డంటి,
"రూపాయితో మీరు నాళ్ళ
నాళ్ళ క్రితం కొన్నయట్టి
తెల్ల కాగితాల పాప
తెగ చింపుచు నున్న"దంటి.
నాన్నగారు తెల్లబోయి
నాదుముఖము చూచి యనెను;
"చిలిపిచేష్ట లికమీదట
చేయబోకు! చెడును వాళ్ళు." ★

—ఆంజనేయులు

# శని ప్రభావం

[illegible] సుబ్బారావుశాస్త్రి

పూర్వకాలం చంద్రావనగరంలో శుద్ధమతి అనే బ్రాహ్మణుడు ఉండేవాడు. శుద్ధమతి గొప్ప పండితుడు, సకలశాస్త్రాలూ చదివినవాడు. ముఖ్యంగా ఆయన జ్యోతిశ్శాస్త్రంలో బాగా ఆరితేరినవాడు.

ఆయన ఒకనాడు ఖాళీగా కూర్చున్నాడు. ఊరికినే కూర్చున్న శుద్ధమతికి తన భవిష్యత్తు ఎలావుందో చూసుకోవాలని బుద్ధిపుట్టింది.

భవిష్యత్తుని చూసుకున్న దగ్గర్నుంచీ ఆయనకి విచారం పట్టుకుంది. ఆయన్ని కొద్దిరోజుల్లోనే 'ఏలినాటి శని' పట్టబోతున్నాడు. ఏలినాటి శని ఏడున్నర సంవత్సరాలు వుండి ముప్పతిప్పలు పెడతాడు.

శుద్ధమతి ఎలాగయినాసరే, శనిగాడి పీడ వదిలించుకోవాలని అనుకున్నాడు. ఎలాగ? శుద్ధమతి బాగా ఆలోచించి ఒక నిశ్చయానికి వచ్చాడు.

అతని నిశ్చయం ప్రకారం, ఆవేళనుంచీ నిద్రాహారాలు మాని కొన్నాళ్ళపాటు 'శనైశ్చరుడి'కోసం తపస్సు చేశాడు.

కొద్దిరోజుల్లోనే శుద్ధమతి తపస్సు ఫలించింది. శనైశ్చరుడు ప్రత్యక్షం అయేడు.

"ఏం కావాలో కోరుకో!" అన్నాడు శనైశ్చరుడు, బ్రాహ్మడిని.

"కొద్దిరోజుల్లో నువ్వు నన్ను పట్టబోతున్నావని తెలిసింది. దయవుంచి నన్ను పీడించకుండా వుంటే చాలు!" అన్నాడు శుద్ధమతి.

"అబ్బే, అదెలాగ? అయినా నువ్వు నా భక్తుడివి కాబట్టి ఏడున్నర నుంచి, మూడేళ్ళకి తగ్గిస్తాను. నిన్ను మూడేళ్ళుమాత్రం పీడిస్తాను," అని చెప్పి అదృశ్యుడయ్యాడు శనైశ్చరుడు.

"మూడేళ్ళ శని" అనగానే మళ్ళీ శుద్ధమతి గుండెల్లో రాయిపడింది. ఎలాగయినా ఈ 'పీడ' వదిలించుకోవాలని అనుకున్నాడు. మళ్ళీ తపస్సు ప్రారంభించాడు.

కొన్నాళ్ళకి శని ప్రత్యక్షం అయేడు. "ఏమిటయ్యా బ్రాహ్మణా ఏం కావాలి?" అని అడిగాడు.

"మీరు నన్ను పూర్తిగా వదిలేయాలి" అంటూ అడిగేడు శుద్ధమతి.

"అలా వీల్లేదు. మూడేళ్ళనుంచి మూడురోజులకి తగ్గించాను. మూడురోజులపాటు నిన్ను పీడించడం ఖాయం!" అని చెప్పేసి అదృశ్యుడయాడు శని.

కానీ, శుద్ధమతి మాత్రం అంతటితో ఊరుకోలేదు. తిరిగి తపస్సు చెయ్యడం ప్రారంభించాడు.

కొన్నాళ్ళకి మళ్ళా శని ప్రత్యక్షం అయేడు. "ఏం బ్రాహ్మడా, నీకు మరేం పనిలేదా?" అని అడిగేడు.

"క్షమించండి! మీరు నన్ను పట్టకుండా వుంటానంటే ఇంతటితో విరమించుకుంటాను" అన్నాడు, చేతులుజోడించి శుద్ధమతి.

"అదెలాగయ్యా! త్రినేత్రుడంతటివాణ్ణే విడిచిపెట్టలేదు నిన్నెలా విడిచిపెట్టేది? ఇక ఆఖరిసారిగా చెబుతున్నాను. నిన్ను ఏడున్నర ఘడియలు పట్టి పీడిస్తాను. ఇక వెళ్ళు! ఈసారి తలకిందులా తపస్సు చేసినా కనిపించేదిలేదు. తెలిసిందా?" అని హెచ్చరించి అదృశ్యుడయాడు శని.

ఇక చేసేదిలేక ఊరుకున్నాడు శుద్ధమతి. ఆవేళనించీ రోజులు లెక్కపెట్టుకుంటూ కూర్చున్నాడు.

శని పట్టేరోజు రానేవచ్చింది. ఆవేళ మామూలుగా స్నానంచేసి, దైవప్రార్థన ముగించుకొని, ఊళ్ళో ఉండడం అంత మంచిది కాదని, ఎవ్వరూ ఉండని అడవికి బయలుదేరాడు. ఆ ఏడున్నర ఘడియలూ అడవిలో కాలక్షేపంచేస్తే శని పీడ విరగడ అవుతుందని అనుకున్నాడు శుద్ధమతి.

అది మండు వేసంగి. కాళ్ళు కాలిపోతున్నాయి. గుండె మండిపోతోంది. గొంతు ఎండిపోతోంది.

దారిలో అతనికి పుచ్చపాదు ఒకటి కనిపించింది. సరే, పుచ్చకాయ తింటే దాహమయినా తీరు

ందని, తోటమాలి కొక రాగి డబ్బు యిచ్చి, ఒక పుచ్చకాయ కొనుక్కున్నాడు.

ఆ పుచ్చకాయలో సగం ముక్కతిని, మిగతా ముక్కని అంగవస్త్రంలో చుట్టుకొని, అడవిదారి పట్టేడు.

అడవిలో జనసంచారం లేని స్థలంలో ఓ చెట్టుకింద కూచొని, భగవంతుడిని ప్రార్థించుకుంటున్నాడు శుద్ధమతి.

అంతలోనే అక్కడికి ఇద్దరు రాజభటులు వచ్చారు. శుద్ధమతిని చూశారు. అతనిపక్కన వున్న మూటమీద వాళ్ళదృష్టి పడింది. మూటనిచూసి వాళ్లునోళ్లు వెళ్లబెట్టారు.

ఒకడు దగ్గరగా వెళ్లి, రక్తంతో తడిసివున్న మూటని విప్పిచూశాడు. ఇంకేముందీ? వాళ్ళు అనుకున్నంత పనీ అయింది. అందులో రాజుగారి కొడుకు తల వుంది. "హారి, దుర్మార్గుడా!" అన్నారు వాళ్ళు.

శుద్ధమతి "నాకేం తెలియదు!" అని మొత్తుకుంటున్నా వాళ్లు అతనిని పెడరెక్కలు విరిచికట్టి, రాజుగారిముందు హాజరుపెట్టేరు.

"ఈ నీచుణ్ణి తక్షణం ఉరితియ్యండి!" అంటూ రాజుగారు ఆజ్ఞాపించారు. ఇదంతా అర్థంగాక భోరుమన్నాడు శుద్ధమతి.

ఆ రాజ్యం రాజుగారి ముద్దుల కొడుకు వేటకివెళ్ళి తిరిగి రాకపోవడం మూలాన్న, రాజుగారు యువరాజు కోసం అని రాజభటులని పంపించారు.

రాజభటులు యువరాజు తలని, శుద్ధమతి అంగవస్త్రంలో చూశారు, వెంటనే శుద్ధమతిని బంధించారు.

# ★ శని ప్రభావం ★

శుద్ధమతికి రాజుగారు ఉరిశిక్ష గలదూ?

విధించారు. అప్పటికి శుద్ధమతిని శనిపట్టి

ఇదంతా 'శని ప్రభావం' అని ఏడు ఘడియలు అయింది. ఇంకో

శుద్ధమతికి తెలుసు. కాన్నీ, ఏంచెయ్యి అరఘడియ అయితే శనివదిలేస్తాడు.



కాన్నీ, ఈలోపునే అతని తల ఎగిరిపోతుంది.

శుద్ధమతికి యేం పాలుపోక— "ఒక్క అరఘడియ భగవంతుణ్ణి ధ్యానించుకుంటాను. అనుమతి ఇవ్వండి!" అంటూ రాజుగారిని అర్థించాడు. శుద్ధమతి అదృష్టవశాత్తూ రాజుగారు 'సరే' అన్నారు.

అరఘడియ కూడా పూర్తి అయింది. "ఇక ఉరితియ్యండి!" అన్నారు రాజుగారు.

అంతలోనే "యువరాజుకీ జై" అన్న కేకలు వినిపించాయి. రాజుగారు వెనక్కి తిరిగిచూశారు. గుఱ్ఱం మీదనుంచి దిగి, అమాంతం వచ్చి తండ్రిని కౌగలించుకొన్నాడు యువరాజు.

రాజుగారు కొడుకు బ్రతికే వున్నందుకు ఆనందిస్తూ, శుద్ధమతి అంగవస్త్రంవైపు చూశారు. చూసి నివ్వెరపోయారు.

అంగవస్త్రంలో యువరాజు తల లేదు సరికదా, నెత్తురు మరకలు కూడా లేవు! పుచ్చకాయ ముక్క ఆ నీటితో తడిసిన అంగవస్త్రం అక్కడ వున్నాయి!

"అయ్యో! నిరపరాధి ప్రాణాలు అన్యాయంగా తియ్యబోయానే!" అంటూ విచారించారు రాజుగారు.

కాన్నీ, శుద్ధమతి జరిగిన విషయం అంతా చెప్పి, "ఇదంతా శని ప్రభావం!" అని చెప్పాడు. ఏడున్నర సంవత్సరాలు పెట్టేబాధ, ఏడున్నర ఘడియల్లోనే పెట్టినందుకు నవ్వుకున్నాడు శుద్ధమతి! రాజుగారికి కూడా నవ్వు ఆగిందికాదు!

★

# గెలుపెవరిదీ?

(17-వ పేజీ తరువాయి)

దాన్నే మొట్టికాయ వేసింది. శంకరం సుశీతో "మరి అక్కా! పదిహేనూ ఎక్కడినుండి తెస్తావే పైగా చీరకూడా కొనేశావ్" అంటే సుభ "బావదగ్గర తీసికొన్న పదిహేనుతోపాటు పందెంఓడిన పదిహేనూ కలిపి మొత్తం ముప్పై చెల్లించుకోవాలన్న మాట" అంటే అంతా నవ్వేం! సుశీ మొహం కంద గడ్డలాగ ఉడికిపోతోంది. అక్కడ నిలవలేక లోపలికి పరుగు పరుగున వెళ్లిపోయింది.

భోంచేసి నాగదిలో అడుగుపెట్టబోతూ ఉంటే నా మంచంమీద డబ్బుపెట్టి నెమ్మదిగా వచ్చేస్తున్న సుశీ కనబడింది. చెయ్యి పట్టుకొని "ఏమిటి సుశీ" అన్నాను లాలనగా. "గెల్చావుగా" అంది ఏడుపురాబోయే కంఠంతో. గడ్డం పట్టుకొని తల ఎత్తాను. "పదిహేనుతో సరిపెడదామనుకొన్నావా?" అంటూ మెరుస్తున్న కనకాంబరం చీరవైపు చూశాను. "క్షమించు బావా" అంటూ కళ్లు జలపాతాలు చేసేసుకొంది. "పిచ్చిపిల్లా" అంటూ "ఇక నెల్లాళ్ళలో ఈచీరతోపాటు నిన్నూ, నీ సర్వస్వమూ నేను గెల్చుకొంటున్నాను తెలుసా!" అని "ఇంత కష్టపడతావని తెలిస్తే అసలు చూపించకపోదును సుశీ! ఊరికే చెప్పేదానికంటే చూపిస్తే తమాషాగా ఉంటుందని......అయినా నువ్వే కాదుగా; నేనూ అది కాటిలైటే అనుకొన్నా...ఛీ ఛీ...ఇంత సిల్లీ విషయానికెవరైనా ఏడుస్తారా...ఏడవకు" అన్నాను.

అంతలోకే సుభ అటు రాబోతూఉండడం గమనించిన సుశీ నీటిబిందువులతో మిలమిలాడుతున్న పెద్దకళ్ళ నొకసారి నావైపు మెరిపించి, 'తప్పు' అన్నట్టు ముక్కుమీద వేలు పెట్టుకొని సూచించి, పరుగెత్తింది.

"ప్రణయ జ్యోతులు వెలిగించవోయ్" అన్న సత్యం మాటలు జ్ఞాపకం వచ్చాయి. పెళ్ళికాకుండానే దివ్యానుభూతిని కలిగించిన మా బెలూన్ కాటిలైటుకి ధన్యవాదాలర్పించుకొన్నాను మనస్సులోనే.

★

# చంద్రహారం

(23వ పేజీ తరువాయి)

విజయ చేతులు పట్టుకొని 'విజయా! మధ్యాహ్నము నేను నీ విషయంలో మృగప్రాయంగా ప్రవర్తించాను. ఇంకెన్నడూ అటువంటి పనిచేయను. నన్ను క్షమించగలవా విజయా!...'అంటూ వెక్కివెక్కి ఏడ్చాడు మోహనరావు. ఈ మాటలు విన్న విజయకు తన బాధ దుఃఖాన్ని మర్చిపోయి చిరునవ్వుతో భర్తను ఓదార్చింది.

"విజయా! పొద్దున్న ఆఫీసుకు వెళ్ళిన దగ్గర్నుంచి నా మనస్సులో ఏదో చెప్పలేని ఆందోళన కలిగింది. శంకరం ఎదురుగా వచ్చి క్షమించమని కోరినట్లు—ఆ విషయా లన్నీ జ్ఞాపకము వచ్చాయి. ఆఫీసులో ఏమీ పని చేయలేకపోయాను. ఇంటికి వచ్చిన వెంటనే నీ చంద్రహారాన్ని తాకట్టుపెట్టి, డబ్బు తెచ్చి, డాక్టరు జగన్నాధరావుగారినికూడా తీసుకొని శంకరం యింటికి వెళ్దామనుకొన్నాను. వాడి జ్వరం పూర్తిగా తగ్గిపోయేదాకా మనము అక్కడే వుండి, ఆ తరువాత యిదివరకులాగునే అందరమూ కలసి ఒకే యింట్లో వుండాలనుకొన్నాను. ఇన్నాళ్లు వాణ్ణి చూడకుండా ఎల్లా వుండగలిగానో నాకే తెలియదు. వాడు డబ్బులేక చాలా అవస్థపడుతుంటే చూడలేక రఘు యాభయి రూపాయలు యిచ్చాడుట. ఇవాళేనా వెళ్ళిచూడమని, వాడు నాకోసం కలవరిస్తున్నాడని, రఘు మరీ మరీ చెప్పాడు. తీరా యింటికి వచ్చేటప్పటికి చంద్రహారం పోవటముతో నాకు మతిపోయింది. నాకు తెలుసున్నవాళ్ళందరినీ మళ్ళీ వెళ్ళి అప్పుకోసం బ్రతిమాలాను. కాని ప్రతివాడూ 'నెలాఖరు' అన్నవాడేకాని ఏమి యిచ్చినపాపాన పోలేదు. డాక్టరు ఫీజుచెల్లించలేక కల్యాణి చాలా బాధపడుతోందిట" ... ఇంక మాట్లాడలేకపోయాడు.

ఎక్కడో...కలలో...విన్నట్లుగావుంది విజయకు. తన భర్తేనా తనతో మాట్లాడుతున్నదని ఆశ్చర్యపడింది. తను చంద్రహారాన్ని అడిగింది రేస్ కోసంకాదని శంకరం కోసమేనని గ్రహించి తన భర్తలోని మార్పుకు విజయ చాలా సంతోషించింది. వెంటనే భర్త కాళ్ళమీద పడి "నేనొక విషయం చెప్తాను, కోపగించుకోరు కదా!' అంది.

విజయను లేవదీసి "జన్మలో ఇంకెవరిమీద కోపగించుకోను. నీ మీద ఒట్టు. చెప్పు," అన్నాడు మోహనరావు.

"మీరు పొద్దున్న ఆఫీసుకు వెళ్లిన తరువాత నేను శంకరాన్ని చూడటానికి వెళ్లాను. కల్యాణి తనబాధంతా చెప్పింది. వాళ్ల పరిస్థితి చూడలేక మీ తరఫున మన చంద్రహారాన్ని కల్యాణికి ఇచ్చి, ఎక్కడేనా తాకట్టు పెట్టించి కావలసిన మందులన్నీ కొనిపించమని చెప్పివచ్చాను. నిజము చెబితే మీరు కోపగించుకొంటారని భయపడి మీతో చంద్రహారము పోయిందని అబద్ధమాడాల్సివచ్చింది. మీతో చెప్పకుండా స్వతంత్రించి నే నీపని చేసినందుకు నన్ను క్షమించండి," అంది వినయంగా విజయ.

"విజయా! ఎంత వివేకవంతురాలివి! నిన్ను అర్థంచేసుకోలేక నిన్ను చాలాకష్ట పెట్టాను. నీకున్న జ్ఞానము, దూరదృష్టి, తెలివి తేటలు నాకు వున్నట్లయితే నేను ఏనాడో బాగుపడి వుండేవాడిని. చాలా మంచిపని చేశావు. బయలుదేరు శంకరం ఇంటికి. ఇకనుంచీ అంతా కలసి ఒకే ఇంట్లో వుందాము. నువ్వు నాతో చెప్పకుండా కల్యాణికి చంద్రహారము ఇచ్చినందుకు నీ కిదే శిక్ష" అంటూ ఆమెను గాఢంగా కౌగలించుకొన్నాడు మోహనరావు. "చాల్లెండి మీ చిలిపిచేష్టలూ మీరూను" అంటూ పట్టు విడిపించుకొని, బట్టలు మార్చుకోనేటందుకు లోపలికి వెళ్లింది విజయ.

★

## దగాపడిన తమ్ముడు

(28-వ పేజీ తరువాయి)

చేశాడు.

క్రిందపడ్డ అధికారికళ్ళు కేవురించాయ్. "పట్టుకోండి! బేడీలు వెయ్యండి!" అని అరిచాడు. చుట్టుముట్టి పోలీసులను విసరి తన్నాడు. మండిపోతున్న కడుపుతో, నోరు యేమంటుందో తనేంచేస్తున్నాడో తెలుసుకోలేక, బీభత్సంగా మెసులుతున్నాడు. ఇంతలో నీలి పరిగెత్తుకవచ్చింది. కాలరుద్రుడిలా విహారంచేస్తున్న భర్తనుచూసి భయం వేసింది. ఉయ్యాలలో పిల్లాడు కేకలుపెట్టి యేడుస్తున్నాడు. ముసలమ్మ ఇటువేపు చూడలేకపోతూంది. నలుగురు పోలీసులు పటాపంచలు కావడానికి ఇంకెంతసేపోలేదు. వాళ్ల లాఠీలు, పుల్లయ్య రాకెట్ లా తిరుగుతున్న బాహాక్రమముందు ఆగలేకపోయాయ్! అంతా తూగిపోతున్నారు!

నీలి ఆ కోలాహలంలో తలమీద గంప క్రిందపెట్టి, చప్పున పరుగెత్తి, మొగుడు కాళ్లు పట్టుకొంటూ, యేమంటుందో ఆ కోలాహలంలో యెవరికీ వినపడలేదు. ముఖంలో ముచ్చెమటలుపోశాయ్. ఆ చెమటక్రింద నున్న పెళ్లంమీద పడుతోంది. చుట్టూవున్న ప్రజ ఇప్పుడు కనిపించారు తన కంటికి. కాళ్ల దగ్గర వున్నది తన పెళ్ళామేనని ఇప్పుడు గుర్తుకువచ్చి విసిరితన్నలేదు. ఆమెవైపు చూడగానే తనేదో నేరంచేశానేమోనన్న తలపు మనసులో చొచ్చుకపోయింది. ఇక్కడే, ఇంతమంది మాట్లాడుతున్నా, కొడుకు యేడుపు చెవులోనికి చొచ్చుకో పోసాగింది. ఇంతవరకూ తను ఈ ప్రపంచంలో లేనట్లనిపించింది. దెబ్బలు తగిలిన పోలీసులు మెల్లగా దగ్గరగా చేరుకుంటున్నారు. వాళ్ళవేపు చూడగానే ఎందుకో కనికరంవేసింది. ఈ కండలు లేనివాళ్ళ మీదనా తన బలం ఇంతసేపూ చూపించింది!" అనుకున్నాడు.

గబగబ అక్కడనుంచి కదలబోతూంటే, పోలీసులు పట్టుకున్నారు. వాళ్ళను విదిలించుకుంటూ ఇంటిలోనికి పరిగెత్తి, ఉయ్యాలలో ఏడుస్తున్న కొడుకుని ఎత్తుకుని. ముద్దులాడుతూ, "మల్లా నిన్ను కొట్టుదగ్గర పెట్టాను కాదురా! ఈ యేల నీ అయ్య, నీసం తీనోలతో దెబ్బలాడాడు—యీ నీసంవుంది యెందుకు?"

కొడుకు ఇదంతా తనకే అని విని అర్థం చేసుకున్నట్లు తండ్రి వేపుచూశాడు. ఒళ్ళంతా సంతోషంతో ఆడించేశాడు. కానీ ఆ నిముషంలో ఇల్లంతా ఘొల్లుమంది. చేతికి బేడీలు పడినపుల్లయ్య, అదేపనిగా కయ్ మంటున్న మల్లు వేపుచూస్తున్నా, ఇంకా చూడటానికి కూడా వ్యవధిలేకపోయింది.

చేతులతో బేడీలతో నే నీలివైపు చూసాడు. ఆమె కళ్లనిండా నీళ్ళున్నాయ్. ఆమె కళ్ళు తనవైపు చూసి దాచగానే, తనేదో నేరం చేశానని అనుకోసాగాడు. అలానే ఇల్లు కదిలి, నడి వూరుగుండా సంకెళ్ళతో నడుస్తూంటే, దీనికంతటికీ కారకుడైన రాజిగాడు ఇంటి అరుగుమీద నిల్చుని చూసి సంతోషించాడు. ★

ఇంకా వుంది.

## ★ అపాయంలో ఉపాయం ★

(19-వ పేజీ తరువాయి)

ఆనందం ప్రకటిస్తూ — "ఎంచేతసార్" అన్నాడు శ్రీరామం.

"రామం-శ్రీరామం-రామం-అంటూనే వదిలాడయ్యా ప్రాణాల్ని. అదుగో-అలా చూడు. ఆఅరుగుమీద చూడు-మీ బంధువులు" అని దబాయించాడు పార్వతీశం. వియ్యంకుడుగారు అందుకున్నాడు-"నిజమేనండి రామంగారూ-రామ-రామ-శ్రీరామ-అంటూనే వదిలాడండి ప్రాణాలు" అంటున్నాడు వియ్యంకుడు.

"అన్నీ తెలుసుకున్నానయ్యా, భోగట్టా పూర్తిగా చెప్పాడు. ఏం పలవరింత. ఒక్కసారి మా శ్రీరామాన్ని చూపించరూఅన్నాడు. వస్తాడు-తప్పకవస్తాడు-కబురందితే యింత సేపుంటాడా-బయలుదేరే వుంటాడు. ఏం ఫరవాలేదని చెబుతూనే వున్నాను. ఇట్టే ముంచుకువచ్చిందోయ్ శ్రీరామం.ఏంచెప్పను హఠాత్తుగా అలా చెప్తూ చెప్తూ యిలా ప్రాణం వదిలేశాడు. ధన్యజీవి-ఆయనకోసం నువ్వు విచారించడం వట్టి అవివేకం. వద్దు-ఏడవవద్దన్నాను. మింగెయ్యాలి దుఃఖాన్ని" అన్నాడు పార్వతీశం. "ఈ తనువులు అశాశ్వతమండీ" అన్నారు వియ్యంకుడు.

"కాని ప్లీడరుగారూ నాకు ఏడుపే రావటంలేదండీ - ఇతడికీ - నాకూ ఏమీ సంబంధంలేదండీ-మీరు చెప్పేది అయోమయంగా వుందిసార్" అన్నాడు శ్రీరామం. "నీకు ఏడుపు రావటంలేదన్నా సంబంధం సందేహంగా వుందన్నా నేనేం చెయ్యాలి చెప్పు. నేను అబద్ధం చెప్పటం లేదయ్యా. మీ బంధువు. నీపేరు,నీ పెళ్ళాంపేరు మీనాన్న పేరు-మీ అమ్మపేరు ఇన్నీ చెప్పాడు. ఏదో ఊరన్నాడు. వాడికి బ్రహ్మాండమైన ఇల్లూ-పాడీ - పంటా వున్నాయట. ఎంతో డబ్బు మూలుగుతూ వుందట పెట్టెల్లో. వారసులెవరూ లేరట. చూడగా చూడగా నువ్వే ఆయన వారసుడివట. ఈ పట్టాభిషేకం నీకే చేయాలన్నాడు. కావలిస్తే మా బావగారి నడుగు" అనేసరికి వియ్యంకుడుగారు అదంతా నిజం అన్నారు.

శ్రీరామానికి ఎప్పుడో ఏ జ్యోతిష్కుడో చెప్పినమాటలు ఖర్మచాలక యీ ప్లీడరుగారి చెవులోవడేశాడు. ఆ జ్యోతిష్కుడు ఏమన్నాడో తెలుసా వారసత్వపు ఆస్తి కావలసినంతది అయాచితంగా వచ్చి కలుస్తుందని. ఇవన్నీ సింహావలోకనంచేస్తే కొంత ఆశకి అవకాశం శ్రీరామం యిచ్చినట్లు తెలుస్తోంది.

"అలాగైతే ఏం చెయ్యమంటారండీ" అన్నాడు శ్రీరామం. "ఏం చేయ్యడం ఏవిటి-ఈ జాతియొక్క మరణ సమయంలో నువ్వున్నావని మేమిద్దరం కోర్టులో సాక్ష్యం యిస్తాం. అతని యావదాస్తికీ వారసుడవు నువ్వేనని అతడు మరణ సమయంలో పెద్ద మనుష్యులమైన మా ఎదుట నీతో చెప్పినట్లు ఋజువుచేస్తాం. ఆయన భౌతిక దేహానికి అంత్యక్రియలు నీవు చేయిస్తే-కర్మచేసిన వాడికే హక్కు. ఆ హక్కుదారుడివి నీవేనని మన వూరంతా సాక్ష్యం యిస్తుంది. జంకొద్దు శ్రీరామం. తెగించు" అన్నాడు పార్వతీశం.

పార్వతీశం పెట్టిన ఆశ ఇంతాఅంతా కాదు! శ్రీరామానికి మతిపోగొట్టింది. వారసత్వపు ఆస్తిమీద భ్రమహెచ్చింది. పార్వతీశంగారి మాటలమీద మోజు కుదిరింది. అంతా సత్యంగానే కనిపించింది. కేవల కల్పితమైన బాదరాయణ సంబంధంతో శ్రీరామం-ఆ అనాధప్రేతానికి దహనక్రియలు యథాశాస్త్రీయంగా జరిపించాడు. డబ్బుకు వెనుకంజవేయకుండా తనకోసం తహతహలాడి తనువు చాలించిన ఆ బంధువుకి తానే వారసుడని ఆ ఆస్తి ఎప్పటికైనా తనకి దక్కుతుందని గాలిమేడలు కట్టుకుంటూ-ఎంతో అన్నదానం - గోదానం ఆడంబరంగా చేశాడు. ఆస్తి వివరాలు అతనికి అయోమయంగా వున్నా—

రోజులు గిరగిర తిరుగుతున్నాయి. శ్రీరామానికి ఆబంధువు వివరాలే తెలియటంలేదు. పార్వతీశంగారు - విషయం పాత బడటం మొదలుపెట్టాక శ్రీరామానికి సంతృప్తికరమైన సమాధానాలే మానుకున్నాడు. ఏరు దాటిన తర్వాత తెప్ప తగలేసే మనుష్యుల్ని శ్రీరామం జ్ఞప్తికి తెచ్చుకున్నాడు.

శ్రీరామం తరుచూ పార్వతీశం యింటికి వస్తూంటే ఓనాడు కాశీపతి పకపకా నవ్వాడు. కాశీపతి నవ్వుతూంటే పార్వతీశం యింకా పకపక నవ్వాడు. అటు ఆ నవ్వూ యిటు యీ నవ్వూ మధ్య తన వారసత్వపు ఆస్తి విషయం కూడా నవ్వులాటగానే వుందని శ్రీరామం చివరకు గ్రహించాడు!! "నవ్వితే లాభంలేదు—అపాయంలో-ఉపాయం తట్టాలి" అని యిప్పటికీ రావమ్మగారు అంటోంటుంది-కొడుకుతో. ★




## బొంబాయి సినిమా లేఖ

దక్షిణ భారతం నుండి, అందాల భరిణె లనిపించుకున్న తారలు ముగ్గురు ఈమధ్య బొంబాయి వచ్చారు. ఒకామె, తెలుగు, తమిళ చిత్రసీమలకు అగ్రశ్రేణి రాణి అంజలీదేవి. అంజలీ పిక్చర్స్ వారు తెలుగు తమిళాలలో నిర్మించిన 'సువర్ణసుందరి' అపూర్వవిజయం సాధించడంతో, ఇప్పుడు ఈ చిత్రాన్ని వీరు హిందీలో నిర్మిస్తూ వుండడం తెలిసిన సంగతే. ఈ వ్యవహారం మీదనే, నిర్మాత, సంగీత దర్శకుడు ఆదినారాయణరావు బొంబాయి వచ్చారు. అనుకోకుండా దొరికిన నాలుగురోజుల తీరుబాటును సద్వినియోగం చేసుకోవడానికి ఇదే అదనని అంజలీదేవి కూడా, రెండు రోజుల తరువాత బయల్దేరి వచ్చి భర్తను కలుసుకుంది. బొంబాయి నగరానికి, ఉత్తరాది ప్రేక్షకులకూ ఆమె కొత్త కాదు. ఈమధ్య విడుదల అయిన 'ఉస్తాద్' చిత్రంలో ఈమె అశోక్‌కుమార్‌కు నాయికగా నటించి, మంచి పేరూ, ప్రేక్షకుల అభిమానం సంపాదించుకుంది. ఇప్పుడు 'సువర్ణసుందరి' హిందీ చిత్రంలో కూడా ఆమే నాయిక. ఈ చిత్రానికి ఇంతకన్న చక్కని పేరు దొరికితే తప్ప, ఉన్న పేరును మార్చడం అనవసరమని నిర్మాత ఆదినారాయణరావు, ఆయన భార్య అంజలీదేవికూడా అభిప్రాయపడుతున్నారు. ఈసారి ట్రిప్పులో వీరు హిందీ చిత్రానికి కొత్తగా బుక్ చేసిన నటులు శ్యామ, వి. యస్. జోహార్,



దీప్ అండ్ ప్రదీప్ వారి 'పోలీస్' చిత్రంలో ప్రదీప్‌కుమార్, మధుబాల.

# బొంబాయి సినిమా లేఖ

ఆగ్

బొంబాయి వచ్చిన మిగతా ఇద్దరూ సింహళ తారలు ఒకామె కేవలం ఈవూరు, ఇక్కడి వింతలూ చూసి కులాసాగా కాలక్షేపం చేసిపోవాలన్న సరదాతో వచ్చింది ఆమె పేరు రంజని గుర్రప్పందాలంటే ఈమె పంచప్రాణాలూ పెడుతుంది మద్రాసులో తయారవుతున్న సింహళచిత్రము 'సుభద్ర'లో నటిస్తూ, నాలుగు రోజులు సెలవు కావాలని చెప్పి, బొంబాయి రేసుల వేళకు వచ్చింది ఆరోజున ఆమెవెంటఉన్న వారూ, కన్నవారూ, విన్నవారూ, "రంజని పందెం ఒడ్డిన గుర్రం గెలిచిందనీ, ఆమె ఉత్సాహం చూసి, ఓడిపోవటం ఆ గుర్రానికి మనస్కరించక పట్టుపట్టి నెగ్గిందనీ" ఛలోక్తిగా అన్నారు

ఇంకో నటి రుక్మిణీదేవి జయమ్మకసే. ఈవిడ ముఖ్యంగా పనిమీద వచ్చింది. పూనా, ప్రభాత్ స్టుడియోలో తయారవుతున్న 'దైవయోగ' చిత్రంలో నటిస్తూంది. చాలా హుషారుగా, ఎప్పుడూ నవ్వుతూ పేలుతూ ఉంటుంది. పిక్నిక్‌లూ, పార్టీలూ అంటే చాలా ఇష్టం. బొంబాయిలో తారలందరికీ రుక్మిణీదేవి అంటే అంతకన్నా ఇష్టం.

'మూతి బిగించుకు, డాబూ, దర్పం ఒలకపోసేవాళ్ళ పోకడలు ఏమీ లేకుండా ఇంత కలిసికట్టుగా ఉండేది ఈమె ఒకర్తే అంటున్నారు ఇక్కడివాళ్ళు. కారణం: రుక్మిణీదేవి, మంచిచదువూ సంస్కారం గల పెద్ద కుటుంబంలో పుట్టి పెరిగింది కావడమేను. అంచేత ఆమెకు నలుగురితో కలసి సరదాగా హుషారుగా కాలక్షేపం చేయడం. అంత బాగా తెలుసు' అంటున్నారు వాళ్లు.

* * *

ఇటీవలి విశేషాలలో బి. ఆర్. చోప్రా చిత్రం 'నయాదౌర్' రజతోత్సవం, ఒకటి. ఉత్సవాలకు శ్రీ మంగళ్‌దాస్ పక్వాసా అధ్యక్షత వహించారు. ఈ చిత్రంలో పని చేసిన వారందరికీ, తలొక 'ట్రోఫీ' బహుమతి ఇచ్చారు. దర్శకనిర్మాత చోప్రా పని వారందరికీ బోనసు ఇస్తున్నట్లు ప్రకటించారు. ఈ చిత్రవిజయానికి ముఖ్యకారకులలో ఒకడైన సంగీత దర్శకుడు ఓ. పి. నయ్యర్ మటుకు సభకు రాలేదు. బి. ఆర్. ఫిలింస్ తరువాతి చిత్రం 'సాధన'కు సంగీతం కూర్చమని చోప్రా కోరగా, నయ్యర్ అందుకు నిరాకరించాడనీ, అందువల్ల వారిద్దరు వేరయ్యారనీ తెలిసింది.

* * *

లండన్‌లోని ఆసియా చలనచిత్ర సంస్థ ఈ మధ్య నిర్వహించిన భారతీయ చలనచిత్రోత్సవ సందర్భంలో ప్రేక్షకులచేత ఓట్లు వేయించి, వాటిలో ఉత్తమచిత్రాలను కళాకారులను ఎన్నిక చేసింది. ఫలితాలు

ఉత్తమచిత్రం "ప్యాసా" ఉత్తమనటుడు దేవానంద్ (పేయింగ్ గెస్ట్ సి ఐ డి. చిత్రాలలో నటనకు), నటి నూతన్ (సీమా) దర్శకుడు గురుదత్ (ప్యాసా) సంగీతదర్శకుడు: సచిన్‌దేవ్ బర్మన్ (పేయింగ్ గెస్ట్, ప్యాసా)

## ఇటీవలి చిత్రాలు

ఇటీవల విడుదల అయిన చిత్రాలలో చెప్పుకోతగ్గవి

ముజ్రిం షమ్మీకపూర్, రాగిణి, గీతాబాలి, పద్మిని నటించారు

ఫాగన్ ప్రదీప్‌కుమార్, మాలా సిన్హా జబీన్, చంద్రశేఖర్

లైట్‌హౌస్ అశోక్‌కుమార్, నూతన్

ఏక్‌సాల్ అశోక్‌కుమార్, మధుబాల

### 'ముజ్రిం'

ఈనాలుగింటిలోను బాక్సాఫీస్ హిట్ అన్నమాట వర్తించేది ఒక్క "ముజ్రిం"కు మాత్రమే మొదటినుంచిచివరివరకు ఉత్కంఠను కట్టుదిట్టంగా కట్టుకువస్తూ స్క్రీన్‌ప్లే

(56-వ పేజీ చూడండి)



'రాజా బేటా'లో

కామినీకౌశల్, మాస్టర్ డబ్బూ.



అమ్మాయికి అబ్బాయి నచ్చినా చిక్కే—రిపబ్లిక్ వారి "పెళ్ళిసందడి"లో నాగేశ్వరరావు, సరోజాదేవి.

# 1958 లో ఎం. జీ. ఎం. చిత్రావళి

ఈ ఏడాది ఎం. జీ. ఎం. స్టుడియో పేరిట నిర్మాణంలో ఉన్న చిత్రాలు పెద్దవి చిన్నవి కలిసి 26. మరి 80 చిత్రాలకు స్క్రిప్టు రచన పూర్తికావస్తోంది. అంటే, ఈ ఏడాది ముగిసేసరికి ఒక్క ఎం. జీ. ఎం. పేరిట మాత్రమే విడుదల అయేవి 50 చిత్రాలు ఉంటాయన్న మాట.

వీటిలో ఎన్నదగినది: 'బెన్‌హర్'. అమెరికాలో బాగా అమ్ముడుపోయిన నవల దీనికి మాతృక. 'రోమన్ హాలీడే', 'సబ్రీనా' చిత్రాలు తీసిన ప్రముఖ దర్శకుడు విలియం వైలర్ దీనికి దర్శకత్వం నిర్వహిస్తారు. ఎం. జీ. ఎం. సంస్థ కొత్తగా నిర్మించిన "కామెరా 65" (65 మిల్లిమీటర్ల ఫిలిం)తో ఈ చిత్రం షూట్ చేస్తారట. భారీ సెట్లతో తయారుకానున్న ఈ చిత్రానికి కొంత, ఇటలీలోనూ, మరికొంత ఉత్తరాఫ్రికాలోను కూడా 'షూటింగ్' జరుగుతుంది. నిర్మాత శామ్ జింబాలిస్ట్.

పులిట్జర్ బహుమతి సందుకొన్న టెనసీ విలియంస్ నాటకం 'క్యాట్ ఆన్ ఎ హాట్ టిన్ రూఫ్'ను కూడా చలనచిత్రంగా నిర్మిస్తారు. ఇందులో ఎలిజబెత్ టేలర్, పాల్ న్యూమన్, జాక్ కార్సన్ నటిస్తారు. దర్శకుడు రిచర్డ్ బ్రూక్స్.

'ఫ్రం హియర్ టు ఇటర్నిటీ' రచయిత జేమ్స్ జోన్స్ వ్రాసిన కొత్తనవల 'సమ్ కేమ్ రనింగ్' మరో చిత్రం.

డాఫిన్ డూ మారియర్ నవల 'స్కేప్ గోట్' ఆధారంగా మరొక చిత్రం తయారవుతోంది. అందులో ప్రముఖ బ్రిటిష్ నటుడు అలెక్ గిన్నెస్ ముఖ్యనటుడు. ఇది ఇంగ్లాండులో నిర్మింపబడుతుంది.

విలియం ఫాక్నర్ నవల 'ది అన్‌వాన్‌క్విష్డ్'కు స్క్రిప్టు రచన జరుగుతోంది.

ఆల్‌ఫ్రెడ్ హిచ్‌కాక్ ఈ ఏడాది రెండు చిత్రాలు తీస్తారు. అవి: 'నార్త్ వెస్ట్ బై నార్త్', 'ది రెక్ ఆఫ్ ది మేరీ డియరీ'.

నిర్మాణం పూర్తిఅయి విడుదలకు సిద్ధంగా ఉన్న చిత్రాలలో ముఖ్యమైనది. దాస్తొయెవ్‌స్కీ నవల ఆధారంగా తయారైన 'ది బ్రదర్స్ కారమజోవ్' ఇందులో యూల్ బ్రైనర్, మరియా షెల్, క్లైర్ బ్లూం, లీ జె. కాబ్, ఆల్బర్ట్ సాల్మి, రిచర్డ్ బేస్‌హార్ట్, విలియం షాట్నర్ మొదలగు వారు నటించారు.

అగ్రశ్రేణి నటులు పాల్గొన్న ఇతర చిత్రాలు:

'ఇన్‌ఫమీ ఎట్ సీ', 'క్రై టెరర్'—జేమ్స్ మాసన్.

'ది రిలక్టెంట్ డెబుటాంటే'—రెక్స్ హారిసన్, కే కెండాల్.

'ఐ థాంక్ ఎ ఫూల్'—ఇన్‌గ్రిడ్ బెర్గ్‌మన్ ముఖ్యనటి.

'గిగీ'—మారిస్ షెవాలియర్, లెస్లీ కెరాన్.

"ది సేఫ్ క్రాకర్—రే మిల్లాండ్ (దర్శకత్వం సహా).

"ఐ ఎక్యూజ్", "ది హై కాస్ట్ ఆఫ్ లవింగ్"—జోసే ఫెరర్. (దర్శకత్వం కూడా).

'మెర్రీ అండ్రూ'—డానీ కేయీ. ★

# "పథేర్ పాంచాలీలో సెక్స్ అప్పీల్ లేదు"

## అమెరికన్ 'కళాలయాల' విమర్శ

మానవ హృదయాన్ని అత్యుత్తమంగా చిత్రించిన కళాఖండంగా, ప్రపంచంలోని ఉత్తమోత్తమ చిత్రాలలో ఎన్నదగినదిగా దేశదేశాలా ప్రశంసలూ, అంతర్జాతీయ చలన చిత్రోత్సవాలలో బహుమతులూ గడించుకొన్న భారతీయ చిత్రం 'పథేర్ పాంచాలీ', అమెరికాలోని మాన్‌హాటన్ నగరంలో ప్రదర్శనకు అయోగ్యం అనిపించుకుంది! అక్కడ 86 థియేటర్లు, కేవలం కళాత్మకమైన చిత్రాలనే వేస్తాయని ప్రతీతి. కాని, ఆ కళాలయాల యజమానుల 'కనక ప్రమాణాలకు' ఇది ఆనలేదు కనక, ఇది పనికి రాలేదన్నారట.

"వారు చెప్పిన కారణం: 'పథేర్ పాంచాలీ'లో సెక్స్ అప్పీల్ లేదు."

ఇంకో కళాపోషకుడి భావం: "బాగానే ఉంది కాని, అందులో ఓ చిన్నపిల్ల చచ్చిపోతుంది."

మరో పెద్దమనిషి విమర్శ: ఇందులో పేద రైతులు గుడిసెల్లో కాపురం ఉంటారు. నా సినిమాకొచ్చే వాళ్లు పార్క్ ఎవెన్యూ (ధనవంతుల పేట)లో ఉండే వాళ్ళు."

మాన్‌హాట్టన్ నగరంలో 'ఆర్ట్ హౌసెస్' అనబడే ఈ 86 సినిమాలూ, అమెరికాలోని మిగతా వేలాది సినిమాలకు కొలమానాల వంటివి. ఇక్కడ చెల్లనిచిత్రం ఇంకెక్కడా మారదు. అందువల్ల 'పథేర్ పాంచాలి'కి కూడా ఆ అవకాశం పోయినట్టే.

ప్రస్తుతం ఈ 'కళాలయాల'లో ఆడుతున్న చిత్రాలు:

'ఆడల్టరెస్' (జారిణి)—

'ఎండ్ గాడ్ క్రియేటెడ్ ఉమన్' 'ది బ్రైడ్ వజ్ టూమచ్ బ్యూటిఫుల్' 'రైట్ ఎక్రాస్ ది స్ట్రీట్'. పై మూడు చిత్రాలలో ప్రత్యేకాకర్షణ 'సెక్స్‌క్వీన్' 'బ్రిగిట్ బార్డాట్'.

సిన్స్ ఆఫ్ కాసనోవా: (ఘోరమైన రకం పాపాలు అని ప్రత్యేక వివరణ.)

అమెరికన్ పత్రిక టైమ్ ఈ థియేటర్ల ధోరణి హేళనచేస్తూ "ఇది ఆర్ట్ హౌసెస్ కావు; టార్ట్ హౌసెస్" (కళా నిలయాలు కావు కళావంతుల నిలయాలు అని తాత్పర్యం) అని వ్రాసింది. ★



బిమల్ రాయ్ చిత్రం "మధుమతి"లో దిలీప్ కుమార్

# ఉత్తమ చిత్రాల నిర్ణాయక సంఘాలు

రేపు ఏప్రిల్‌లో ప్రభుత్వం బహుమతు లిచ్చి సత్కరించతగు ఉత్తమ చిత్రాలను ఎన్నిక చేయడానికై నెలకొన్న కేంద్ర సంఘానికి, బీహార్ మాజీ గవర్నర్ శ్రీ ఆర్. ఆర్. దివాకర్, అధ్యక్షులుగా వ్యవహరిస్తారు. ఇందులో సభ్యులు:— శ్రీయుతులు బి. వి. వరేర్కర్, ఆర్. డి. సిన్హా దినకర్, శ్రీమతులు సుచేతా కృపలానీ, అమ్ముస్వామినాథన్. వీరు కాక పరిశ్రమ ప్రతినిధులు ముగ్గు రుంటారు.

వీరు వివిధప్రాంతీయ సంఘాలు సిఫార్సు చేసే చిత్రాలన్నీ చూచి వాటిలో రాష్ట్రపతి ప్రధాన మంత్రుల పేరిట ఇచ్చే సువర్ణ పతకాలకు అర్హమైన చిత్రాలను ఎన్నిక చేస్తారు. వీరు కాక, మద్రాసు, బొంబాయి, కలకత్తా ప్రాంతీయ సంఘాల అధ్యక్షులు కూడా కేంద్ర సంఘంలో సభ్యులుగా ఉంటారు.

మద్రాసు ప్రాంతీయ సంఘానికి శ్రీ పి. టి. రాజన్ అధ్యక్షుడు. సభ్యులు: శ్రీయుతులు కె. చక్రవర్తి, కె. కెతగోపన్, మాస్తి వెంకటేశ అయ్యంగార్, ఎస్. ఎం. శ్రీరాములు నాయుడు, వి. శ్రీనివాస్, ఎ. రామయ్య, శ్రీమతి ఎస్. మంజుభాషిణి.

ఈ ఏడాది పోటీకి మొత్తం 62 చిత్రాలు వచ్చాయి.

1954 లో ఈ బహుమతి ప్రదానం ఆరంభమైన తరువాత, నేటి వరకూ ఇన్ని చిత్రాలు పోటీకిరావడానికి ఇదే తొలిసారి.

ఈ ఏడాది మరో విశేషం సువర్ణ పతకాలూ, అఖిల భారత స్థాయి ప్రశంసా పత్రాలూ లభించిన చిత్రాలకు నగదు బహుమతులు ఇవ్వాలని ప్రభుత్వం నిశ్చయించడం.

ఇందులో అపశ్రుతి: ప్రాంతీయస్థాయిలో రజత పతకాలు బహుమతిగా సంపాదించే చిత్రాలకు నగదు బహుమతుల సదుపాయం లేకపోవడం.

ప్రభుత్వం తలపెట్టిన ఈ సత్కార్యం లక్షణంగాను, నిండుగాను, సర్వులకూ సంతోష ప్రదాయకంగానూ జరగాలంటే, ప్రాంతీయభాషా చిత్రాలకు కూడా సముచితంగా నగదు బహుమతులు ఇచ్చి ప్రోత్సహించడం అవసరం.

* * *



ప్రసాద్ ఆర్ట్ పిక్చర్స్‌వారి 'వీర ప్రతాప్'లో శివాజి గణేశన్.

## 'వీర ప్రతాప్'

ప్రసాద్ ఆర్ట్ పిక్చర్స్ వారి, 'వీర ప్రతాప్' ఈ నెలాఖరులోగా విడుదల కాగలదని తెలుస్తూంది. కన్నాంబ, పద్మిని, రాగిణి, హెలెన్, శివాజీ గణేశన్, తంగవేలు, నంబియార్, ఎం. కె. రాధ, మొదలగు వారు పాల్గొన్నారు. గణేశన్ రెండు భూమికలు నిర్వహించాడు.

దీనికి మాటలు పాటలు శ్రీ శ్రీ వ్రాశారు, సంగీతం, టి. చలపతిరావు సమకూర్చారు. దర్శకుడు తాతినేని ప్రకాశరావు.

## 'లవకుశ'

లలితా ఫిలింస్ వారి గేవాకలర్ చిత్రం 'లవకుశ'కు ఈ నెల 6 న 'విజయా'ధిపతి శ్రీ బి. నాగిరెడ్డి వాహినీ స్టుడియోలో ప్రారంభోత్సవం జరుపుతున్నారు. తెలుగులో పరాసరి గేవాకలర్ చిత్రం తీయడం ఇదే తొలిసారి. ఈ చిత్రాన్ని తమిళంలోకూడా నిర్మిస్తారు.

• • •

## కీ. శే. గౌరీనాథశాస్త్రి

భీష్మ, శ్రీనాథ పాత్రలను వెండితెరమీద చిరస్మరణీయంగా నిర్వహించిన ప్రముఖ తెలుగు నటుడు శ్రీ జంధ్యాల గౌరీనాథశాస్త్రి ఫిబ్రవరి 22 రాత్రి హృద్రోగంవల్ల మరణించారు. ఆయన వయసు 58 ఏళ్లు.

93 ఏళ్ళ తల్లి, భార్య, ముగ్గురు పిల్లలు ఉన్నారు.

శాస్త్రిగారు నటించిన తొలిచిత్రం 'భక్తపోతన' అందులో శ్రీనాథ మహాకవిగా ఆయన చేసిన నటన సర్వుల ప్రశంసల నందుకొంది. ఆ తొలిచిత్రంతోనే ఆయన చిత్రసీమలో పెద్ద నటుడిగా పేరుపడ్డారు. తరువాతి 'మాయామచ్ఛీంద్ర'లో గోరఖ్‌నాథ్‌గా నటించారు.

వాహినీవారి 'పెద్దమనుషులు' చిత్రంలో ఆయన పంచాయతీ అధ్యక్షుడు పాత్రను ధరించారు. మంచి నటనకు తార్కాణంగా చూపుకొనే వాటిలో అది ఒకటి అనిపించుకుంది.

'గీతాంజలి', 'ఆకాశరాజు' అనే రెండు చిత్రాలను ఆయన నిర్మించి అందులో ముఖ్య పాత్రలు నిర్వహించారు.

మరణకాలంనాటికి ఆయన పాల్గొంటున్న చిత్రాలు రెండు. కాశీనాథ్ ప్రొడక్షన్స్‌వారి 'రామాంజనేయయుద్ధం'లో ఈయన అంజనేయుడి పాత్రను, రెండవ చిత్రం, వి. ఎస్. ఫిలింస్‌వారి 'భక్త రామదాసు'లో కబీరుభూమికనుతీసుకొన్నారు.

వి. ఎస్. ఫిలింస్ కార్యాలయంలో ఫిబ్రవరి 25 న సంతాపసభ జరిగింది. శ్రీయుతులు చి. నాగయ్య, పసల సూర్యచంద్రరావు, ముదిగొండ లింగమూర్తి, మొదలైనవారంతా, గౌరీనాథశాస్త్రిగారి ప్రతిభను ప్రస్తుతిస్తూ మాట్లాడారు. అనంతరం ఆయన కుటుంబానికి సానుభూతి తెలుపుతూ ఒక తీర్మానం చేశారు.



అమెరికాలో ఘనవిజయం సాధించిన సిసిల్. బి. డిమిల్ చిత్రం 'ది టెన్ కమాండ్మెంట్స్'లో ఈజిప్టు రాజుక్రింద బానిసలుగాఉన్న వేలాది ప్రజలను విడిపించవలసిందిగా ఈశ్వరాజ్ఞపొందిన పశులకాపరి (తరువాత ప్రవక్త అయ్యాడు) మోసెస్; అతని భార్య. ఈ చిత్రంలో ఈజిప్టు ఫరోవాగా యూల్ బ్రెనర్, మోసెస్‌గా చార్లటన్ హెస్టన్, అతని భార్యగా వైవన్ డికార్లో నటించారు.

# సావిత్రి గృహప్రవేశం

బొంబాయి ఫిలిం ప్రపంచంలో ప్రతి రోజూ ఎక్కడో అక్కడ హీనపక్షం రెండుమూడు 'పార్టీ'లు జరుగుతూనే ఉంటాయి. సినిమా నటులూ, నిర్మాతలూ, దర్శకులూ, కళాకారులూ కలుసుకుని కులాసాగా కబుర్లు చెప్పుకోవడానికి అవకాశం ఉంటుంది.

మద్రాసులో ఇల్లాంటి అవకాశాలు బహుఅరుదు. స్టుడియోలో సెట్ మీద తప్పితే, (అక్కడైనా అప్పటిపనికి సంబంధించినవారే ఉంటారు) మరెక్కడా పదిమందీ కలుసుకొని కాలక్షేపం చెయ్యడం పడదు. పారగన్‌టాకీసులో ప్రెస్‌షోలు జరిగినపుడు ఇలాటి అవకాశం కాస్త వుంటుంది అంతే.

* * *

గతవారం చాలా బాగా జరిగిన ఒక గృహప్రవేశఉత్సవం ఈదృష్ట్యాకూడా, పరిశ్రమలో వారందరికీ సంతోషం కలిగించింది. గృహం, సినీనటి సావిత్రి, నటుడు (జెమినీ) ఆర్. గణేష్ కట్టించిన, రెండంతస్తుల మేడ మద్రాసు త్యాగరాజనగరులోని హబిబుల్లా రోడ్‌లో (నెంబరు 11) ఈభవంతి కొత్తగా లేచింది. మార్చి 1వ తేదిరాత్రి పదిపదిన్నర గంటలమధ్య మంచి ముహూర్తాన, గృహప్రవేశం జరిగింది. మర్నాడు సాయంత్రం విందు, నృత్య, గానసభలూ జరిగాయి. రెండింటికీ తెలుగు తమిళ చిత్రపరిశ్రమ ప్రముఖులు యావన్మందీ వచ్చారు. కన్నడ, మలయాళ ప్రముఖులుకూడా కొందరు ఆయాప్రాంతాల నించి వచ్చారు.

* * *

'స్టార్లూ కార్లూకూడా పుష్కలంగా చేరినచోటు చాలా రోజుల తరవాత చూశాం' అన్నారు ఉత్సవానికి వచ్చిన ఒకాయన. రంగు రంగుల దీపావళిలో హబిబుల్లావీధీ, రంగురంగుల చీరెలతో నగలతో అలంకరించుకొని వచ్చిన చలనచిత్ర తారాళితో సావిత్రి కొత్త భవనం, కళకళలాడాయి. తోరణాలతో, పందిళ్ళతో ఆవరణలో నిలచి సరదాగా మాట్లాడుకొంటున్న చిన్నా పెద్దలతో ఆవరణ శోభాయమానంగా భాసించింది. సావిత్రి, గణేశన్‌లు అందరికీ స్వాగతంచెప్పి ఇల్లూవాకిలీ చూపించారు.

శ్రీయుతులు నాగిరెడ్డి, చక్రపాణి, రామకృష్ణ ప్రసాద్, ఎల్. వి. ప్రసాద్, ఎ. వి. మెయ్యప్పన్, మధుసూదనరావు, ఎస్. త్రివిక్రమరావు, యార్లగడ్డ వెంకన్న చౌదరి, సుందర్‌లాల్ నహతా, అశ్వత్థనారాయణ, పి. పుల్లయ్య, టి.వి. శాస్త్రి, డి. భావనారాయణ ప్రభృతినిర్మాతలూ భానుమతి,



అంజలీదేవి, జానకి, జి. వరలక్ష్మి, ఎస్. వరలక్ష్మి, శాంతకుమారి, కృష్ణకుమారి, పద్మిని, రాగిణి, బి. సరోజ, ఎం. ఎన్. రాజం, కమలాకోట్నీస్, టి. ఆర్. రాజకుమారి, టి. పి. ముత్తులక్ష్మి, ఎ. నాగేశ్వరరావు, ఎన్. టి. రామారావు, కె. జగ్గయ్య, గుమ్మడి వెంకటేశ్వరరావు, రేలంగి వెంకటరామయ్య, ఆర్. నాగేశ్వరరావు, ఎస్. వి. రంగారావు, చలం, చదలవాడ కుటుంబరావు, గాలకృష్ణ, పద్మనాభం, బాలయ్య, శివాజీ గణేశన్, ఎం. జి. రామచంద్రన్, చంద్రబాబు, తంగవేలు, సారంగపాణి, రంజన్, ఎం. కె. రాధ, వీరప్ప, ఎస్. ఎస్. రాజేంద్రన్, ఫ్రెండ్ రామస్వామి, టి. కె. షణ్ముఖం, భగవతి, టి. ఎస్. బాలయ్య, ఎస్. వి. సహస్రనామం, ప్రేమ్ నజీర్ మొదలగు నటీనటులూ, కానుకలు చదివించి, శుభాకాంక్షలు తెలిపారు. ఈ వచ్చిన కానుకలతో, కొత్తయింట్లో ఓ పెద్దగది నిండిపోయింది.

ఆంధ్ర మద్రాసు ప్రభుత్వ మంత్రులు, సావిత్రికీ గణేశన్‌కు శుభకాంక్షలు తెలుపుతూ సందేశాలు పంపించారు.

రెండవరోజు (ఆదివారం) సాయంత్రం విందు, అందుకుముందు, కమలాలక్ష్మణ్ భరతనాట్య ప్రదర్శనం జరిగాయి. ఆమెతో పాటు రాధ, వాసంతి అనే మరిద్దరు బాలికలు నృత్యంచేశారు. ఎనిమిదిగంటలకు, కొత్తయింటికిపక్క ఖాళీస్థలంలో ప్రత్యేకం వేసి, చాందినీలతో అలంకరించిన పెద్ద పందిరిలో విందుభోజనాలు ఏర్పాటు చేశారు. దాదాపు పదిహేను వందలమందికి విందు జరిగింది.

## 'వీణా ప్రవీణ'

ఆతరువాత రెండువందలమంది, ఆలస్యం అయినా సరేనని, 'వీనులవిందు' కు వచ్చి కూర్చున్నారు. ఈ ఉత్సవం పేరిట చాలా రోజులు జ్ఞాపకం ఉండేవిందు ఇదే. రాత్రి 9 గంటలనుండి 11 వరకూ, ఎస్. బాలచందర్ వీణ వాయించాడు. బాలచందర్‌ను ఫిలింప్రపంచంలో, తమిళ నటుడుగా, ఫిలిం డైరెక్టర్‌గా (తెలుగుచిత్రం 'ఏదినిజం' తమిళంలో 'అందనాళ్' 'ఇదునిజమా?' చిత్రాలకూ దర్శకుడు) చాలామంది ఎరుగుదురు. సంగీత విద్వాంసుడుగా కూడా ఆయనకు మంచిపేరుంది. విద్వాంసులు బాలచందర్ వీణాగానాన్ని మెచ్చుకుంటారు. దక్షిణాదిన ఈమని శంకరశాస్త్రి గారి తరువాత, బాలచందర్‌ని చాలా గొప్పగా చెప్పుకుంటారు. ఈ ఒకటే కాక సితార్, వయొలిన్ మొదలైనవాటిలో కూడా ఆయనకు ప్రావీణ్యం ఉన్నా, వీణా వాదనంలో విశిష్ట శిల్పిగా పేరుగడించాడు.

ఒకకథ చెప్పడంలో, ఒకవాక్యం కట్టడంలో, ఒకబొమ్మ గీయడంలో ఒకొక్క వ్యక్తి ప్రతిభావ్యుత్పత్తులుఒకొక్క ప్రత్యేక రూపం ధరిస్తాయి. ఒకొక్కరిశిల్పం ఒకొక్క విధంగా ఉంటుంది అందరికీ తెలిసిన త్యాగయ్య కృతులు అందరిలాగానే పాడే వాళ్ళు అందరిలో ఒకరుఅవుతారు. గారడీకి వడిగట్టేవాళ్ళు ఉత్తి పండితులవుతారు అలా కాక, భావుకులు అయినవారు అందరూ పాడేపాటనే పాడినా, "ఇలా కొందరే పాడగలరు" అనిపింపచేస్తారు. ఆరీతిలో ఆ వ్యక్తి ముద్ర, అతనిలోని కావ్యాంశ, అతని నిర్వచనం, వ్యాఖ్యానం నిలుస్తాయి.

బాలచందర్ పాండితి గడించిన కళాకారుడు. మంచిశిల్పి. పురాణగాధలలో వీణుల ధనుమంకారం లాగే, సంగీత ప్రపంచంలో ఒకొక్క విద్వాంసుడు వడ్డమ పంచమాలు పట్టడంలోనే ఒకొక్క ప్రత్యేకత ఉంటుంది. బాలచందర్ వీణానిక్వాణంలోనూ ఒక విశిషత ఉంది. వాద్యంలో శ్రోతల్ని అట్టే ఆకట్టి నిలబెట్టే వశ్యలను చేసుకోగల విలక్షణ శిల్పం ఉంది. మొన్నటి గానసభలో బాలచందర్ ప్రార్థన కీర్తనకాక, రెండు త్యాగరాయ కృతులు వాయించాడు. అవక రాగమాలిక ఆలపించాడు.

నాటకరంగాన'పరాబ్రహ్మ' లాగాఅందరికీ కంఠతా వచ్చిన వాతాపిగణపతింభజే కీర్తనను కొత్త బాణీలో, తన పద్ధతిలో, ఇది కొత్త అనిపించే విధాన మనోహరంగా వాయించాడు, సహజంగానే ఉత్సాహగతిని సాగే ఆకీర్తనలో బాలచందర్ స్వర

## సావిత్రి గృహప్రవేశం

కల్పన, ఉత్సాహాన్ని ద్విగుణీకృతంచేసింది. తరువాత, సరస సామదాన, ఆశ్రితజన పరిపాల, అనే త్యాగరాజ కృతులు రెండు వాయించాడు. ఆ కృతులే వో, విసే వారికి తెలియకపోయినా, వాటి భావం హృదయగతం అయేవిధంగావాయించడంలో బాలచందర్ చూపిన ప్రజ్ఞ, అరుదుగా కనబడుతుంది. భావాన్ని పలికించడమేకాక, తన వ్యాఖ్యానాన్నికూడా స్ఫురింపచేయడం విశేషం. "కోరివచ్చిన వారి కెల్లను కోర్కెలిచ్చే"—వాడికి,—ఆ సంగతి ఎన్నిరకాలుగా చెప్పి బ్రతిమాలి బామాలి, స్తుతించి, తెల్లించి పని గడుపుకోవచ్చునో బాలచందర్ వీణా వాణి వివరించి శ్రోతల్ని ముగ్ధుల్ని చేసింది. తరువాత, భూపాలరాగం ఆలాపన ఆరంభించి, కొంచెంసేపు తానం వాయించి, అక్కడనించి, పంచతంత్రంలో కథలకు మల్లె, ఒకరాగంలోంచి ఇంకోరాగంలోకి కరిగిపోతూ, వైణికుడు అతివిలాసంగా చిత్రవిచిత్ర గతులలో విహరించాడు. ఆ రాగ లతాంతాలు, అందమైన చిత్రాలు. —అందమైన అమ్మాయిబొమ్మవేసిన చిత్రకారుడు, ఉండుండి, ఒక పుట్టుమచ్చో, చెంపమీద కెంపుఛాయో ఒక కుంచెపోటుతో ఉంచినట్టు, బాలచందర్ ఒకరాగంతో చక్కనిబొమ్మ కడుతూ, మధ్యలో ఎక్కడో మనకు సుపరిచితం, ఆత్మీయం అనిపించే బాణీలో లలితస్వరాలు పలికిస్తాడు; మనల్ని పులకిస్తాడు, స్వరలహరిని, ఆవిర్భవింపచేస్తాడు. ఒక రోజుపొద్దుటే, ఒక కోయిల ఏమందో, ఒకపువ్వుఎలా వికసించిందో చెబుతాడు...

*　　*　　*

బాలచందర్ గానసభలో మరో విశేషం వైణికుడి ప్రసన్న వదనం. మామూలుగా శాస్త్రీయ గానసభలలో, పలికించే స్వరం బరువు ఎంతో పలికేవాడి వదనంలో కనిపిస్తుంది. ఈ వైణికుడు తను సుఖపడుతూ, ఎదటివాళ్లని సుఖపెడుతూ హాయిగా వాయిస్తాడు.

కచేరి జరుగుతున్నంతసేపు, సావిత్రి, పద్మిని, ఎదురుగా కూర్చొని తాళం సూచనగా వేస్తునేఉన్నారు. ★

## బొంబాయి సినిమా లేఖ

(50-వ పేజీ తరువాయి)

రూపొందించడంవల్ల దీనికి బలం చేకూరినా, అనేక సందర్భాలలో నిష్కారణంగా సాగదీసినట్లు కనిపిస్తుంది. అయినా, దీనికి తగిన విధంగా దర్శకత్వం సాగి, చిత్రాన్ని రక్తి కట్టించింది. దక్షిణభారత నాట్యతార రాగిణి నటన ఇటీవలి చిత్రాలకన్నా ఇందులో కాస్త మెరుగే. ఓ. పి. నయ్యార్ సంగీతం అహ్లాదకరంగా ఉంది.

ఈచిత్రానికి ప్రత్యేకాకర్షణ నృత్యాలు. వీటికూర్పు, రాగిణి ప్రదర్శన, మనోహరమైన ఛాయాగ్రహణం కలిసి కన్నులవిందు అనతగ్గ కాలక్షేపాన్ని సమకూర్చాయి. పద్మినికన్న రాగిణి ప్రజ్ఞావతి అనిపిస్తుంది ఇవి చూస్తే. షమీకపూర్ నటన అంతంత మాత్రంగా ఉంది. దిలీప్ కుమార్, రాజ్ కపూర్, దేవానంద్ లస్థాయిని అందుకోవడానికి ఇతనింకా కృషి చెయ్యాలి; ఇంకా మంచిపాత్రలు నిర్వహించాలి.

### ఫాషన్

'ఫాషన్' చిత్రంలో ప్రేక్షకులను ఆకర్షించేందుకు, ఆకట్టి కూర్చొ బెట్టేందుకు తగిన బలం లేదు. కథ బహుపురాతనమైనది. హైందవ పతివ్రత, దారితప్పినఆమె భర్త, కట్టుతప్పిన పిల్ల, అకార్యాలలో ఆరితేరిన ఒక దుర్మార్గవతీ కథను నడిపారు. ఈ నడక నేలబారుగా సాగింది. 'సినిమాంప్' కామెన్న అర్థ నగ్న నృత్యాలు ఉన్నా ఈ చిత్రానికి విజయం లభ్యం కాలేదు. నటన కూడా,—మాలాసిన్హా, కామెన్నలను మినహాయిస్తే—ఈ చిత్రానికి తగ్గట్టే ఉంది... సంగీతం దీనికి తీసిపోలేదు....

### లైట్ హౌస్

నిర్మాతకు, సిరిసంపదలను, కీర్తిప్రతిష్ఠలను అపారంగా గడించిపెట్టే తరహాచిత్రాలలో, 'లైట్ హౌస్' చేరదు. అశోక్ కుమార్, నూతన్ కొత్తవాళ్ళుగావచ్చి, తొలిసారిగా ఈ చిత్రంలోనే నటించడం జరిగితే, ఈ యిద్దర్నీ నటుల జాబితాలో వేసుకోవడానికి జనం ఒప్పుకునేవారు కారు అనిపిస్తుంది. వారిద్దరు ఇంతటి స్థాయికి దిగిపోవడాన్ని ఇందులో నేచూస్తాము. సంగీతం కూడా 'చాలా బాగులేదు' ★

(ఆంధ్రవారపత్రిక బొంబాయి విలేఖరి)





Printed and Published for Nageswara Rao Estates (Private) Ltd., by S. Radha Krishna at The Andhra Patrika Press. 6 & 7, Thambu Chetty Street, Madras-1. Editor: S. Sambhu Prasad



ఉన్నతాసనం

ఫోటో : గున్నేశ్వరరావు గోవింద్, ఖర్గపూర్.


పాండ్స్
డ్రీమ్‌ఫ్లవర్ టాల్క్
మిమ్మల్ని రోజంతా హాయిగా
మరియు సువాసన వెదజల్లుతూ
ఉంచుటలో సాటిలేనిది
నవోత్సాహమునిచ్చే, పరిమళముగల పాండ్స్ డ్రీమ్‌ఫ్లవర్ టాల్కమ్ పౌడరు వాడితే తీక్షణమైన ఎండతో చికాకు కలిగించే వాతావరణములో కూడ మీకు చల్లగా, హాయిగా ఉంటుంది. ఈ మెత్తని పౌడరును ఒళ్లంతా రాసుకొంటే చెమట వలన కలిగే చికాకు లేకుండా మీరు రోజంతా ఉత్సాహముగా మరియు హాయిగా ఉంటారు రోజంతా హాయిగా ఉండుటకు ఎల్లప్పుడూ పాండ్స్ డ్రీమ్‌ఫ్లవర్ టాల్కమ్ పౌడరునే వాడండి.
చీస్‌బ్రో-పాండ్స్ ఇన్‌కార్పొరేటెడ్
(పరిమితమైన బాధ్యతతో యు.ఎస్. అమెరికాలో సంస్థాపితము)
POND'S
DREAMFLOWER TALC
DREAMFLOWER TALC